# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపాదకుడు : తెలికిచర్ల వెంకటరత్నం

(13)



శరత్సంచిక

# నవ్యసాహిత్యపరిషత్తు : గుంటూరు

## గౌరవాధ్యక్షులు :

రావుసాహెబ్, మహోపాధ్యాయ, వ్యాకరణాచార్య
గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు

## ౧౯౩౬ : కార్యనిర్వాహకవర్గము :

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, అధ్యక్షుడు
చింతా దీక్షితులు, ఉపాధ్యక్షుడు
తెలికిచర్ల వెంకటరత్నం, కార్యదర్శి

## సభ్యులు :

మండపాక పార్వతీశ్వర శాస్త్రి
పురిపండా అప్పలస్వామి
మొక్కపాటి నరసింహ శాస్త్రి
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
జనమంచి కామేశ్వర రావు
పిలకా గణపతి శాస్త్రి
అడివి బాపిరాజు
కొడాలి ఆంజనేయులు
నోరి నరసింహ శాస్త్రి
తల్లావఝల శివశంకర శాస్త్రి
చిలుకూరి నారాయణ రావు
కొంపెల్ల జనార్దన రావు

## పూర్వాధ్యక్షులు :

| | |
|---|---|
| చిలుకూరి నారాయణ రావు | ౧౯౩౩ |
| రాయప్రోలు సుబ్బా రావు | ౧౯౩౩—౩౪ |
| తల్లావఝల శివశంకర శాస్త్రి | ౧౯౩౪—౩౬ |

*

# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ * నవంబరు : ౧౯౩౮ * సంచిక ౩




*

*

## "ప్రతిభ" కు విరాళములు

| | | | | |
|---|---|---|---|---|
| చిరుమామిళ్ళ విజయపార్థసారధిగారు | ... | ... | | రూ. ౨౫ |
| కాళ్ళకూరి సూర్యనారాయణగారు, బి. ఎ., ఎల్. టి. | ... | | ... | ౨౦ |
| చిలుకూరి నారాయణరావుగారు, ఎం. ఏ., పిహెచ్. డి. | | | ... | ౧౦ |
| చింతా దీక్షితులుగారు, బి. ఏ., ఎల్. టి. | | ... | ... | ౧౦ |
| డాక్టరు చాగంటి సూర్యనారాయణమూర్తిగారు | | ... | ... | ౧౦ |
| కొమ్మలపాటి ఆంజనేయులుగారు | ... | ... | ... | ౧౦ |

# విషయానుక్రమణిక


భారతీశతకము (పద్యము) గిడుగు వేంకటసీతాపతి, బి. ఏ., ఎల్. టి. ౨౧౩
నాఁడు; నేఁడు. (పద్యము) దేవులపల్లి కృష్ణశాస్త్రి, బి. ఏ. ౨౨౦
పతంగయానము (రూపిక) నోరి నరసింహశాస్త్రి, బి. ఏ., బి. ఎల్., ౨౨౧
ప్రబోధము (పద్యము) జి. జాషువ. ఉభయభాషాప్రవీణ ౨౪౦
గోపిక (పద్యము) ఉమర్ ఆలీషా ఎం. ఎల్. ఏ. ౨౪౧
నాలోమార్పు (వ్యాసము) శ్రీ శివశంకరశాస్త్రి ౨౪౨
నవ్వు (గేయము) చింతా దీక్షితులు, బి. ఏ., ఎల్. టి. ౨౫౨
శిష్టభాష (ఉపన్యాసము) మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి ౨౫౩
పురాకృతం (గేయము) శ్రీపురిపండా అప్పలస్వామి ౨౫౯
జెండా (గేయము) దేవులపల్లి కృష్ణశాస్త్రి, బి. ఏ. ౨౬౦
రాష్ట్రీయ స్వాలక్షణ్యము - రక్షకుడు (వ్యాసము) పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి ౨౬౧
ఆనందమూర్తి (పద్యము) సి. గణపతిశాస్త్రి, సాహిత్యశిరోమణి ౨౬౨
ప్రకృతిసఖ్యము (పద్యము) బొడ్డు బాపిరాజు. ౨౬౭
హితసూచని (వ్యాసము) శ్రీ కురుమళ్ల కామేశ్వరరావు బి. ఏ. బి. ఇడి. ౨౬౯
కృత్యాద్యవస్థ (వ్యాసము) విశ్వనాథ సత్యనారాయణ ఎం. ఏ. ౨౭౭
విశ్వపర్యటనము (వ్యాసము) కందర్ప వెంకటరామశాస్త్రి, ఎం. ఏ. ౨౮౪
గ్రంథ విమర్శనము ౨౯౩
సంపాదకీయ వ్యాసములు ౩౦౫


## విన్నపము

నవ్యసాహిత్యపరిషత్సభ్యులూ, చందాదారులూ, దయ ఉంచి సాధ్యమైనంత త్వరలో తమ చందా రూ ౨ పంపవేడుతాము. నాలుగవ సంచిక వి. పి. ద్వారా పంప నవసరం లేకుండా చేయవలెనని ప్రార్థన ... ప్రతిథ సంవత్సరం చందా రూ ౨

కార్యదర్శి నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు.

# ప్రతిభ
## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ : ధాత : శరత్సంచిక : సంచిక 3

# భారతీశతకము

గిడుగు వేంకట సీతాపతి

కవికిన్ లక్షణవేత్తకున్ సరిగ లోకంబే ప్రమాణం బగున్;
వ్యవహారాంచితశిష్టశబ్దములు సభ్యంబుల్ ప్రయోగార్హముల్;
కవియున్ శిష్టుఁడు; శిష్టశబ్దములతోఁ గావ్యంబులన్ జెప్పఁజోఁ
గవి పల్కే పలుకెల్ల గ్రాహ్యమని పల్కన్ జెల్లదే? భారతీ!

అరయఁ బ్రసిద్ధమైనవ్యవహారమునందలి శబ్దరూపముల్
సరసకవిప్రయోగమున సాధువు లైనను, గ్రొత్త వైనచో
నెరసు లటంచు దిద్దఁ దగునే? కవులెల్ల రసజ్ఞులై వచ
స్సరణి నెఱింగి, కావ్యములు శ్రావ్యముగా రచియింతురు భారతీ!

వ్యవహారంబున లోకు లాడుకొనుజీవద్భాషనే మున్ను మా
కవులందున్ దొలినాఁటివారు కృతులన్ గావించి యుండంగఁ, ద
ద్వ్యవహారోక్తులె తొంటిలాక్షణికసూత్రాలందు గన్పట్ట, మా
వ్యవహారోక్తుల నేల గ్రామ్యములుగా భావింతురో భారతీ!

వరదలు వచ్చునప్పుడు ప్రవాహమునందలి నిర్మలాంబువుల్
బురదల నిండియుండుక్రియ లౌకికభాషలు గ్రామ్యశబ్దసం
కరపదదోషయుక్తములు గావున( దేటపనీరమట్టు, లే
నెరసులు లేక శుద్ధముగ నిల్చును శిష్టులభాష భారతీ !

తొల్లిటి లక్షణంబులకు దూరములై కనబడ్డ శబ్దముల్
చెల్లకయుండె( బూర్వ ; మవి శిష్టజనవ్యవహారసిద్ధిచే(
జెల్లు నటంచు సత్కవులు చెప్పిన కావ్యములందు నిల్చుటన్
జెల్లు నటంచు( బండితులు చెప్పుదు రిప్పుడుగాదె భారతీ !

తమకున్ బూర్వకవిప్రయోగముల యాధారంబు లేకుండినా
తమపూర్వుల్ రచియించు లక్షణము నడ్డంచున్ విరోధించినా
సమకాలవ్యవహారశబ్దములతో సత్కావ్యముల్ సత్కవుల్
సుమనోహృద్యముగా రచించి; రవి నే( జూపింతు నో భారతీ !

అరయన్ దొంటివిభక్తి నేకవచనంబందున్ 'ను' వర్ణంబు 'కూ(
తురు' శబ్దంబున నిల్చియుండినను 'కూ(తుల్, కూతు(' నిత్యాదులౌ
పరరూపంబుల( గానరాదనుట యొప్పా?[1] యెందరో సన్నవో
తరు లీవర్ణము నన్నిటన్ నిలుప(గా( దప్పేమి? యో భారతీ !

తిరముగ నిల్చె( బ్రాసమున దిద్ద(గరాని తలంబునందు 'కూ(
తురి' కను షష్ఠిరూప, మది తొంటికవీంద్రులు వాడకున్న, నే
యరమర( బొందకుండ బహులాశ్వచరిత్ర( బ్రయుక్తమయ్యె( "కూ(
తురిచెలువంపు జేనియెదతుందుడు కెల్ల[2]" నటంచున్ భారతీ !

వరుసన్ దిక్కనసోమయాజి తన స్త్రీపర్వాన,[3] నెఱ్ఱన్నయున్
హరివంశంబున[4] శబ్దసిద్ధిగని గ్రాహ్యంబంచు( 'గూ(తుండ్రి'నన్
మరి యా చిన్నయ ధర్మశాస్త్రమున నీమాటే ప్రయోగించియున్[5]
నిరసింపన్ దగునమ్మ వ్యాకరణమం దీరూపమున్ భారతీ !

1 చూ. బాలకవిశరణ్యము పుటలు 28-39
2 ఆ 1. పద్యం 8.
8 II. 166
4 ఉ. I. 4
5 పుట 47. పేరా 194 (2వ కూర్పు)

'ఎల్లయు', 'నంతయుఁ', 'మఱియు', 'నేమియు', 'బిందెయు', నొప్పెఁ
దెల్లయుకారలోపమున నేర్పడు రూపములుఁ జెలంగె; నం [దొల్లి; యం
'దెల్లను' 'నంత' నంచు రచియించెను నన్నయ;[6] 'అన్ని' 'నిట్టిదిఁ'
జెల్ల రచించెఁ దిక్కన;[7] ప్రసిద్ధులుగారొకో వీరు? భారతీ!

అంతా యంచు సముచ్చయార్థమునఁ దప్పౌనే ప్రయోగింప? నే
చింతా లేకయె కాదె ధూర్జటి రచించెఁ గాళహస్తీశనా
మాంతంబై యలరారు పద్యముల;[8] నింకా యెందరో యిట్టి దీ
ర్ఘాంతంబైనపదంబులఁ గృతుల వ్రాయఁ లేదె?[9] యోభారతీ!

"తల్లిఁ దండ్రియు" నంచుఁ బెద్దనయు "నంతర్యామివిఁ నీ" వనుఁ;[10]
"చల్లాయంబలిఁ ద్రావితిఁ రుచులదోసం" బంచు శ్రీనాథుఁడుఁ[11]
"అల్లితాపుని" యంచు నాచనయు[12] వ్రాయఁ జూచి యందాము "మే
మెల్లా వస్తిమి," "తల్లివీ తనయువీ"? యేమందువో? భారతీ!

"సమ్మానసమ్మతి" యంచుఁ దిక్కనయునఁ దప్పంచు నాతావునఁ
'సమ్మాఁ' నిల్పిరిగా![13] "వినివినని" శ్రీనాథప్రయోగంబు, వృ
త్తిమ్రాఁగ దొప్పను నైషధంబునను;[14] దిద్దఁ జూతువే? యిట్టిరూ
పమ్ముల్ కావ్యములందు, వాడుకను గన్పట్టుఁ గదా[15] భారతీ!

నే నేదో ప్రతి చూపి గ్రాహ్యమనినఁ నే నొప్పుకోనందువా,
పోనీ పింగళసూరనార్యుఁడు కళాపూర్ణోదయంబందుఁ దా
"మానీమానని" యంచు ద్వ్యర్థిగ నిపాఠఁ బ్రయోగించె;[16] లో
కానఁ నిల్చినయట్లు; గ్రాహ్యమని పల్కఁ జెల్లదే! భారతీ!

"రోసిందేఁటికి రొంతలేఁటికి మహారోగస్థుఁ" డంచుం గదా
వ్రాసెన్ ధూర్జటి[17]; అత్యయుక్తపునవర్ణంబందు నజ్లోపమున్
జేసెన్ మూఁడుపదంబులందు నిఁక నేఁ జెప్పిందియొప్పైన నే
వ్రాసిందేఁటికి నొప్పుగాఁ బరిగణింపఁజాలవో భారతీ!

6 అరణ్య III. 264. చూ. బాలకవిశ. పు. 252
7 ఉద్యో. II. 328; III. 95.
8 శతకం. శా. అంతాసంశయమే.
9 చూ. బాలకవిశ. పు. 131-136; 216-255.
10 మను. III. 98; II. 76
11 వీధినాటకం.
12 V. 200.
13 శాంతి. II. 351.
14 VI. 8[3]
15 చూ. బాలకవిశ, పు. 251-255.
16 VII. 19.
17 శ్రీకాళ. శతకం. 71

పరిమాణార్థమునన్ 'గొలంది' యనుశబ్దం బేగతిం "గొద్ది"గాఁ
బరిణామంబును బొందెనో, యెటులఁ గావ్యాలన్ గవుల్ వాడిరో
పరిశీలింపక గ్రామ్యరూప మనుచున్ వజ్రాయుధం బెత్తువా
రెరయన్నేర్తురె పల్కుపోలికలు, ధర్మాధర్మముల్ ? భారతీ ![18]

కనవే 'కొద్ది'ని పెద్దకోశములలోఁ,[19] గావ్యాలలో మాటమా
న్య నశక్యంబగు వృత్తపద్యములలోఁ[20], బ్రాసాంచితంబై పురా
తనకావ్యంబగు రంగనాథుద్విపదన్, దాశరథీశతకమ్మునన్[21],
గనుపర్తిప్రియకావ్యపద్యములలోఁ[22] గన్పట్టు నో భారతీ !

'వలవ'దనన్ 'వలా'దనఁగ 'వ'ల్దన 'వ'ద్దని యేర్పడున్ గదా;
'చలిది'కిఁ 'జల్ది'కిన్ మఱియుఁ 'జద్ది'కి నేర్పడునర్థభేదముల్;
'కొలఁది'యుఁ 'గొల్ది'గా మఱియుఁ 'గొద్ది'గ మారుట వింతయౌనొకో?
'తలఁచుట' 'తల్చు'టై, 'తరిలు' తర్లిగ మారునుగాదె భారతీ !

"కొలఁదిని మున్ను చెప్పెఁ జలికోపసి నృసింహుఁడు వెల్ల యంచు, నీ
వల సగనాల పెద్దపనువాఁడును మొల్కలటంచుఁ గూరిచెన్
దెలియక" యంచు నప్పకవి నేరక చెప్పెఁగదా "లకారరే
ఫలతలనై యకారమును బాపుట దోస" మటంచు భారతీ ![23]

'మొలక'కు 'మొల్క' 'మొక్క'యని 'మొల్వ'దటంచును నత్వలోపమున్
దలపక పాండురంగనికతన్ రచియించిన రామకృష్ణుఁ డీ
పలుకులు కృష్ణరాయలసభాస్థలిఁ దప్పులటంచుఁ బల్కెనే?[24]
నెలకొను నిట్టిరూపము లనేకము భారతమందె భారతీ !

ఒనరెన్ దిక్కన 'నొగ్గిం'చ్చినయె నాయుద్యోగపర్వంబునన్;[25]
వనపర్వంబునఁ 'దల్లు' మంచు రచియింపన్ లేదె యెఱ్ఱన్నయున్?[26]
దనరున్ భాగవతంబులోఁ 'దరలు'కున్ 'ద'ర్లన్నరూపంబు;[27] వ
ల్దనినన్ మాటలు మారవే జనులు మాట్లాడంగ నో భారతీ !

---

18 చూ. "కొద్దిమొట్టు"; వజ్రా I. 1. పు. 7)
19 శర. మొ. చూ. బాలకవి శ. పు. 141
20 చూ. బాలకవి శ. పు. 143-144
21 చూ. శ. ర. IV. 106
22 అని. II. 21; కవిరాజును పు. 82
23 చూ. బాలకవిశ. పు. 187
24 III. 101 IV. 331; III. 179 V. 193
25 II. చూ. శ. ర.
26 VI. చూ. శ. ర.
27 IV. చూ. శ. ర.

'పలికితి' 'పల్కితిన్'వలెనె 'వ్రాసితి' 'వ్రాస్తి'యుఁ గాదె? చూస్తివే
పలువురు నిట్టిరూపములు వాడిరి; యాప్రభులింగలీలలోఁ
గలవు[28] వచింపనేల శతకంబులమాట? 'సహిస్తి' 'వస్తివే'
'తలఁపు తలస్తి' 'యిస్తి'వనఁ దప్పులు గావనవమ్మ భారతీ!

"ఓనాఁ" "డోదిన" మన్నఁ దప్పగలదే "యో"ర్తన్న లేకున్నచో?
శ్రీనాథుండు రచించినట్టి యలకాశీఖండపద్యంబునం
దోనాఁడన్నవిధానఁ గూర్చెనుగదా "యోరాత్రి" యం చొప్పగా;
దీనిన్ దిద్దఁగరాదు వృత్తచరణాదిన్ గూర్చుటన్ భారతీ![30]

'మా'యని నైషధంబునను,[31] 'మానెఱజాణవు' హంసవింశతిన్[32]
'సాయము'రీతి నేర్పడును; 'జాపరమేశ్వర' మల్లసింగనల్
వ్రాయఁగ లేదె మున్నలవరాహపురాణమునందు[33]? 'నేమ' మ
ల్లే యగు; నిట్టిరూపముల నెందరొ వాడిరికాదె భారతీ!

అనుమానింపక పార్వతీపరిణయంబం దాదిపద్యానఁ గూ
ర్చెనుగా "పర్వతరాజకన్యను వరించే వేళ" తత్కర్త[34]? వా
డెనుగా "పెద్దలు తద్దనమ్మ నుయి దాఁటేవానికిన్" బాండురం
గనిమాహాత్మ్యమునందు రామకవియున్?[35] గాదందువే భారతీ!

గెడపంబూనుట నాకు దొడ్డ "గుడి మింగేవానికిన్ దల్పు ల
ప్పడముల్" నాఁగఁ బ్రబోధచంద్రునుదయింపన్ జేయుకావ్యాన సొం
పెసరన్ మల్లన సింగనార్యులు రచింపన్[36] జూచి యిట్లెందరో
కనుహృద్యంబుగ నిట్టిరూపములు పల్కన్ బూనిరో భారతీ!

"ఇరువైనాలుగుమూళ్ల మేర" యనికాదే వ్రాసె శ్రీనాథుఁడే![37]
"అఱువైయోజనముల్ వెడల్పున" వరాహస్వామియే చూచె;[38] "నూ
టిరువైయెన్మిదిభేదముల్" నరసరాజే యొప్పగా నెంచె;[39] నే [భారతీ!
మరి "యాభై" "నలభై" కిఁ జేర్చియివి "తొంభై" యందునా?[40]

28 పు. 14, 54
29 బాలకవి శ. పు. 235-240
30 V. 189
31 VI. 95
32 IV. 104
33 I. 148
34 (రఘునాథమహీపాలుడు) I. 1.
35 IV. 275.
36 ప. 67.
37 [illegible] I. 9.
38 వరాహ పురాణము. 18.
39 నరస II. 50.
40 బాలకవి శ. పు. 150-151.

అరయుఁగ కాశిఖండమున,[41] నప్పకవీయమునందు,[42] రుక్మిణీ
పరిణయ[43]హంసవింశతుల,[44] భాగవతంబున[45] నిట్లు పెక్కుటన్
స్థిరముగ నిల్చెనా మడికి సింగనకాలమునుండి నేటికిన్
"గలచుకపోయె" నన్నటుల క్త్వార్థకరూపము లమ్మ భారతీ !

మంచిదిగాఁదలంచి ప్రథమంబునఁ బద్మపురాణమందు "సం
ధించుక"యంచు సింగన రచించెను;[46] బల్వురు నిట్టిరూపముల్
మించినవేడ్కఁ గైకొనిరి; "మీసలు దీటుచు దిక్కుడుంగముల్
చించుకపాఱ" నంచు విరచించెను ధూర్జటి[47]గాదె ? భారతీ !

"ఎందుకు" తప్పుగాఁ దలఁచి 'యెందున' 'కెందుల' కన్నరూపముల్
కొందఱు వాడుచుందు రది కూడునె ? నన్నయభారతంబునం
దెందును గానరాదుగద యెందున కన్నపదంబు ; దానిలో
'నెందుల' కన్న నర్థమగు 'నెచ్చటి' కిం చరయంగ భారతీ !

'పరువుకు', 'కారవేంద్రుకును', 'వంతుకు' వంటిపదాలు చంద్రికా
పరిణయ[48]పంచతంత్రములఁ,[49] బద్మపురాణమునందు,[50] సోమునను
త్తరహరివంశమందు,[51] ప్రథితం బగునన్నయభారతంబునం[52]
దరయఁగ నింకఁ బెక్కుకృతులందుఁ గనంబడుఁగాదె ? భారతీ !

వాండ్లున్ వీండ్లని రాధికాధవులసంవాదంబునన్ లేదె ?[53] కో
డండ్లల్లుండ్లని లంచకాండ్లనుచు వాడన్ మానిరే కొంద ఱె
న్నేండ్లోయై కవు లిట్టిశబ్దముల నెన్నేనిన్ బ్రయోగించినా
వాండ్లన్ 'వాండ్ర'ని దిద్దుచుందు రిదియా పాండిత్య మో భారతీ !

వాఁటిన్ వీఁటిని వాంటి వీంటి కనురూపా లేమి గ్రామ్యంబులే ?
వీఁటిన్ బెక్కుకవీశ్వరుల్ కృతుల నిర్భీతిన్ బ్రయోగించినా
మాటల్ మార్చుచు దిద్దినారు యతులున్ ప్రాసంబు లడ్డైనచో
వేఁటిన్ దిద్దక యుంచినారో యవి గన్పించున్ గదా ? భారతీ !

41 శ. ర. బాలకవిశ. పు. 179
42 IV. 316; V. 91
43 I. 62
44 I. 193
45 V. 2-145
46 III. 72
47 కాళ. మా. II. 155
48 IV. 102
49 I. 70
50 ఉ. I. 116
51 II. 40 ; VI: 140
52 బాలకవి శ. పు 112
53 పు. 49

అలరును సీసపాదమున నప్పకవీయమునందు "వీఁటిలో
పల నొకమూఁటిచే"ననుచుఁ బ్రాసయతిస్థలి;[54] నింక నిట్టివే
కల వితరస్థలంబులను; గన్పడకుండఁగ దిద్దినారు; లో
కులవ్యవహారమందు గని కూర్పఁగవచ్చును వీఁటి భారతీ!

"నుండి"యు "నుంచి" యట్ల క్రియనుండి జనించిన క్త్వార్థకంబుగా
నుండియు సంధికార్యమున నుత్తుకుఁ గల్గు సవర్ణ మంగమై
యుండుటచేత వాడుకను "నుండి"యు, "నుంచి"యుఁ బ్రత్యయంబులై
యుండఁగ, 'నుంచి'కన్న నిది యుత్తమమెట్లు వచింపు భారతీ!

'ఉండి'యె 'నుండి'యైనటుల 'ఉంచి'యు 'నుంచి'యగున్ ద్రుతంబుపై
నుండుటచేత; "స్వర్గముననుండిపడెన్" "దివినుండి రాలె" ని
ట్లుండెను బూర్వ; మీవలను "వ్యోమమునుండిపడెన్", "జయంబు మీ
నుండియె కల్గు," "పర్వతమునుంచియె తెచ్చితి" నొప్పు; భారతీ!

అతిహృద్యం బగు కృష్ణరాయవిజయంబందున్,[55] మహాపాండితీ
చతురత్వంబును జూపుచున్ వసరు నా జ్ఞానప్రసూనాంబికా
శతకంబందును[56] 'నుంచి' రూపమును బ్రాసంబందు నిల్పంగఁ జూ
చితిగాదే? ఇది తప్పుగాఁ దలఁతువే? చెప్పంగదే భారతీ!

పలువుర్ 'వఝ్ఝులు' 'వాడరేవు' పయిగా 'వాడ్రేవు' 'వడ్డాది' గాఁ
బలుకన్ బండితు లింటిపేళ్ళు గ్రహియింపన్ శంక లేనట్టివా
రలు 'వడ్డాణము' 'వాడ' 'వద్ద' 'వకమార్' 'వయ్యార' మన్ శబ్దముల్
పలుకన్ జెల్లదు కావ్యమం దనుట యొప్పా? చెప్పుమా భారతీ!

మనమూ యాటల 'నాడుదా' మని రచింపన్ రాధికాసాంత్వనం
బను కావ్యంబునఁ[57] "బొందుదాము" యనఁగాఁ బట్టాభిరామాయణం
బున;[58] నీరూపము లున్నమంచిశతకంబుల్ పెక్కు లుండంగ; వీఁ
టిని గ్రామ్యంబులుగాఁ దలంపనగునంటే యొప్పునా? భారతీ!

54 IV. 270
55 IV. 26.
56 వ. 39.
57 I. 57.
58 III. 70.

ఆమహనీయుభక్తుఁ డగుత్యాగయ కీర్తనలందు పాడెఁ 'జూతా'మని;[59] రంగరాయచరితంబున దిట్టకవిందుఁ డాడె 'నిల్తా'మని;[60] అత్తులూరుకవి తాను రచించుపురాణమందు 'విందా'మని వ్రాసె;[61] నింకనివి తప్పులుగా వనవమ్మ భారతీ!

— సశేషము —

*

# నాఁడు : నేఁడు

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

నాఁటి యామిని వేఁ బోకఁ దోఁటలోనఁ
బాటలో మేలుకొన్న స్వప్నములు మూఁగె
పాటల పలాశములు నా గవాక్షవీథి
నా నయనములనుండి నాలోన నిండి.

ఎంత మెత్తని యడుగుల నేఁగుదెంచి
నావో నానయి నాకుటీరాజిరమున ;
నేను రావచ్చునా యన్న నీపిలుపు వి
నంబడదు నాఁటి యూహాంగణములఁ జొచ్చి.

పోయె నా కోయిలలకారు, పోయెను నవ
మల్లికలవేళ, శ్రావణ మ్మాశరత్తు
మూలమూలల నీపర్ణశాల నేఁడు
హిమపదాంకములే తల లెత్తి పిలుచు.

జీవితము మృతిగా సుప్తశిలగ నుండె
గొంతు చీఁకటిగా మాట కొసరి రాక
'నీవు రావోయి' యని పిల్వనేర కిపుడు
నేను రాలే నంటం చేద్వ నైన లేను.

59 చూతాము రారె etc., 60 II. 181 61 III. 119

# పతంగయానము

నోరి నరసింహశాస్త్రి

[ కైలాసగిరికందరములో ఒక గుహ. క్రిందిభాగములో మునిపల్లె ఒకటి కన బడుతూ ఉంటుంది. ప్రొద్దుపొడుపుకు ఆరుగడియలముందు. జటాయువు మేలు కొని ఉన్నాడు. ఎంత ప్రయత్నించినా అతనికి నిద్రపట్టడంలేదు. సంపాతి సుఖంగా నిద్ర పోతున్నాడు. ఇంతలో అతను నిద్రలో కాస్త కదలినాడు.]

జటాయువు : [రెక్కలు విదిలిస్తూ] అన్నా !

సంపాతి : [నిద్రలో] ఊఁ !

జ : అన్నా! అన్నా! ఇంకా మెళు కువ రాలా ?

సం : [బద్ధకంగా] ఊఁ !

జ : [అసహనంగా] తెల్లవారు తున్నది ఇంకా లేవవేమన్నా ?

సం : [ఒళ్ళు విరుచుకుంటూ కాస్త తల ఎత్తి చూసి ఆవలించి మళ్ళీ పడు కుంటూ] ఇంకా కాస్త నిద్రపోయే పొద్దు ఉన్నట్లున్నదే !

జ : నాకు నిద్ర పట్టడంలే దన్నా!

సం : [శ్రద్ధతో] ఏం తమ్ముడూ?

జ : మనస్సు అంతా ఏదో కలవ రంగా ఉన్నది.

సం : [కళ్ళు నులుముకుంటూ లేచి ఆదరంగా] ఎందుకోయి నాయనా?

జ : ఏమో తెలియదు, అన్నా. ఒళ్లంతా చురుకు చురుక్కు మంటూ ఉంటుంది. రక్తనాళాలనిండా నెత్తు రుకు బదులుగా అగ్నిజ్వాలలు ప్రవ హిస్తున్నవా అనిపిస్తున్నది. అస లీదే హమే ఒకపెద్ద ప్రళయాగ్నిగోళంగా మారిందేమో.

సం : నిజంగానా? ఎంతచక్కని బంగారపు ముద్దవోయి నీవు! అగ్ని స్పర్శవల్ల మేరువువంటి నీదేహము మెరుగెక్కుతుందిలే.

జ : ఈతాపము భరించడ మెట్లా!

సం: నిన్న నేను చాలులేరా అంటు న్నకొద్దీ వినక వేకువనుంచీ చాలా పొద్దుపోయేదాకా విరామంలేకుండా ఒకటే విధంగా ఎగురుతుంటి వాయెను హిమవంతముమీద! ఒళ్లేమైనా బడ లిక చేసిందేమో !

జ : ఇంతమాత్రానికేనా? మరీ చీకటిపడి కళ్ళు కనపడక ఎగరడము చాలించాను గాని, అంతసేపు ఎగి రినా నాకు రవ్వంతైనా అలుపే రాలే దన్నయ్యా - ఇంకా ఎగురుదా మనే ఉంది.

సం: మరేమిటి తమ్ముడూ, ఐతే!

జ: నా రెక్కల దురద ఏమీ తీరటంలేదు. రాత్రిల్లా నీవు హాయిగా నిద్రపోతూ ఉంటే నాకేమాత్రం నిద్రే పట్టలేదు. నా రెక్కలు ఈగుహలో నిలవకుండా ఉన్నవి. ఒకటే లేచిలేచి పోవడము పైకి.

సం: కాస్త శాంతించవలెనోయి వత్సా!

జ: శాంతించడము ఎట్లా అన్నయ్యా! మొన్న మన మా తుపానులో మహాసముద్రముమీద షికారు కొట్టితిమే! ఆ గాలివానకు పొంగి పొర్లుతున్న సముద్రుడికి ఏమన్నా శాంతి ఉందా? ఆసముద్రమల్లే నా దేహమంతా ఉబికి పడుతుంటే శాంతి లభిస్తుందా!

[సంపాతి జటాయువుదగ్గరకు వాత్సల్యముతో వెళ్లి వీపున చేయి ఉంచుతాడు.]

జ: [హాయిగా మైమరచి] అన్నా!

సం: తమ్ముడూ!

జ: ఎంతచల్లగా ఉన్నదన్నా నీ కరస్పర్శ! నీచేతిబరువుతో నాహృదయంలో బరువు ఉపశమిస్తున్నది.

సం: [నిమురుతూ] ఇప్పు డెట్లా ఉంది, బాధ?

జ: మలయపర్వతంమీద మనము ఎగిరిపోతున్నప్పుడు చల్లని చిన్ని చేతులతో వాయువు మనలను నెమ్మదిగా దువ్వుతూ ఉంటాడే, అంతకంటేకూడా నీస్పర్శ హాయిగా ఉన్నది అన్నయ్యా!

సం: [సంతోషముతో] ఎంత ముద్దులతమ్ముడ వోయి!

జ: నిన్ననే,- నేను హిమవంతములో కాంచనగంగమీదికి పోయి అక్కడ కాస్తసేపు విశ్రమించినాను. అప్పుడు ప్రాలేయము దూదిపింజలవలె తెల్లగా ఒంటినిండా కురిసింది. నా ఒళ్ళంతా కప్పుపడి ఈకైలాసశిఖరమున్నట్లు ధళధళలాడింది. అప్పుడున్నంత చల్లగా ఉంది నా ఒళ్లిప్పుడు!

సం: పిచ్చితమ్ముడూ!-చూడు, ఈ ఉషఃకాలము ఎంతమనోజ్ఞముగా ఉన్నదో. గిరికందరాలన్నీ శకుంతరుతములతో ప్రతిధ్వనిస్తున్నవి. నిద్రపోతున్న మునిపల్లె మేలుకున్నది. లోకమంతా సందడిగా ఉంది.

జ: ఎర్రదామరవంటి నీ దేహము మీద ఈఉషఃకాంతి పడి ప్రతిఫలిస్తూ ఉంటే సాక్షాత్తుగా ఉదయిస్తున్న సూర్యభగవానునివలె ఉన్నావన్నా! నా కిప్పుడు బాలభానుడి సన్నిధానములో ఉన్నట్లే ఉన్నది.

సం: సూర్యు డంటే, అశోకపుష్పమో దొండపండో అనుకుంటున్నావు కాబోలు, ఇక్కడనుంచి చూసి. ఆయన మహాప్రళయాగ్నిగోళ మోయి!

జ: [సంపాతిరెక్కలు తడువుతూ] అన్నయ్యా, నీరెక్కలు రెండూ బదరీనాథాలయంలోని కంచుఘంటలకంటె గట్టివై, కండలు తేలి విశాలమైనవిగా

ఉన్నావే! ఈభూలోకము దాటే పోవే మన్నా?

సం : ఎక్కడికి వెళ్లేదోయి!

జ : [సంపాతిముక్కు పుణుకుతూ] నీముక్కు ఉక్కుముక్కకన్నా కఠినంగా ఉన్నా, అది సరిగా ప్రయోగించవేమన్నా?

సం : ఏం జేసేది తమ్ముడూ?

జ : [సంపాతిమెడ నిమురుతూ] అన్నా, గంగాయమునానదులు పుట్టిన హిమవంతములో కోనవలే నీమెడ ఇంతవిశాలంగా ఉన్నా, అందనిమాని పళ్లకోసము నీ వెప్పుడూ అరుచాచవేమన్నా?

సం : దేనికోయి మరి?

జ : ఈబలమంతా ఏమిచేసుకోను నీకు?

సం : [చిరునవ్వుతో] ఐతే ఏంజేతామోయి?

జ : నా ఒంట్లో ఈబద్ధకమంతా తీరే దెట్లా?

సం : నాతో మల్లయుద్ధం చేతువుగాని, లే!

జ : నీతో మల్లయుద్ధ మేమిలాభంలే దన్నా.

సం : [నవ్వుతూ] ఏం?

జ : నామీద ఆపేక్షచేత నన్ను గట్టిగా నీవు రెక్కలతో చరచనే చరచవు. నీరెక్కలు నా ఒంటికి తగిలితే విసనకర్రతో విసరుతున్నట్లు చక్కలిగింత కలుగుతుంది. ఆ ఇనపముక్కుతో నన్ను నీవు పొడుస్తుంటే ముద్దుపెట్టుకుంటున్నట్లు ఉంటుందే కాని పొడిచినట్లుగానే ఉండదు.

సం : నీవుమాత్రమో మరి! నాతో మల్లయుద్ధముచేస్తూ ఉంటే నీవు 'నన్ను కొట్టు, నన్ను పొడిచి చీల్చివేయు' మని అంటూన్నట్లు ఊరికే నిలుచుంటావుగాని సరిగ్గా పోట్లాడుతున్నట్లే ఉండవాయె!

జ : అవు నన్నా! పూజ్యపాదుడవైన నిన్ను ఆటలో మాత్రము నిజంగా ఎట్లా కొట్టగలనోయి!

సం : మరైతే ఏంజేతామో నీవే చెప్పు, పోనీ. మళ్ళీ హిమవంతము ప్రదక్షిణము చేతామా?

జ : ఎబ్బే!

సం : వింధ్యము చుట్టివత్తామా?

జ : అన్నా, నీ వొక హిమవంతమవయితే నే నొక వింధ్యమును. నీవు అరుణాద్రివయితే నేను హేమాద్రిని. మనకు ఈపర్వతాలచుట్టూ గిరగిర తిరగడము ఆత్మప్రదక్షిణము చేసుకున్నట్లే ఉంటుంది.

సం: పోనీ మలయపర్వతముమీదికి పోతే నీహృదయజ్వరము శాంతిస్తుందేమో!

జ : [మూతి విరుస్తూ] ఛ్ఛీఛ్!

సం : పోనీగాని మేరువు మూడు సార్లు ప్రదక్షిణముచేసి వత్తాములే ఇవ్వాళ. లే, మరీ!

జ : ధీరుడ వైననీవు ఇంత అల్ప సంతోషివే మన్నయ్యా!

సం : [ విసుగుతో జటాయువుపీపు మీాద చేయి తీసి ఇవతలకు వచ్చి] ఇక నాబుద్ధికి ఏమీా తోచడంలేదు. ఏంజేదా మంటావో చెప్పు మరి.

జ : [ అకస్మాత్తుగా దీనంగా ] నిన్ను విడిచిపెట్టి ఉండలే నన్నా!

సం : [ ఆశ్చర్యంతో ] ఇక్కడే ఉంటినిగాదు టోయి!

జ : ఏదో పరాకుగా అట్లా అన్నానుగానీ, ఈ ఆవేదన తీరే దెట్లా అన్నా! - ఇటువంటిపాడుమాట నా నోట వచ్చిందేమి చెప్మా! - పోనీ గానీ, నాగపాశాలవంటి నీ రెండుచేతు లతోనూ నన్ను దృఢంగా బంధించి నుసినుసి అయ్యేట్లు నలిపివేయరాదూ? అప్పటి కేమన్నా ఈహృదయభార ము శమిస్తుందే మోను!

సం : ఎందుకోయి ?

జ : మొన్న వృత్రాసురుడి మహా కాయాన్ని దేవేంద్రుడు ఖండించినట్లు వజ్రాయుధంవంటి నీముక్కుతో నా ఒళ్ళంతా తూట్లుతూట్లుపడేట్లు పొడిచి వేసి తీక్ష్ణమైన నీ ఉక్కుగోళ్ళతో ఒంట్లో మాంసపుకండలు వచ్చేట్లు నన్ను రక్కి చీల్చివేయ లేవూ?

సం : [నవ్వుతూ] ఏమిటోయి ?

జ : సంపాతిఅన్నా, ఆగోత్రభేది పర్వతాల రెక్కలు నరికివేయక ముందు పర్వతరాట్టుకు ఉన్న రెక్కల లాంటి నీవిస్తారమైన రెక్కలతో నా వీపంతా ముక్కలు ముక్కలుగా బద్దలుచేద్దూ, కాస్త!

సం : నీకేం మతి పోలేదుగదా!

జ : నాకూ అదే అనుమానం! నాతలనిండా అస్తమానమూ మంచు ముద్ద కూరినట్లు దిమ్ముగా ఉంటుంది. సూర్యభగవానుని కాంతికి భయపడి పారిపోయిన లోకాల చీకటి అంతా నాగుండెల్లో వచ్చి దాక్కున్నట్లుగా ఏదో అయోమయంగా ఉంటుంది. నారెక్కలు గాలిపోసుకున్నట్లు పై కెగరగొట్టుకు పోతూఉంటవి. కాళ్ళ ల్లోనూ గోళ్ళల్లోనూ ఎప్పుడూ పురుగులు తొలుస్తూ ఉన్నట్లు నన్నెక్కడా ఒకచోట నిలవనీయవు. ఇదంతా ఎందువల్లనైయుంటుందిచెప్మా! ఉన్మాద మేమో!

సం : [చిరునవ్వు నవ్వుతాడు.]

జ : ఏమి టన్నా, అట్లా నవ్వు తావు! నువ్వు నవ్వుతుంటే నాకు ఏడుపుకూడా వచ్చేట్లు ఉన్నది.

సం : [ముసిముసినవ్వులు నవ్వుతూ ఉంటాడు.]

జ : గట్టిగా ఏడుపన్నా వస్తే బాగుండును! గంగావతరణానికి ముందు

హిమవంతుడిగర్భమువలె నామనస్సు నిండుకొని ఉన్నది. వరదలో పొంగి పారే కృష్ణానదివలె కన్నీళ్ళప్రవాహం కారుస్తేనన్నా, కాస్త తేలిక ఇస్తుందేమో! - నాఅవస్థకు జాలి ఐనా లేకుండా అట్లా నవ్వుతావేమన్నా!

సం : [నవ్వు ఆపుకోవలెనని ప్రయత్నిస్తూ] అఁ! - ఏమీ లేదులే.

జ : మరేమిటి !

సం : మరే ! - మరే ! - [ సంశయిస్తాడు.]

జ : [ఆతురతతో] ఏమిటన్నా ! ఏమిటన్నా !

సం : ఏమీ లేదు. మరే! - ఊఁ!- నీవు ఇప్పుడుపడే అవస్థే - నేనూ ఒకప్పుడు పడ్డదేనోయ్ !

జ : ఆఁ? ఆఁ? ఇంత అవస్థా?

సం : ఇంత అవస్థా, మరీ ఇంకా ఇంత అవస్థా! - అది వర్షాకాలము! నీవు అప్పుడు మాటలన్నా రాని పసివాడివి. ఇట్లా నాగోడవ చెప్పుకుంటే వినేవాళ్లైనా ఎవరూ లేరు.

జ : నిజంగానా? ఎట్లా భరించావన్నా?

సం : ఇది ప్రతిప్రాణికీ సహజమోయి. ఇంతసర్వసామాన్యమైనా, ఎప్పటికప్పుడు ఎవరికి వారికి క్రొత్తగానే ఉంటుంది. సృష్టివైచిత్ర్యము!

జ : నీమాటలు నాకు ఒక్కముక్కయినా అర్థంకావడం లేదు.

సం : ఆరోజున ఆకాశంనుంచీ మేఘుడు ధారాపాతంగా వర్షం కురుస్తున్నాడు. ఈదురుగాలి జీవులను వణికించివేస్తున్నది. అట్టి సమయంలో నాహృదయంలో బడబానలంవలె తాపము ఎగబాక మొదలుపెట్టింది.

జ : [ నోరు తెరుచుకొని కళ్ళు పెద్దవిగా విప్పి] అయితే ఏమయింది అన్నా ?

సం : ఆగాలీ ఆవానా ఉరుములతో మెరుపులతో మహాభయంకరంగా ఉంది. ఆ బాహ్యప్రకృతికంటే నా అంతఃప్రకృతి మరింత భయంకరంగా ఉన్నది.

జ : అయితే ?

సం : అట్లా మూడురాత్రులూ మూడుపగళ్ళూ నిద్రాహారాలు లేకుండా ఉన్నాను. పాపము ! నీవు ఆహారముపెట్టే దిక్కు లేక ఆకలివేసి ఏడ్చి ఏడ్చి, చివరకు నిస్త్రాణవల్ల కునికిపాట్లు పడసాగినావు. ఐనా నీసంగతే నాకప్పుడు తలకెక్కలేదు.

జ : ఏంజేశావన్నా ?

సం : జ్వరతాపమువలే ఒళ్ళంతా ఉడుకెత్తిపోయింది. ఊరికే ఎడాతెరిపీ లేకుండా 'కూఁ, కూఁ, కూఁ' అని బిగ్గరగా మూలుగు సాగించినాను. నామూలుగు ఈకైలాసగిరిగహ్వరాలన్నీ ప్రతిధ్వనించినవి.

జ : నీతపన ఎట్లా శాంతించిందీ! చివరకు ?

సం : వినూ, మరి. చాలాసేపు నేను మూలుగుతుంటే, దానిప్రతిధ్వనిన్నీ, పైనుంచిపడే పిడుగులమోతా, తప్ప మరేమీ వినబడలేదు. కొంత కాలానికి నామూలుగూ దానిప్రతిధ్వనీ అణిగి పోగానే, ప్రతిధ్వనికి ప్రతిధ్వని వలే, ఆవర్షపుధారలమీదుగా దూరాన్నుంచి నామూలుగులాంటిమూలుగే వినిపించసాగింది. చాలాసేపటిదాకా అది నామూలుగుప్రతిశబ్దమేకదా అనుకొని ఊరుకున్నాను.

జ : తర్వాత, తర్వాత ?

సం : ఒక్కొక్కసారి ఆమూలుగు నాదానికంటే ఉచ్చస్థాయిలో వచ్చి సంగీతమల్లే చెవుల్లో అమృతస్రావము కలిగించి అప్పటికప్పుడు చిత్రంగా మనశ్శాంతి కలిగిస్తూ వచ్చింది.

జ : అంతసేపూ అట్లాగే మూలుగుతూ పడి ఉన్నావా ?

సం : లేదు. మాంద్యంగా మూలుగుతూ పడిఉన్న నాకు, దుర్దినంలో అకస్మాత్తుగా కనిపించిన సూర్యకిరణమువలె, అది ఎవరిదో నావలెనే ఉన్మత్తరుతము అని అనిపించింది. వెంటనే నేను ఒక్కసారిగా, కర్ర తగిలిన కోడెత్రాచువలె, రివ్వున పైకి లేచాను. ఆలోచించకుండా బాణవేగముతో ఆకూజితము వస్తున్నవేపుకు ఒక్కటే దీర్ఘప్లుతస్వనం చేసుకుంటూ ఎగిరి పోతున్నాను. అదికూడా 'కూ ఊ ఊ ఊ ఊ ఊ!' అంటూ అట్లాగే ఒకటే ఉచ్చైస్స్వనంతో నాఅంత వేగంతోనే నావైపుకే ఎగురుకుంటూ దగ్గరదగ్గరకు వస్తున్నది. మాకు అన్యోన్యదర్శనము కాకముందే మా షడ్జస్వరాలు రెండూ ఏకమై శ్రావ్యముగా భూనభోంతరాళము నిండి ప్రతిధ్వనించినై.

జ : [ఆశ్చర్యముతో] ఏమిటన్నా అది?

సం : [చిరునవ్వు నవ్వుతూ సందేహిస్తాడు.]

జ : చెప్పక అట్లా నవ్వుతావేమన్నా!

సం : అవునోయి ! ఆనాడే ఈ కైలాసశిఖరాగ్రముమీదనే నాకు నా సహచరియొక్క ప్రథమదర్శనమైంది. అలకాపట్టణంలో ఏ యక్షవియోగినికో ప్రియసందేశము తీసుకొని పోతున్న ఆ ఆషాఢమేఘుడే సాక్షిగా, ఆమేఘుగంభీరగర్జనములే ఆశీర్వాక్యములుగా, ఆవర్షధారలే మంత్రాక్షతలుగా, మాకు ఇద్దరికీ ప్రథమసమాగమ మయింది. ఆ పిమ్మట వేలితో తీసివేసినట్లు నాతాపమంతా ఒక్కసారిగా ఉపశమించింది.

జ : [పేరాశతోఉన్నవాడికి అకస్మాత్తుగా నిరాశ కలిగినట్లుగా నిట్టూర్పు పుచ్చి పట్టలేని చిరాకుతో] ఇంతేనా, అన్నా! - ఐతే నాకుకూడా ఇది అటువంటిశాపమే అంటావా ?

సం : అవును.

జ : నాకట్లా తోచడంలేదన్నా !

సం : ఎందువల్ల ?

జ : పెంటిపక్షులతో సాహచర్యముచేసిన అనుభవము నేనూకాస్త ఎరుగుదునన్నా ! కాని-

సం : [మాటకు అడ్డువచ్చి ఆశ్చర్యముతో] ఏమన్నావు ?

జ : [జంకకుండా] అవునన్నయ్యా! అటువంటి అనుభూతిలోకూడా ఒక చిత్రమైన పారవశ్యము తాత్కాలికంగా కలుగుతుందని ఒప్పుకుంటాను. కాని అదేమీనాకుతృప్తిగాలేదన్నా. పైగా నాకందువల్ల ఈభూలోకపతంగాలమీాద విరక్తికూడా కలిగింది.

సం : [మూతి బిగించుకొని] నీమాటలు నాకు చిత్రంగా ఉన్నవే.

జ : [ బ్రతిమాలు గొంతుతో ] అవును అన్నయ్యా ! - నేను చేసింది ఏమైనా తప్పయితే దాసుని తప్పు క్షమించు. అన్నయ్యా ! నీ కిదే నమస్కారము !

సం : [ప్రసన్నుడై] తప్పేమిటికాని ఎంతవాడివిరా !

జ : ఏమున్నదీ ? సకలప్రాణిధర్మము !

సం : అట్లాఅయితే, నే ననుకొన్నట్లుగా నీఅశాంతికి ఇది కారణము కాకపోవచ్చు. నీవు మొదటినుంచీ చిత్రమైన ఊహాలు కలవాడవు. నీవు ప్రాకృతవ్యక్తివి కాదోయి.

జ : నాకదేమో తెలియదుకాని మృణ్మయమైన ఈలోకమంటే నాకిష్టములేనిమాట వాస్తవము.

సం : నీవు నీపసితనంనుంచీ యింతేనోయి. అన్నీ అసాధ్యమయినవి కావలెనని కోరేవాడివి. ఆకాశమంతా ఒక పెద్దచెట్టు అనుకొని అందులో చంద్రుణ్ణీ నక్షత్రాలనూ సూర్యుణ్ణీ కోసితెచ్చిపెట్టమని నన్ను ఏమి ఏడిపించేవాడి వనుకున్నావు ?

జ : అన్నా, నిజంగానా ? ఐతే ఒకమాట చెబుతా, నవ్వవుకదా !

సం : ఊఁ !

జ : మరే - ఇప్పుడుకూడా నాఊహాలన్నీ అంతే అన్నా ! నే నెప్పుడు కలగన్నా చంద్రమండలానికీ నక్షత్రమండలానికీ సూర్యమండలానికీ ఎగిరిపోతున్నట్లుగా కలలువస్తవికాని హిమవంతమూ వింధ్యమూ కలల్లోరావు.

సం : మనశ్శక్తికి మించిన ఊహాలు పనికిరావోయి నాయనా! అత్యుచ్ఛ్రయము పతనహేతువు అని పెద్దలంటారు కాదూ ?

జ : పెద్దలేమైనా అంటారుకాక ! ఎప్పుడూ నేలమీాద ఉండేవాడు ఎట్లా పడతాడు ? పైకెక్కినవాడే పడేది. పైకెక్కడము ప్రధానముగాని,ఎక్కిన తర్వాత ఒకవేళ పడితేమాత్రమేమి

నష్టమన్నా ? ఈపాడునేలలో ఎప్పుడూ పడి ఉండి బురదలో పురుగుల వలె కుళ్ళుతూ ఉంటే మే లంటావా ?

సం : అది కాదోయి. మనశక్తికి మించిన ఊహాలుమాత్రము ఉండ రాదు.

జ : హనుమంతుడికి వలె నీ శక్తి నీకు తెలియదన్నా. కామరూపులమైన నీవూ నేనూ తలుచుకుంటే మనకు అసాధ్యమైనకార్యము ఏముంటుంది?

సం : కాస్త అణకువ ఉండవలె నోయి.

జ : ఈ ముసలివాళ్ళమాటలు నీ కెట్లా పట్టుపడ్డవన్నా ! ఈనీతివా క్యాలు నన్ను కుంగదీస్తవి. ఉత్సాహా తిశయముతో మధ్యమధ్య కాస్త ఒళ్లు మరిచిపోకపోతే ఎట్లా ?

సం : నాకు పాలపొంగు అణిగి పోలేదుటోయి మరి !

జ : నీకా ? నీకున్న శక్తిసామ ర్థ్యాలు ఇంకా ఎవరికున్నవో చెప్పూ, చూద్దాము.

సం : కాదోయి. మనకు ఏ శక్తి లేశమున్నా, అదంతా ఆపరమేశ్వరుని కటాక్షలేశమే అనుకోవలె. మనదని గర్వించరాదు.

జ : నీ దేహము ఎంత బలవంత మైనదో నీ మనస్సు అంత దుర్బల మైన దేమీ ? ఉత్తమమైన ద్విజజా తికి పరమేశ్వరుడ వైన నీకంటే వేరే పరమేశ్వరుణ్ణి నే నెరగను.

సం: అట్లా అనరాదోయి. చూడూ, అరుణోదయవేళ ఐనది. ఆకాశమంతా ఎర్రపడ్డది. పూజ్యులైన తాతపాదు లను ధ్యానిద్దాము. [సంపాతీ జటా యువూ ధ్యానిస్తారు.]

సం : ఒకమాట చెబుతాగాని విం టావూ ?

జ : చెప్పూ - ఈ అశాంతి తగ్గే ఉపాయ మేమైనా చెబుదూ !

సం : నీ కెప్పుడూ ఉన్నతపదవి మీద దృష్టి ఉంటుంది కాదూ ?

జ : కొంతవర కట్లాగే !

సం : ద్విజరాజ్యానికి నీకు యావ రాజ్యము కడతాను. లేకపోతే నీవే ద్విజరాజ్యము చేస్తూ ఉంటే నేను తపస్సు చేసుకుంటూ చూసి సంతో షిస్తాను.

జ : [ చెవులు మూసుకొని ] అన్నా, నామీద కోపము వస్తే శిక్షించడానికి వేరే మార్గము నీకు కనపడలేదా, ఈవిధంగా ములుకుల వంటి మాటలు ఆడకపోతే ?

సం : నాకేం కోపము ? నీయందు ప్రేమాతిశయమువల్ల అంటూఉంటే!

జ : అన్నా, ఉన్నతపదవి అంటే, నీ కుమారుడు పొందవలసిన యావ రాజ్యమూ, అన్నివిధాలా శ్రేష్ఠుడ వైన నీరాజ్యమూ నేను కాజేయువలె

నవా నేను కోరుకొనేది? నీ తమ్ముడికి అంత అల్పబుద్ధి కలుగుతుందా?

సం: ఊరికే అపార్థము చేసుకుంటావేమీ? నాకు నీవంటే భేదబుద్ధి లేనే లేదు.

జ: కాదులే అన్నా! నీ మనస్సుకు నేను పొరపాటున ఏదో కష్టము కలిగించి ఉంటాను. లేకపోతే నాతో ఇట్లా మర్మచ్ఛేదకంగా మాట్లాడి ఉండవు. నా తప్పుకు శిక్షగా నే నీరోజు ఈ గుహాలోనుంచి ముడుచుకొని బయటికి కదలనే కదలను. [అని కాయమంతా ముడుచుకుంటాడు.]

సం: ఏమిటి ఈ పిచ్చివేషాలు! ఇవ్వాళ వాయుమార్గం దాటి శుద్ధ ఆకాశంలో తిరుగుదాము రా, లే!

జ: రాను క్షమించు అన్నా!

సం: నా చిన్నతనంలో ఒకసారే— ఒంటరిగానే – చంద్రమండలానికే– ఎగిరి పోయినాను.

జ: [ఆశ్చర్యంతో కళ్ళు తెరిచి తల ఎత్తి] నిజంగా?

సం: కొంత పైకి ఎగిరిపోయిన తర్వాత దిక్కులే తెలియలేదు. ఆపైన రాత్రిదో పగలేదో తెలియక కాలమానమే పోయింది. చంద్రమండలము ఎన్నాళ్ళకు చేరానో చెప్పలేను. నా మనస్సుకు మాత్రము అది ఒక యుగముగా తోచింది.

జ: [ఆశ్చర్యంతో] అన్నా!

సం: చలి అంటే ఏమిటో ఈ లోకంలోవాళ్లకు ఏం తెలుసును! మనకు ఇక్కడ తెలిసిన చలి హిమవత్పర్వతంలో చలికాలంలో గడ్డలు కట్టుకొనిపోయే చలేగా?

జ: మరి అక్కడ?

సం: అక్కడా? ఆ చలి అనుభవిస్తేనేగాని చెబితేనూ ఊహిస్తేనూ తెలిసేది కాదు. అంత చలీ వేస్తుంటే, అది చలో ఒళ్ళు కాలిపోయే మంటో కూడా తెలియకుండా పోయింది. నిద్రాహారాలు లేకుండా ఎన్నాళ్ళో వెళ్లి వెళ్లి ఒళ్ళంతా ఉడుకెత్తిన నాకు, అక్కడికి వెళ్లగానే ఒక్కసారి ఒళ్లంతా బిగుసుకుపోయి కట్టెబారింది. ఒంట్లో నెత్తురు పారకుండా నిలిచిపోయింది. రెక్కలు అసలే ఆడలేదు. స్మృతితప్పి పడిపోయినాను.

జ: ఎంత అదృష్టశాలి వన్నా! చంద్రమండల యాత్ర చేశావా, నిజంగా?

సం: అదృష్టశాలినే కాకపోతే మళ్ళీ ఇక్కడికి జీవంతో ఎట్లా వచ్చాను! ఈ లోకంలోకి మళ్ళీ నా శక్తివల్ల గానీ నా ప్రయత్నం వల్లగానీ నేను రాలేదు. ఆ భగవంతుడే ఆ పడిపోయిన కట్టెను ఇక్కడ తెచ్చి పడవేశాడనుకుంటాను. నాకు చంద్రమండలము వద్ద పోయిన స్మృతి మళ్ళీ ఈ కైలాసశిఖరం మీదనే వచ్చింది. నాకే చిత్రంగా ఉంది.

జ : అంత యాత్ర చేసిన తర్వాత జీవిస్తే ఏమి, జీవించకపోతే ఏమి ! నీ వెంత గొప్పవాడి వన్నా !

సం : నా కిక్కడ ఒళ్ళు తెలిసిన తర్వాత నిద్రపోయి లేచిన వాడినల్లే ఉన్నానే గాని ఏమీ బడలిక లేక పోయింది. కల గన్నానేమో అనుకున్నాను. కాని ఇక్కడి ఋషు లంతా వచ్చి నన్ను చంద్రమండలము వెళ్ళి వచ్చినందుకు అభినందించి చిరజీవి వైనావని ఆశీర్వదించారు. ఆ యాత్ర నాకు నెలరోజులు పట్టిం దన్నారు. అక్కడనుంచీ నాకు ఆకలీ దప్పీ లేవు.

జ : చంద్రమండలములో అమృత ప్రాశన చేసి ఉంటావు !

సం : కావచ్చు. కాని మళ్ళీ ఆ తర్వాత ఈ భూలోకము వదిలిపెట్టి మరోలోకము వెళ్ళడానికి ధైర్యము చాలడం లేదోయి.

జ : నేను అసమర్థుణ్ణయి ఎప్పుడూ ఇట్లా మూలపడి ఉండవలసినవాణ్ణే దివాంధమల్లే. ఈ దౌర్భాగ్యపుజన్మ ఎందుకు ఎత్తినా నన్నా !

సం : నీ కేం కర్మమోయి ! నా కంటె నీవు ఎక్కువవాడివి కాని ఏ మాత్రమూ తక్కువ కాదు. బంగారం వంటి నీ దేహకాంతి చూడూ. పోనీ ధైర్యం చేస్తాను కాని, మళ్ళీ – చంద్ర లోకానికి పోదాము రా. చంద్రమండలములో చంద్రకాంతి నీ బంగారపు రెక్కలమీద పడితే ఆ వెన్నెట్లో మేరువువలె నీవు ప్రకాశిస్తావు. నీవు కూడా చిరంజీవి వవుతావు, లే!

జ : చిరకాలము జీవించి ప్రయోజన మేమన్నా! బ్రతికి ఉన్న నాలుగు నాళ్ళూ గొప్పగా పేరు ప్రతిష్ఠలతో బ్రతికినవలె గాని ! ఇవ్వాళ నేను ఇక్కడనుంచి కదలను అన్నయ్యా!

సం : అదేమిటోయి! నీకోసమని ఇవ్వాళ సాహసిస్తాను. నక్షత్రమండలానికి పోయి ఆ నక్షత్రాలు ముక్కులతో పొడుచుకుచ్చి చంద్రకిరణాలతో గుచ్చి హారం కట్టి నక్షత్రమాల ఈశ్వరుడికి అర్పించుదాము, రా ! చెప్పిన మాట విని, లే !

జ : ఏమైనా చెప్పు ! అన్న మనస్సు నొప్పించిన ఈ పాపిష్టివాడు ఇవ్వాళ ఇక్కడనుంచి లేవడు.

సం : ఛా! నాకేమీ నొప్పి కలుగ లేదంటూఉంటే అసహ్యంగా కోపం వచ్చేట్లుగా మొండిపట్టు పడతావేమి ? లే ! – పోనీ గాని ఇవ్వాళ నీ వెక్కడికి పోదామంటే అక్కడికి నేను సిద్ధము; నీ వేమి చేదామంటే దానికి తయారు !

జ : నామీద ఇవ్వాళ నీకు కోపం రాలేదు కదా, నిజంగా ?

సం : రాలేదు, నిజంగా.

జ : ముమ్మాటికీ ?

సం : ముమ్మాటికీ !

జ : నేను ఎక్కడికి రమ్మన్నా అక్కడికి నిజంగా వస్తావా ?

సం : ఆ, వస్తా !

[తెరలో మునీశ్వరులు]

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ ॥ ర.

[ఒక్క క్షణము నిశ్శబ్దము. మళ్ళీ తెరలో మునులు]

ఉద్యంత మస్తంయంత మాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ త్సకలం భద్ర మశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద । అసావాదిత్యో బ్రహ్మ॥

జ : [ఆలకించి చివాలున లేచి] ఆమునీశ్వరు లంతా ఏమి చేస్తున్నారో చూచావా ?

సం : మునీశ్వరులా, సూర్యభగవానునికి అర్ఘ్యమిచ్చి ఆదిత్యోపాసన చేస్తున్నారు.

జ : ఆదిత్యుడు మన కులదైవము కూడా కాదూ! నీవు మాట తప్పకూడదు సుమా! మన మా ప్రత్యక్షదైవాన్ని ఆ జగత్సాక్షిని సూర్యమండలానికే ఎగిరి పోయి గర్భాలయంలో ద్విజోత్తములవలె ఉండి ఉపాసన చేతా మివ్వాళ! లే, అన్నా!

సం : [నిర్ఘాంతపోయి మాట్లాడడు.]

జ : మాట్లాడవేమన్నా? ఇప్పటికి ఎంతకాలంనుంచో ఆ పతంగరత్నాన్ని స్పృశించి రావలె నని కోరికగా ఉంది!

సం : [మౌనము]

జ : మన కగపడే సమస్తజ్యోతులకూ కారణభూత మైన ఆసూర్యజ్యోతిని ఒక్కసారి సమీపించి దర్శించి గాఢాలింగనము చేసి ఈ జన్మ సార్థకము చేసుకోవలె నని ఉంటుంది - అన్నా! మాట్లాడవేం !

సం : [మౌనము]

జ : ఒక్కొక్కసారి బంగారపు ముద్దలాగానూ, ఇంకొక్కప్పుడు రక్తపు విగ్రహంవలెనూ, మరొకవేళ శుద్ధజ్యోతిః స్వరూపంగానూ, ఇంకా ఎన్నో రకరకాలుగా ఆ జగజ్జ్యోతి కనపడుతుంటాడు. ఏ చిత్రకారుడి రంగుల సంచీలోనూ దొరకని రంగులతో, ఏ శిల్పీ ఊహించలేని చిత్ర చిత్రమైన ప్రాసాదాలూ, విగ్రహాలూ, చిత్రాలూ, ఆకాశరంగం మీద ఉదయాస్తమయాలలో క్షణానికి ఒక కొత్తవిధంగా కల్పిస్తూ ఉంటాడు ఈ మహాశిల్పి. ఈ చిత్ర ఖగరత్నమే నా మనస్సును రాత్రింబవళ్ళూ ఆకర్షిస్తూ ఉన్నది.

సం : [అంత కంతకు ఎక్కువ ఆశ్చర్యముతో మౌనము.]

జ : అట్లా బెదురు చూపులు చూస్తూ మాట్లాడ వేమిటి అన్నా?

ఈ మధ్యమలోకవాసులకు ఆదిత్య మండలము దృష్టికి అవధిగా ఉండి ఆ మండలము అవతల ఏమేమి అద్భుతమైన లోకాలు ఉన్నవో కనపడకుండా అడ్డు తగులుతున్నది. అన్నయ్యా! మన దూరదృష్టికి ఈ ఆటంకము భరించలేకున్నాను నేను. ఆ పై లోకాల స్వరూపము తెలుసుకోవలె నని ఉంటుంది నాకు. నేను కూచున్నా నిలుచున్నా పడుకున్నా ఎగురుతున్నా, నాకు అదే ఊహ ఎల్లప్పుడూ! నయానో భయానో ఆదిత్యమండలము భేదించుకొని పోవలె ననే నా కెప్పుడూ!

సం: [మాటలు వారిస్తున్నవాని వలె] ఆఁ! - ఆఁ! -

జ: ఏం? ఆదిత్యమండలము భేదించడము అసాధ్యమా అన్నా? మునీశ్వరు లంతా ఆమార్గంగానే పైలోకాలకు వెళుతా రని చెబుతారు కదూ!

సం: [జాలితో] సర్వసంగపరిత్యాగము చేసిన అద్విజవృషభులకూ కేవలద్విజనామధారుల మైన మనకూ సాపత్యమా, తమ్ముడూ? వాళ్ళు మాత్రము ఈ పాంచభౌతిక దేహాలతో ఆమార్గాన పో గలరా-?

జ: ఒకరికి సాధ్య మైనది మనకు మాత్ర మెందుకు సాధ్యము కాదు? నీ భయ మేమిటి? వెళితే ఏ మవుతుం దనీ!

సం: అసలు అక్కడికి వెళ్ళగలుగుతే గదా!

జ: ఈ దేహాలతో అక్కడికి వెళ్ళడము ఎవరికీ చేతే కా దంటావా? అయితే మన తాతపాదులు సూర్యరథసారథ్యము చేయడంలేదా?

సం: అవును కాని మనకూ వారికీ పోలికా?

జ: అన్నా, వారు సంపూర్ణపరిణతి లేకుండా జన్మించిన అనూరులు కదా, పురాణపురుషులు కదా! పరిపుష్టి కలిగి వారికి జన్మించి ఇట్లా యౌవనమదంతో ఉన్న మనకు వారితో సమాన మైన శక్తి ఐనా లే దంటావా?

సం: [వెకిలినవ్వుతో] నిన్ను చూస్తే నాకు నవ్వు వస్తున్నదోయి. మన తాతపాదుల మహిమాతిశయము సంగతి మన అమ్మగారు శ్యేనీదేవి నాకు చిన్నప్పుడు చెబుతూ ఉండేది. నేనూ నా యౌవనోద్రేకములో ఇట్లాగే తండ్రిగారి దర్శనానికి వెళ్ళవలె నంటే అమ్మగారు ఒకరోజు బాగా కోపపడ్డది. మన తాతపాదుల కాలి కొనగోటికి కూడా మనము పోల జాల మని చెప్పింది. అప్పటి నుంచీ మాతృశాసనము శిరసావహించి నేను మళ్ళీ పతంగలోకయానము తలపెట్టలేదు.

జ: తల్లులకు తమ పిల్ల లెప్పుడూ పసివాళ్ళుగానూ దుర్బలులుగానూ కన

పడుతూ ఉంటారు. మాతృప్రేమకు అది సహజము. మన కనిష్ఠపితృవ్యులు కూడా సూర్యలోకము దాటి అన్ని లోకాలూ సంచరిస్తా రని వింటామే!

సం : అవును. అయితే ?

జ : అన్నా, మన పితృవ్యులు శతృవుల దాస్యంచేస్తూ చాలాకాలం గడిపి చిన్నతన మంతా పసిగా నిద్రాహారాలు లేక జాలిగా పెరిగినవారే! స్వేచ్ఛావృత్తిలో పుట్టి పెరిగి నిరంకుశంగా చరిస్తూ జీవిస్తున్న మనకు వారికున్న శక్తి లేదంటావా ?

సం : [పకపకా నవ్వుతాడు]

జ : [చిన్నపుచ్చుకుని] అట్లా నవ్వుతావు, ఏమన్నానూ ?

సం : గరుత్మానులను దర్శించే భాగ్యము నా కొకసారి అబ్బిందోయి. వారి రూపూ తేజస్సూ శక్తీ అతిలోకమయింది. వారిని చూసిన వాళ్ళు మనలను వారితో పోల్చుకుంటే, ఇట్లాగే పకపకా నవ్వుతారు. హస్తిమశకాంతరము వారికీ మనకూ.

జ : ఆత్మశక్తి ఎరగని హనుమానుడ వన్న, నీవు పోనీగాని వానర మాతృడైన ఆ హనుమంతుడు సూర్యలోకానికి వెళ్ళలా ? ఆయనకు రెక్కలైనా లేవే ?

సం : పోను పోను ఎక్కువవాళ్లే నీకు పోలికకు కనబడుతున్నారే. ఆ మహాత్ముణ్ణి వానరమాత్రు డన్నావా? ఆ మర్కటమూర్తి పూర్వాపరాదుల్ని రెంటిలో రెండు పాదాలూ ఉంచి జగత్సాక్షివద్ద సర్వవిద్యలూ నేర్చినాడు. పోనీ, నీవు అట్లా నిలబడూ, చూతాము.

జ : నీవు ప్రతిదానికీ ఇట్లాగే అంటావు.

సం : [కఠినంగా] ఎంత ఉత్సాహమైనా ఉండవచ్చును గాని స్వస్వరూపజ్ఞానముమాత్రము ఉండవలె !

జ : [పశ్చాత్తాపముతో] పెద్దలను ధిక్కరించవలె నని మాట్లాడలేదు, నేను; ఈ దేహముతో సూర్యలోకయానము కష్టసాధ్యమే కాని అసాధ్యము కాదని అనడానికి అన్నాను గాని !

సం : [ ప్రసన్నుడై ] పోనీలే ! గంధర్వులు తీక్ష్ణకాములు. భుజంగమాలకు కోపము తీక్ష్ణము. మృగాలకు భయము తీక్ష్ణమైనది. అన్నిటికంటే తీక్ష్ణమైన క్షుధగలవాళ్లము మనము. సుఖంగా కుడిచి కూచోలేక ఎందుకు నాయనా మన కీ ప్రయత్నము ?

జ : ఏ దెట్లా ఉన్నా ఒక్క సంగతి చెబుతా విను. మనము ప్రకృతి సిద్ధంగా ఆకాశచారులము. చివరకు ఆ ప్రయత్నములో మనకు నిధనమే కలిగినా, పతంగయానము చేసి తీరవలసిందే.

సం : అగ్నిశిఖను మింగవలె ననే ఆశతో పరుగులెత్తే పతంగాల గతే

మనకూ పట్టుతుందేమో అని నా సంశయము.

జ : అట్లా ఐనా నాకు సమ్మతమే, మన కంతా తెలిసిన ఈ భూలోకంలో, చూసిందే చూస్తూ తిరిగే కంటె !

సం : నీ కోరిక మార్చుకోలేవూ !

జ : అన్నా, చూడు, ఆ సూర్య కిరణాలు ఎన్నెన్ని రంగులతో మన మీద ప్రసరిస్తున్నవో! ఆ సహస్ర కరుడు ప్రతికిరణంతోనూ నన్ను 'రా, రా' అని పిలుస్తున్నట్లుగా నాకు కని పిస్తున్నది. ఇనుమును అయస్కాంతం మల్లే నన్నా భగవానుడు ఆకర్షిస్తు న్నాడు. పోనీగాని ఒక పని చేస్తే ?

సం : ఏమిటి ?

జ : నీకు కూడా అక్కడికి రావలె నని ఉత్సాహం లేకపోతే, నన్ను ఒక్కణ్ణే వెళ్ళడానికి అనుజ్ఞ ఇయ్యి. సూర్యమండలం చూసివస్తాను.

సం : [ఆదరముతో] నీవు వెళ్ళు తూఉంటే దేహాభిమానంతో వెనక ఉండే భీరువు ననుకున్నావా నేను ? నాభయమంతా నీ యందలి వాత్స ల్యాతిశయంవల్ల గాని నాకోసం గాదు.

జ : [ బతిమాలుతూ ] అయితే వెళుదాము, లే !

సం : తప్పదూ ?

జ : ఊఁహూఁ !

సం : [లేచి] అయితే గాయత్రిని ధ్యానము చేతాము !

[ఇద్దరూ కొంతసేపు ధ్యానము చేస్తారు. ఇంతలో తెరలో మునీశ్వ రులు చేస్తున్న సూర్యోపస్థాన మంత్రం వినవస్తుంది.]

మిత్రస్య చర్షణీధృతః శ్రవో దేవస్య సానసిం సత్యం చిత్రశ్రవ స్తమమ్ । మిత్రో జనాన్యాతయతి ప్రజానన్ మిత్రో దాధార పృథివీ ముత ద్యాం మిత్రః కృష్టీ రనిమిషాభిచష్టే సత్యాయ హవ్యం ఘృతవ ద్విధేమ । ప్ర స మిత్ర మర్తో అస్తు ప్రయస్వా న్యస్త ఆదిత్య శిక్షతి వ్రతేన న హన్యతే న జీయతే త్వోతో నైన మంహో అశ్నో త్యంతితో న దూరాత్ ॥

[ఉభయులూ - సంపాతి సావ ధానముగానూ జటాయువు తొందర తోనూ - ఆలకిస్తారు.]

జ : ఆశ్రమర్షులంతా సూర్యోపస్థా నము చెబుతున్నారు. మనము కూడా సూర్యమండలోపస్థానము చేయడానికి మంచి సమయ మిదే, బయలుదేరు దామా ?

సం : [రెక్కలు అప్పళిస్తూ బిగ్గ రగా] ఊఁ !

జ : [రోమాంచముతో] అన్నా, కార్యక్రమానికి ఉపక్రమిస్తే ఎంత ప్రతిభాశాలి వోయి. నీ రెక్కల చప్పుడుకు గిరిగహ్వారా లన్నీ విజయ భేరీధ్వని వలె ఎట్లా ప్రతిధ్వనిస్తున్నవో

వినూ! ఈ పర్వతారణ్యసత్త్వాలన్నీ భయపడి చెల్లాచెద రవుతున్నవి.

సం : [వీరావేశముతో] మనలో సూర్యమండల ప్రస్థానముచేసి ఎవరు ముందర తిరిగి వస్తారో, పందెమేనా ?

జ : పందెమే.

సం : నీవు గెలిస్తే నీ కొక ముద్దు!

జ : నీవు గెలిస్తే నీ కొక సాష్టాంగ నమస్కారము !

సం : [చిరునవ్వుతో] కరువులేని పందెములే.

జ : మనము మళ్ళీ సూర్యాస్తమయంలోగా ఇక్కడికి తిరిగి రావలె.

సం : [ఉద్రేకముతో ఎగురుతూ] కూ ఊ ఊ ఊ ఊఁ!

జ : నీవు 'కూఁ' అంటే ఎంతశ్రావ్యంగానూ మేఘఘోషవలె ఏమి గంభీరంగా ఉన్నది అన్నా ! నాకు రోమహర్షం కలుగుతున్నది. కూ ఊ ఊ ఊ ఊ ఊఁ !

[జటాయువుకూడా పైకెగురుతాడు]

[తెరలో మునీశ్వరులు]

ఇంత ఆర్భాటంగా ఎక్కడికరా వెళ్లుతున్నారు ?

సం : [స్వగతము] ఏమిటీ అపశకునము !

జ : మే మిద్దరమూ పందెము వేసుకొని సూర్యమండలానికి వెళ్ళుతున్నాము. అస్తమయానికి ముందు తిరిగిరావలె. మీరే మాపందెముకు సాక్షులు.

[తెరలో మునీశ్వరులు]



ఒకరు : ఎంత సాహసమోయి!

ఇంకొకరు : వాళ్ళ కసాధ్య మేముంది !

మరిఒకరు : ఎంతవాళ్ళయితే మాత్రము సూర్యలోకయాత్ర చేయగలరా?

చాలామంది : [ఆశ్చర్యంతో] ఆఁ! ఆఁ! ఆఁ! ఆఁ ?

సం : [స్వగతము] మళ్ళీ అపశకునపు మాటలే వినబడుతున్న వే! [ప్రకాశముగా] తమ్ముడూ! -

జ : అన్నా, ఈ మేఘాలు చూడు. కిందినుంచి చూస్తే రశ్మిమాలినికూడా కనపడకుండా దట్టంగా కప్పివేసి పరుగు పరుస్తవి. ఇక్కడికి వస్తే ఏమీ లేదు. వట్టి పొగే! ఇట్లాగే సూర్యుడు కూడా ఐతే ?

సం : తమ్ముడూ! ఒక్కసారి భక్తితో గురుదేవులైన తాతపాదులను నీవుకూడా స్మరించుకోవోయి! [ఒక్కసారి సూర్యమండలమువేపు దృష్టి సారించి] తండ్రీ అరుణభగవన్, నీ సన్నిధికి వస్తున్నాము, రక్షించు స్వామీ![మళ్ళీ మెడ కిందికి వంచుతాడు.]

జ : [పైకి చూస్తూ] తండ్రీ, నమస్కారము !

సం : [కిందికి చూస్తూ] మనము వదలి వచ్చిన కైలాసపర్వతము చుట్ట చుట్టుకొని ముడుచుకున్న తెల్లతాచు

వలె సూర్యకాంతిలో ఎట్లా మెరుస్తూ ఉన్నదో చూచావా?

జ : [పైకి చూస్తూ] భూమిని విడిచి పైకి వచ్చినకొద్దీ అంతకంతకు భూ కల్మషపు భారము తగ్గి ఇక్కడ వాయువు ఎంత తేలికై నిర్మలంగా ఉన్నదో చూడూ!

సం : [కింద చూస్తూ] భూలోకంలో పెద్ద పెద్ద పట్టణాలన్నీ రథచక్రాల వలె ఉన్నవి. కొండలన్నీ గులక రాళ్ళల్లేనూ, వాటిమధ్య పాకులాడే పాముల వలే నదులున్నూ కనబడుతున్నవి.

జ : [పైకి చూస్తూ] దూరము వచ్చినకొద్దీ మన వేగము ఎక్కువ కావడం లేదా? సంకెళ్ళు తీసిన బందీకివలే లేదూ, మన కిప్పుడు?

సం : [కిందికి చూస్తూ] ఇప్పుడు భూలోకంలో నదు లన్నీ లోకాన్ని పైకి ఎగిరి రాకుండా బంధించిన సూత్రాల లాగా కనపడడం లేదా! హిమవంతమూ వింధ్యమూ మేరువూ మాత్రము కొండచిలువలల్లే ఉన్నవి.

జ : [పైకి చూస్తూ- మెడ నిక్కించి సంపాతిని మించిపోవలె నని ప్రయత్నిస్తాడు. కాని మించి పోలేడు.] నీ జవసత్త్వాలు ఎంత అద్భుతమైన వన్నా! నా ఒంట్లో ఉన్న శక్తిఅంతా ప్రయోగించి నిన్ను మించి పోవలె నని నేను ఎంత యత్నించినా, నీవు సునాయాసంగా ఎగురుతున్నట్లే ఉండికూడా నిన్ను దాటి ఒక్క అడుగైనా పైకి పోనీయవే!

సం : [కిందికి చూస్తూ] ఈ అద్భుత చిత్రము చూడూ! భూలోకంలో మహా సముద్రాలన్నీ ఒక తామరకొలనుగానూ, అందులో నడిబొడ్డులో భరత వర్షము వికసించిన తెల్లని సహస్ర దళ కమలంలాగానూ, హిమవంతాదులైన ఉన్నత పర్వతాలన్నీ దాని కేసరాలు గానూ కనబడుతున్నవి. కాశీపట్టణము అందులో కర్ణికవలె ఉన్నది. ఎంత పవిత్ర దృశ్యమోయీ, ఇది!

జ : [సంపాతివేపుచూస్తూ] అన్నా, నీ ఎర్రటి రెక్కలమీద సూర్యకాంతి ప్రతిఫలిస్తూ ఉంటే సహస్ర సూర్యులను భరిస్తున్న అరుణాచలంవలే సాక్షాత్తూ అగపడుతున్నావు గదోయి!

సం : [ జటాయువువేపు చూస్తూ ] నీవో, సాక్షాత్తు మేరువువలె మెరుస్తున్నావు. [ భూమివైపు చూస్తూ ] కాని అటు చూడూ! ఇప్పుడు భూమండలము నక్షత్రమండలంతో కలిసిపోయి అది కూడా ఒక చుక్కలాగానే ఐపోయి,- అదుగో అంతర్ధాన మవుతున్నది.

జ : [పైకి చూస్తూ] ఇప్పటికి నా హృదయ తాపము కాస్త శాంతించే విధంగా ఉన్నది. భూలోక కశ్మలము వదిలింది. [ఉత్సాహంతో] కూ ఊఊః!

సం : [ఉత్సాహంగా] కూ ఊఊః!

జ : [పైకి చూస్తూ] ఈ చిత్రం చూచావా? మన కూతలు ప్రతిధ్వనులు

ఏమీ లేకుండా, సూటిగా హరిహరుల రెండు ధనుస్సులలోనుంచి ఒకేసారిగా విడిచిన బాణాలవలె ముందుకు పరుగెత్తుతున్నవి!

సం : [తల వంచుకుని] ఇప్పు డేమయినా దిక్కు తెలుస్తున్నదా తమ్ముడూ? తూర్పేదో పడమరేదో చెప్పూ, చూదాము.

జ : [మెడ ఎత్తుకొని] మనము ఇప్పు డాసూర్యమండలానికి వెళుతున్నాము. అదే తూర్పు. నాకు ఇంకో దిక్కు అక్కరలేదు.

సం : [మెడ వంచుకొని] పోనీ, ఇప్పుడు పైన ఏదో, కింద ఏదో చెప్పగలవేమో చూడూ!

జ : [ఎగు మెడతో] అన్నా, నాకు పైన అరుణమండలము మండుతూ కనపడుతున్నది. కిందుతో నాకేమి పని!

సం : [కిందుమెడతో] సరే, కాని,- ఇప్పుడు ఏవేళ అయిందో ఊహించగలవూ? పోనీ, ఇది రాత్రో పగలో చెప్పూ చూస్తాను!

జ : [ఎగు మెడతో] పతంగయాత్రికులకు ఎప్పుడూ పగలే కాని రాత్రి ఏముంటుంది! - మహాగ్ని హోత్రము వలె సూర్యభగవానుడు కదలిక లేకుండా ఒక్క చోటనే ఉన్నాడు.

సం : ఎక్కువగా సూర్యమండలము వంక తదేక దృష్టితో చూడబోకు నాయనా! కళ్ళు మిఱుమిట్లుగొంటవేమో!

జ : [మెడ పైకే రిక్కించిచూస్తూ] సరేకాని ఈ అద్భుతం చూడు. మొదట గుమ్మడిపండంత ఉన్న ఈ రశ్మిమాలి క్రిమేణా పెద్ద పెద్దవాడై ఇప్పుడు భూమండలమంత అగ్నిగోళముగా కనిపిస్తున్నాడు.

సం : వేగము కొంచెము తగ్గించి ఇక మనము మెళుకువగా పోవాలి!

జ : ఊపిరి సలపడంలేదు, ఏమి హాయిగా ఉన్నది! భూలోకపు బరువు పూర్తిగా వదిలి పోయింది.

సం : మన మిప్పుడు వాయుమార్గము దాటి పోతున్నాము.

జ : [పై చూపుతోనే] అందుకనే కాబోలు, విపరీత మైన ఈ చెమట. స్నానం చేసినట్లు శరీర మంతా ముంచెత్తుతున్నది.

సం : మన యాత్రలో కష్టపు పాలు ప్రారంభించింది.

జ : ఏమి వేడి అన్నా! ఇప్పటికి నా హృదయంలో వేడికి దీటుగా ఈ వివస్వానుని వేడి తగిలి సమత్వం కలిగిస్తున్నది. ఇప్పుడు నా యాత్రేచ్ఛ సఫలమయింది.

సం : నా మాట విని ఇంకా కొంచెము వేగము తగ్గించు!

జ : ఇక్కడే ఇంత హాయిగా ఉంటే ఇంకా దగ్గరకు పోతే ఎంత బాగుంటుందో! అవును గాని, కొంచెము దాహ మనిపించడము లేదా నీకు?

సం : నిజమే. కొంచెము నిలిచి సేద తీర్చుకో!

జ : [ఆగకుండా] దారి పొడుగునా ఇట్లా అలుపు తీర్చుకుంటూ కూచుంటే మనము సూర్య లోకము ఎప్పటికి చేరుకుంటామూ! – కాని గొంతు తడి ఆరిపోతున్న దే! ఏ మగ్గ్సా ఇది! సూర్య మండలము ఇంకా రాదేం?

సం : నీవు ఊరకే తొందరపడకు. సూర్యమండలము ఇంకా చాలా దూరమున్నది. గోళము పెద్దది పెద్దది అవుతున్నది కాని ఏమాత్రమూ దగ్గరకు వస్తున్నట్లే తోచడం లేదు. ఎన్ని వేల యోజనాలు వచ్చామో, ఇంకా ఎన్ని వెళ్ళవలెనో తెలియకుండా ఉన్నది. మానవ [illegible] ఎన్నాళ్ళయినా [illegible] తెలియడం లేదు.

జ : [సూర్యమండలంవైపు చూడలేక తప్పనిసరిగా [illegible]] ఒకటంగ మండల [illegible] భయంకరముగా మండుతున్న ప్రళయాగ్ని హోమాత్రము వలె ఉన్నది. కిరణాలు లేవి లేవు. వాటికి బదులు అగ్నిశిఖలే శేషాహి నాలుకలవలె నెళ్ళుకుని వచ్చి దహించి వేస్తున్నవి. కళ్ళు పైకెత్తి చూడ లేకుండా ఉన్నాను. అన్నా! ఎట్లా ఈ ఆశ్చర్యావహ మైన ఆదిత్యలోకంలో వింతలు చూసేది! – అన్నా! ఏమిది! దేహమంతా విరవిరలాడి పోతున్న దీ! చర్మము మంట లెత్తుతున్న దే.

సం : [గాభరాతో] తమ్ముడూ, అట్లా నల్లపడ్డావేమోయి? నీ ఒంటి నిండా పొగ కమ్ముకున్న దేమోయి, నాయనా!

జ : ఏమీలే దన్నా, ఈ పనికి మాలిన నా చిరుఈక లున్న వే, ఇవీ, సూర్యాగ్నిశిఖలకు కాలిపోతున్నవి. దూదిపింజలవంటివి మన కెందు కవీ? అనవసర మైన దేహవాసనలను ఈ విధంగానే జ్ఞానాగ్ని దహిస్తుంది కాబోలు! ఇప్పుడు మనకు తగులుతున్న వేడివంటి చలి నీకు చంద్రమండలంలో వేసిందా అన్నా?

సం : ఆఁ! సరిగా పోల్చావోయి రెండూను.

జ : ఎంత మహాద్భుతము! కళ్ళు ఏమాత్రం కనిపించడం లేదు. పాతాళ గహ్వరంలో చీకటి అంతా ఒక్క పెట్టున ఈ సూర్యభగవానుడి దగ్గిరికి ఎట్లా వచ్చిందీ! దీన్ని చీలుస్తాను!

[జటాయువు ముక్కుతో ఆకాశం చీలుస్తూ కాస్త కింద పడుతున్నాడు.]

సం : [తనకంటే కింద జటాయువు కనపడగా గాభరాతో] ఆఁ! ఆఁ! కిందికి పోతున్నావేం?

జ : [ప్రయత్నపూర్వకంగా సంపాతితో కలుసుకొని] ఇట్లా రెక్కలు రెండూ స్తంభించినవేమి! నా కేమీ కనపడడం లేదు.

సం : [దీనంగా] ఎక్కడున్నావో నీవు బాగా కనపడడం లేదోయి తమ్ముడూ!

జ : [పడుతూ లేస్తూ దిక్కు తెలియక పక్కలకు పోతూ ఆర్త స్వరము

తో] అన్నా! - అన్నా! - ఎటు పోతున్నాను! - నాకేమీ కనపడడం లేదు! - సూర్యభగవాను డేడీ? ఏమిటీ అమావాస్య చీకటి! - మన ప్రయత్నము చాలించగూడదు, ఏమైనా సరే! పతంగస్వామీ, చేదుకో!

[సంపాతి అమిత ప్రయత్నంతో కళ్ళెత్తి చూస్తాడు. జటాయువు చిరు రెక్కలు కాలుతూ నీరసంగా పడిపోతూ ఉంటాడు. మళ్ళీ ఇంకొక ప్రయత్నము ఎట్లాగో చేసి జటాయువుమీదికి ఎగిరి సూర్యుని మంటలు జటాయువుకు తగిలకుండా తన రెక్కలు అడ్డు పెడతాడు.]

సం : తమ్ముడూ, భయంలేదు!

జ : [వెనకటివలెనే పడుతూ లేస్తూ స్మృతి ఉండీ లేక] అన్నా, ఇంత అయోమయంగా ఉన్న దేమిటి? - నీవు క్షేమమేనా అన్నా?

సం : తమ్ముడూ, క్షేమమే గాని నీ బాధ తగ్గిందా?

జ : చెవులు గడిసెలు పడి ఏమీ వినపడడం లేదు. అన్నా! నీవు క్షేమంగా ఉన్నట్లు తెలియడానికి బిగ్గరగా అరూ!

సం : [ప్రయత్నపూర్వకంగా బిగ్గరగా] కూ ఊ ఊఁ!

జ : [రెక్కల మంట చల్లారిందికాని కింద పడిపోతున్నాడు. అన్న కూజితము విన్నతృప్తితో గద్గదంగా] అమ్మా! - కూ ఊ ఊఁ!

సం : [ముందు చిన్న ఈకలూ కొమ్మేనా చిరురెక్కలూ చివరకు పెద్ద రెక్కలూ అన్నీ కాలిపోతూ ఉన్నా, అగ్నిపర్వతమువలె నిశ్చలంగా ఒక నిముష ముంటాడు] తమ్ముడూ, క్షేమమూ! కూ ఊ ఊఁ!

జ : [పడిపోతూ] సంపాతి అన్నా, నమస్కారము!

సం : [దూరందూరంగా పడిపోతూ] జటాయూ, చిరంజీవ!

జ : [దూరంగా పడిపోతూ] సంపాతీ! -

సం : [దూరంగా పడిపోతూ] జటాయూ! -

జ : [అల్లాగే పడిపోతూ] అన్నా! -

సం : [అల్లాగే] తమ్ముడూ! -

జ : [దూరంగా పడిపోతూ స్మృతి పోతున్నకొద్దీ కునికి పడుతున్న స్వరంతో] కూ ఊ ఊ ఊ ఊ ఊ!

[కూత గాలిలో కలిసి అణగి పోతుంది]

సం : [రెక్క లేమీ లేని మొండెమునిండా కాలిన గాయాలతో దూరంగా పడి పోతూ స్మృతి పోతున్న కొద్దీ పడిపోతున్న మూలుగుశబ్దంతో] కూ ఊ ఊ ఊ ఊ ఊ ఉఁ!

[కూత అంతకంతకు తగ్గి తగ్గి గాలిలో కలిసి అణిగి పోతుంది.]

[నిశ్శబ్దము. జటాయువూ సంపాతీ దూరదూరంగా పడిపోతూ ఉంటారు.]

[తెర]

# గోపిక

ఉమర్ అలీషా

ఏడీ మాంపులబాటసారి ? హృదయంబే నాడో కొంపోయి యీ
వాడే త్రొక్కుచు దాను మా యుబుసులన్ వర్జించి మామాటలే
తేడే యీ పసుగేల ? యీ ముసుగులో దింపన్ గతంబేమి ? హా
నే డీయూర్పులు నేరులై యరిగి వానిం దోడి తేకుండునే ?

లేవో దొంగిలిపోవు సొమ్ములు ధనం లేవో హిరణ్యంబులున్
లేవో మానస మిట్లు దొంగిలిన గేలిన్ జేయు రే లోకు లెం
తే విశ్వాసిగ ప్రేమపాఠములు చెప్పవాసిగా వచ్చి మా
త్రోవే మానితి వాని నెట్టితిపి న్యాయిల్ మైత్రి నూహింతురే !

పాటల్ బాడిన నాటలాడిన ప్రగిల్భంబార వర్ణించి మో
మాటం బేమియు లేక నెంట తీయగన్ మావాటలన్ ద్రొక్కి మా
మాటే యెత్తను నేఁడు మాహృదయముల్ మానుండి కొంపోయి యె
చ్చోటో పెట్టెను జీవహీన లగు మాజోక్యంబు లేకుండగన్.

ఏమో వచ్చెను మోసగింపను మహాస్వేచ్ఛావిహారక్రియా
సామర్థ్యంబున ప్రేమపాఠకలనాసాహిత్యసర్వస్వవి
ద్యామాహాత్మ్యము విచ్చిపోవ నను మిథ్యాభ్రాంతి నాస్వాంత మ
య్యో మాటాడక నిచ్చివేసితి కృతఘ్నోద్యోగ మూహింపకన్.

బాసన్ జేసితి వాసబెట్టితివి మాభావంబులో ప్రేమలన్
బూసన్ గ్రుచ్చినయట్లు పేర్చితివి ఆమోదంబు రాగంబు మా
కోసంబో భవదీయవంచనకళాకుడ్యాంతర ప్రాభవా
భ్యాసంబో మము వీడిపోతి విటు మాయానాటకం బుండునే ?

ఆహా ! ఆమురళీనినాద మదె సంధ్యారాగమం దైక్యమై
ఊహాతీతరసైకమాధురి నదే యూరించు నీతీరు వ్యా
మోహం బేటికి బెట్టు మాధవుడు నాముం దేలరాబోవ డీ
దేహం బాతనిపాటకై యిడిన సందేహించునే కైకొనన్ !

*

# నాలో మార్పు

## శ్రీ శివశంకర శాస్త్రి

### 3

తరువాతి సంవత్సరం మాబావమరది గుంటూరులో ప్లీడరీ ప్రారంభించి నన్ను క్కడికి రమ్మని ఆహ్వానించినాడు. ఆయన కోరిన ప్రకారము గుంటూరులో నివాసము ప్రారంభించాను.

నేను చదువు మానేసేనాటికి స్కూలుఫైనల్ పద్ధతి రాలేదు. అది అమలులోకి వచ్చాక అనేకులు - జన్మజన్మాలా మెట్రిక్యులేషన్ దాటి పైకి పోలేని వాళ్ళు- పైచదువులోనికి వెళ్ళగలిగారు. ఈసంగతి తెలిసి, నేను పూరికేనే వుంటున్నా నని ఇంట్లో ఆడవాళ్ళూ మాబావమరిదీ ఇంగ్లీషుచదువు ప్రారంభించవలసిందని ప్రోత్సహించారు. ఒకనాడు నేను మిషన్ కాలేజీకి వెళ్ళి ప్రిన్సిపల్ డాక్టర్ ఉల్ దొరగారిని చూసి నన్ను స్కూలుఫైనలులో చేర్చుకోండని కోరినాను. ఆయనకు నామీద చాలా వాత్సల్యం ఉండేది. "నీవు మెట్రిక్యులేషన్ పరీక్ష తప్పేవా?" అని అడిగినాడు. " నేను పరీక్షకే కూర్చోలేదు. మానాయనగారు పోవడంచేత పరీక్షకు హాజరు కాలేదు. Course పూర్తిచేశాను" అన్నాను. ఆయన కొంచెం ఆలోచించి "పరీక్షకు కూర్చున్నట్టయితే నిన్ను వెంటనే స్కూలుఫైనల్‌లోకి తీసుకునేవాణ్ణి. ఇప్పుడు రూల్సు వప్పుకోవు" అన్నాడు. "మీరు నాకు Exemption ఇవ్వడానికి వీ లున్నదా ?" అని నేను అడిగతే "చాలా విచారం! వీల్లేదు. కాని నువ్వు చదువుకోదలచుకుంటే నాలుగోఫారంలో చేరవలసి వుంటుంది" అని నవ్వుతూ అన్నాడు. నేనూ నవ్వి స్కూలుచదువు నాకు అబ్బే యోగం లేదని ఆయునదగ్గర సెలవు తీసుకొన్నాను. ముందు సాగిపోవడానికి కొత్త నియమాలు అడ్డంరావడంచేత కాలేజీవిద్యకు స్వస్తి చెప్పాను.

సంస్కృత విద్యాభిమానము గాఢం కావడంచేతనూ, అందులో అభినివేశం కలగడంచేతనూ, శాస్త్రజ్ఞానము సంపాదించవలెనని పెద్దింటి నరసింహాచార్యులుగారు అనే పెద్ద విద్వాంసుడిదగ్గిరికి వెళ్ళాను. ఆయన గొప్పవైయాకరణి. కొరిటెపాడులో నివాసము. మొదట ఆచార్లుగారు నాసంగతి సందర్భాలు అడిగారు. ఆరోజుల్లో మాబావమరదిపేరుగాని, సుప్రసిద్ధులైన మా మామగారు నేతి

వేంకటసుబ్బారాయశాస్త్రులుగారి పేరుగాని విననివాళ్లు లేరు. మా మామగారు పోయి అప్పటికి మూడుసంవత్సరాలు దాటినవి. ఆచార్లుగారు అప్పట్లో తమకు తీరిక లేదనీ కొంతకాలం గడిచాక 'సిద్ధాన్త కౌముది' పాఠం చెపుతాననీ అన్నారు. ఉత్సాహం ఎంత వున్నా వూరుకోవలసి వచ్చింది.

పోనీ, తర్కం చదువుదామనే తాత్పర్యం కలిగింది. మాకు సమీపంలో దెందుకూరి నరసింహశాస్త్రులుగారు వుండేవారు. వేదాంతశాస్త్రంలో ఆయన నిధి. న్యాయశాస్త్రంలోకూడా గాఢపరిశ్రమ చేసినవారు. అంతగొప్ప విద్వాంసుడిదగ్గిరికి వెళ్ళి కొద్దిగ్రంథము చదవడం ఎలాగని భయం వేసింది. అయితే నరసింహశాస్త్రిగారు చాలా ఇమాన్‌దార్. దానికితోడు మాబావమరిది-మామగార్ల పేర్లు పనిచేసినవి. పాఠం చెప్పడానికి వారు అంగీకరించారు. అప్పటికి వారికీ మాకూ చుట్టరికం లేదు. తర్వాత అయిదుసంవత్సరాలకు ఆయన కుమార్తెను మామేనల్లుడి కిచ్చి వివాహం చేశారు. నరసింహశాస్త్రిలుగారికి శాస్త్రిలమీద ఉన్నఆదరము సాహిత్యంమీద లే దని మొదట నేను గ్రహించలేదు. నాకు 'శిశుపాలవధ'మీద ఆసక్తి వుండడంచేతా, గురుముఖతః కావ్యపఠనం చేయడం మంచిది అనే ఊహతోనూ వారివద్ద మాఘుని కావ్యం ప్రారంభించాను. కొద్ది రోజులు పాఠం సాగినతర్వాత శాస్త్రిల్లుగారు "ఎందుకు కావ్యపాఠం, శాస్త్రమేదైనా చదవరాదా?" అన్నారు. వెంటనే 'తర్కసంగ్రహం' ప్రారంభించాను.

నరసింహశాస్త్రిగారి కీర్తి అప్పటికే వ్యాపించింది. వయస్సులో చిన్నవారైనా పెద్దలు వచ్చి ఆయనవద్ద చదువుకొంటూ వుంటే "వృద్ధా శ్శిష్యా గురుర్యువా" అనిపించేది. శిష్ట్లా సీతారామశాస్త్రిగారు ప్రసిద్ధిగల విద్వాంసుడు. ఆయనకూడా వారిదగ్గర 'పంచపాదిక' మొదలైనవి వింటూంటే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. 'గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః' అనే సూక్తి సార్థక మనిపించింది.

సీతారామశాస్త్రిగారు దీర్ఘకాయుడు, స్ఫురద్రూపి, వాగ్మి. ఆయన ఏదో ఒకటి చెప్పి నవ్విస్తూ ఉండేవాడు. 'శాస్త్రిల్లుగారూ, తమకు ఎన్నోయేడు అని ఎవరో అడిగితే 'ఆఁ ఎంతండీ! తొమ్మిదోయేడేగా' అన్నారు. అప్పటికి ఆయనకు 63వ సంవత్సరం. మరొకసారి ఎవరో 'శాస్త్రిల్లుగారూ, తమరు సాయంత్రం పూట ఏమి చేస్తుంటారు' అంటే 'రంభాసంభోగం' అన్నారు. అందరూ నవ్వారు. ఆయన చిరునవ్వుతో 'నేను వృద్ధుడ ననా నవ్వుతారు? దొడ్లో అరటిచెట్టు ఆను

కని కూర్చుంటా నండీ' అని విద్వాంసులకు వినోదం కలిగించారు. ఆరోజుల్లో తిరుపతివేంకటేశ్వరులు గుంటూరులో శతావధానం చేస్తున్నారు. వారి అవధాన పద్యాలు చాలా బాగుంట వని పొగుడుతూ ఒకరు సీతారామశాస్త్రిగారితో "తమకు ఎలా తోస్తుంది" అన్నారు. "వారి పురాకృతాలు మంచివండీ" అంటే మా అందరికీ నవ్వు వచ్చింది.

అదివరకు ఆంధ్రంమీద ఆదరం వెనకబడ్డ నాకు తిరుపతివేంకటేశ్వరుల శతావధానంవల్ల మళ్లీ అభిమానం కలిగింది. సభలకు వెళ్లుతూవుండడం, వూళ్లో జరిగేవివాదాలు వింటూండడమూ, అనేకులు ఏదో ఒకపక్షానికి అనుకూలంగా పద్యాలు చెబుతూవుండడము—— ఇవన్నీ చూసి నాకూ_డా ఉత్సాహం పుట్టింది. అయితే నేను ఎవరినిగురించీ పద్యంమాత్రం చెయ్యలేదు. అదివరకు సంవత్సరం పైచిల్లరనుంచీ వినడమేగాని కొప్పరపుకవులను చూడలేదు. ఆరోజుల్లో చూశాను. గంటకు 800 పద్యాలు నేను చూచి చదవలేను. కొప్పరపుకవులు చెపుతా రంటే ఆశ్చర్యం వేసింది. ప్రపంచంలో ఏభాషలోనూ వీరిలాగ దూకుడుగా పద్యం చెప్పగలవారు వుంటా రని తోచదు. డాక్టరు స్ట్రాకుదొర గారు తరవాత నాతో కొంతకాలానికి మాట్లాడుతూ, అమెరికాకవులలోకూడా ఎవరూ ఇలా చెయ్యలే రన్నారు. 'శరణః శ్లాఘ్యో దురూహద్రుతేః' అని గీతగోవింద కారుడు రాసినమాట, తరిగొండ ధర్మన్న గంగాప్రవాహంవలె ధాటిగా పద్యాలు చెప్పాడనీ చదవడమే కాని, సోదరకవులను చూచేవరకూ దాని యాథార్థ్యము నాకు అవగతమైంది కాదు. గంటకు లెక్క_ప్రకారం వీరు 800 కొత్తపద్యాలు చెప్పగలరో చెప్పలేరో! **Sir Henry Seagrane** గానీ, **Sir Malcolm Campbell** గానీ గంటకు రమారమి 230 మైళ్ళు వెళ్ళారంటే ఏతొమ్మిది పదినిమిషాలో వెళ్లిన మోటారువేగాన్నిబట్టి లెక్క_వెయ్యాలసిందే గాని ఖచ్చితంగా గంటసేపూ వాడు ప్రయాణం చెయ్యలేరు.

తిరుపతి వేంకటేశ్వర్ల అవధానంరోజున వారిదోషం ఏమీ లేదనీ, కొప్పరపు కవులుకూడా సరసంగా వర్తించారనీ నా జ్ఞాపకం. పైవారి కవిత్వానికీ సోదరుల పద్యధారకూ నాకు ఆశ్చర్యం కలిగింది. తర్వాత బయలుదేరిన వివాదాలు చాలా విచారకరమైనవి. విద్య శ్లాఘదానికే గాని వివాదకు వినియోగించకూడ దని నామతం. విద్వాంసులుగాని కవులుగాని వృథావాదోపవాదాలు చేస్తూంటే సంతాపకరంగా వుంటుంది. స్వభావతః ఇటువంటివి నాకు గిట్టవు కాబట్టి నే నెందులోనూ కలిగించుకోలేదు.

మళ్లీ తెలుగుకవిత్వంమీదికి మనస్సు తిరిగింది. తోచినప్పుడు ఏవో పద్యాలు చేస్తూ వుండేవాణ్ణి గాని ఏవీ ప్రకటించలేదు. సంస్కృతాభిలాష ఏమాత్రమూ తగ్గలేదు. ఆసంవత్సరం రామాయణం సమగ్రంగా చదివాను. సంస్కృతం ధారాళంగా మాట్లాడడంకూడా అభ్యాసమైంది.

ఈవిద్యలవల్లగాని కవిత్వంవల్లగాని కాలయాపనతప్ప కానీ వచ్చేమార్గం లేదని పెద్దవాళ్లు అంటుంటే వైద్యవిద్య అభ్యసించాలని బుద్ధిపుట్టింది. ఏపరీక్షలోనూ నెగ్గకపోయినా కలకత్తాలో వైద్యకళాశాలలో ప్రవేశించవచ్చునని కొందరుమిత్రులు చెప్పారు. మాబావమరిది ఎక్కువ ప్రోత్సహించ లేదు. అయినా వెళ్ళాలని నిశ్చయించుకొన్నాను. ఇప్పుడు నేను రోగిని చూడలేను. జబ్బుసంగతులు వినలేను. తరుచుగా జబ్బుపడేవాళ్ళమీద అభిమానం తక్కువ. నామిత్రుడు డాక్టరు ఆమంచర్ల చలపతిరావుగారు ఒకనాడు ఎవరో రోగికి కాలిమీద చిన్న శస్త్రప్రయోగము చెయ్యబోతూ నన్నుకూడా వెంట తీసుకు వెళ్ళారు. టీ తాగి బయలుదేరాము. రోగి కాలిమీద నెత్తురు కనపడేసరికి నాకు డోకువచ్చింది! ఎర్రసిరాబుడ్డి వొలికితే చూడలేని నేను ౧౯౧౧ లో Medical college కి వెళ్లి వైద్య మభ్యసించి అదే వృత్తిగా పెట్టుకొందామని అనుకోవడం చాలా వింతగా తోస్తుంది. అప్పటి సంకల్పం వేరు. అంతా తయారుచేసుకొని రాత్రి రైలుకు కలకత్తా బయలుదేరడానికి ముహూర్తం పెట్టి, ఆమహానగరంలో ఆంధ్రుల చిరునామాలు తెలుసుకొంటే మంచిదని శీరం సుబ్బారావుగారిని అడగడానికి వెళ్ళాను.

ఆయన Y. M. L. A లో కూర్చొని స్నేహితులతో మాట్లాడుతున్నారు. నాసంకల్పమూ మొదలైనవి చెప్పి తెలుగువాళ్ళ చిరునామాలు కోరాను. సుబ్బారావుగారు కలకత్తాలో కొన్ని సంవత్సరాలుండి వైద్యవిద్య అభ్యసించారు. ఆయన నాసందర్భాలన్నీ విని మీవంటివారికి ఇది పనికిరాదు, వైద్యం కాకుండా ఇంకేదైనా అభ్యసిస్తే మంచిది, అని నచ్చజెప్పారు. దానితో వైద్యమూ వంగదేశప్రయాణమూ ఆగిపోయినవి.

## ౪

వంగదేశప్రయాణము ఆగిపోయినా వంగభాషమట్టుకు నేర్చుకోవడం సంభవించింది. ఇప్పటికికూడా మనకు బెంగాలీవెర్రి వున్నది. ఆరోజుల్లో కుర్రవాడికి ఎలా వుంటుందో చెప్పడ మెందుకు? బంగాళారాష్ట్రవిభజన, స్వదేశీ ఉద్యమమునాటి

నుంచీ చాలామందికి బంగాళీలమీదా బంగాళీభాషమీదా మోజు పుట్టింది. దానికి తోడు **Modern Review** లో రవీంద్రుని రచనలు చదవడమువల్లా, మన వెంకట పార్వతీశ్వరులు తెలుగుచేస్తున్న బంకించంద్రుని నవలలు చదవడమువల్లా ఆభాష నేర్చుకోవాలని ఉత్కంఠ హెచ్చింది. అదివరకే నాకు బంగాళీ అక్షరాలు ఎలాగో వచ్చును. ముందు వ్యాకరణము బాగా చదివి బంకించంద్రుని 'కృష్ణకాంతేర్ ఉఇల్' తెలుగుతర్జుమా సహాయంతో బెంగాలీ ప్రారంభించాను. మన దేశీయ భాష లన్నిటిల్లో వంగభాష సులభమైన భాష. వేగిరం వచ్చింది. భాష బాగా రావడ మంటే మూడువిధాలుగా రావాలి. ఆభాషలో సంభాషించగలగాలి; గ్రంథాలు అర్థంచేసుకోవాలి; తిరిగి రచన చేయగలిగి ఉండాలి. గ్రంథపఠనంతప్ప తక్కినవాటికి నాకు అవకాశం లేకపోయింది. 'నీరద' అనే చిన్ననవల చదివి నాను. దాన్ని తెలిగిస్తే బాగుంటుందని సరదా పుట్టి ఎలాగో ఆంధ్రీకరించాను. దానిలో లోపాలు చెప్పగలవాళ్ళు గుంటూరులో నాకు ఎవరూ లభ్యంకాలేదు. గ్రాంథికభాషలో రచించాను. పూర్వం వాడుకభాష అంటే అభిమాన మున్న నాకు దానిమీద హేయభావము కలిగింది. తిరుపతివెంకటేశ్వరకవులు కాలేజీహాలులో వాడుకభాషలో ఉపన్యసిస్తూవుంటే ఆశ్చర్యపడ్డాను. ఎవరైనా మామూలు మాటలతో ఉపన్యసిస్తూవుంటే ఏవగించుకొనేవాణ్ణి. అటువంటిస్థితిలో రాసిన వచనగ్రంథం ఎంత హేయంగా వుంటుందో చెప్పనక్కరలేదు. 'నీరద'లో ఒకచోట "ఉపనిష్కారంబు గప్పూతిమాత్రంబునం" అనీ, మరొకచోట "అకుకూటవలయోపేతంబగుబడిశవంశంబు కేలం గీలించి" అనీ, ఇటువంటి వాక్యాలు వ్రాశాను. వీరేశలింగంగారి వచనంగానీ చిలకమర్తి నరసింహంగారి నవలల్లోభాషగానీ నాకు ఘాటు చాలలేదు. సంస్కృతగద్యపరిభావము గాఢంగా వుండేది. సలహా ఇవ్వ తగినవాళ్ళు లేరు; ఒకవేళ ఇచ్చినా అంగీకరించేవాణ్ణి కానేమో! నామిత్రుడు అక్కిరాజు ఉమాకాంతంగారివల్లనే ఈ 'డబ్బాశైలి' కొంతవరకు అలవాటు పడ్డది. మరికొన్నిసంవత్సరాలకు ఆయనవల్లనే ఇది తొలిగిపోయింది. ఉమాకాంతంగారు ఆరోజుల్లో తెనిగించిన 'టిప్పుసుల్తాను' బాగా నచ్చింది. అందులో ఒక వాక్యం ఇంచుమించుగా ఇప్పటికీ జ్ఞాపకంవస్తుంది. "మార్గోపాంతపల్వలానీకంబుల భేకభేకీనినాదంబు......సంకులంబయ్యె." ఇటువంటి వాక్యాలు మహామధురంగా వినబడి ఆప్రకారంగా రాస్తూండేవాణ్ణి. నే నెరిగిన కొద్దిమంది పండితులూ ఇటువంటి రచనకే ప్రోత్సాహంచేసేవారు.

రుచి మరిగినతర్వాత వదులుకోవడం కష్టం. వంగభాషలోనుంచి పుస్తకాలు తెనిగించడము ఆరంభించాను. రమేశచంద్రదత్తుపేరు బాగా తెలుసు. ఆయన వంగభాషలో రచించిన నవలలన్నీ తెప్పించి కాలక్రమానుసారంగా (Chrono-

logical order) మొదలుపెట్టాను. 'వంగవిజేత', 'మహారాష్ట్రజీవనప్రభాతము' తెలుగుచేశాను. 'నీరద' ఒకానొకగ్రంథప్రకాశకునికి పంపిస్తే "Your style is a bit too classical" అని జవాబిచ్చి ౪౦ రూపాయలు ప్రతిఫలం ఇస్తానని వ్రాశాడు.

కాలేజీచదువుకు అవకాశం లేదు. వైద్యవిద్యకు వెళ్ళడం మానుకొన్నాను. స్వతంత్రజీవనం చేయడానికి వేరేమార్గం కనపడలేదు. ఆంగ్లేయగ్రంథకర్తల జీవితములు చదివివుండడంవల్లా, జాతకంలో కావ్యనాటకాదిరచన వుంటుందని ఉల్లేఖించి ఉండడంవల్లా, ఒకానొకసందర్భంలో "మావాడు కవిత్వంవల్ల వృద్ధిలోనికి రావలసిందే" అని పూజ్యులైన మానాయనగారు అన్నసంగతి జ్ఞాపకం రావడంవల్లా గ్రంథరచనా, ప్రకాశనం వృత్తిగా పెట్టుకోవలెనని నిర్ణయించుకొన్నాను. ఆగ్రంథప్రకాశకుడు ౧౨౫ పుటల పుస్తకానికి ౪౦ రూపాయలు ప్రతిఫలంకింద ఇస్తానంటే కోత కలిగింది. గ్రంథకర్తల జీవితం దుర్భరమైందని తెలుసు. వాళ్ళకన్న ప్రకాశకులకే లాభం ఎక్కువ. నేనే గ్రంథప్రకటన చేసి సోదర కవులకుకూడా ఉపకారం చెయ్యవచ్చు ననుకొన్నాను. ఉద్దేశ్యం క్రియారూపంలోకి వచ్చేసరికి కొంతకాలం గడిచింది.

౧౯౧౩ లో తెనాలిలో సంస్కృతకళాశాలకు వెళ్ళి చదువుకోవలెనని బుద్ధి పుట్టింది. కళాశాలలో చేరాను. నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రధానాచార్యులు. ఆయనకీర్తి యావద్భారతదేశం వ్యాపించింది. అటువంటి విద్వాంసుడి దగ్గర చదువుకొంటే బాగుండు ననే కోరికవల్లనే తెనాలి వెళ్ళాను. కాని మా తరగతికి ఆయన వచ్చేవారు కారు. ఆయనకు కోపం వచ్చినప్పుడల్లా విద్యార్థులను 'తవ్వి పాతేస్తా' నంటుండేవారు. ఆయన చెప్పింది వాళ్ళకు తెలియనప్పుడు "ఏడిశారు! మీ మొహం! మీ కేం తెలుస్తుంది? బాలూశాస్త్రుల్లుగారికీ మాకూ ఘోరయుద్ధ మయింది. తరవాత చదవండి' అని పాఠం సాగించేవారు. ఆయన సహపాఠి, మాబంధువు వేదాంతం లక్ష్మీపతిశాస్త్రిగారు మాకు సిద్ధాన్తకౌముది చెప్పేవారు. ఆయనకూడా కాశీపండితుడు. ఆయనకు పళ్ళు లేకపోవడంచేత చెప్పేది మాకు బాగా తెలిసేది కాదు. దానితర్వాత అనడానికి బదులు 'దానికంటె' అంటే మాకు తెలిసేది కాదు. రామఏవ=రాముడు అయ్యేవే, స్యాత్-అయ్యేని, ఇటువంటి శ్రోత్రియపు తెలుగులో పాఠం చెబుతూంటే నవ్వు వచ్చేది. కావ్యనాటకాదులు మేమే అన్వయించుకొనేవాళ్ళము.

కొన్నిమాసా లయ్యాక కళాశాలకు వెళ్ళడం క్రమంగా మానేశాను. పద్యకావ్యాలకన్న వచనగ్రంథాలకే చలామణీ ఎక్కువని తెలుసుకొని "ఆఖ్యాయికా

పరంపర" అనే గ్రంథమాల ఏర్పాటుచేశాను. ఆ వన్నీ గ్రంథమాలలవెర్రి రోజులు. మామూలుపుస్తకాలకు చందాదారు లక్కర్లేదు; గ్రంథమాలతోకూడా పనిలేదు. ఏవో అపూర్వగ్రంథాలు కాని, అతిమూల్యగ్రంథాలు గాని మాటి కగా ఏర్పాటుచేసి చందాదారులను సేకరించుకోవడం యుక్తము. మనలో చందాదారులపద్ధతివల్ల అనేక అనర్థకాలు కలిగినవి. ఆఖ్యాయికాశబ్దం సామాన్య నవలాపదానికి పర్యాయపదంగా వాడాను- మంచి ఆలోచన చెప్పేమిత్రులు ఎవరూ దగ్గిరలో లేక.

పాఠశాలలో చదివేరోజుల్లోనే ఇంగ్లీషు నవలలూ కథాగ్రంథాలూ చాలా తిరగవేశాను. **Thackeray, Scott, Reynolds,** మొదలైనవారి పుస్తకాలు చాలామట్టుకు చదివి, నవలానిర్మాణాన్ని గురించికూడా కొంతవరకు గ్రహించా ననుకొన్నాను. దేశచరిత్రలు చదవడ మంటే చాలాప్రీతి. అందుకనే ఐతిహాసిక మైన **(Historical)** నవల ఆరోజుల్లో నాకు మరీ నచ్చేది. వీటికితోడు చిన్న తనంనుంచీ మనదేశం స్వతంత్రం కావాలనే గాఢవాంఛ పుంజడంచేత చరిత్రతో సమ్మేళనంచేసిన రమేశచంద్రుని నవలలు రమ్యంగా కనపడి అవే తెలిగించి ప్రకటించ బూనుకొన్నాను. అంతకుపూర్వం నేను తెలిగించిన 'నీరద' నూ 'వంగవిజేత' ను - వెంకటపార్వతీశ్వరులు ప్రకటిస్తున్నట్లు తెలుసుకొని- కాల్చి వేశాను. 'ఆఖ్యాయికాపరంపర'లో మొదటి పుస్తకము 'మహారాష్ట్రజీవనప్రభా తము'. ఆశీర్షిక కేవలం దేశచరిత్రను సూచిస్తుందేమో నని సంశయించి అం దులో నాయకుడైన 'రఘునాథ్‌జీ' నామము పుస్తకాని కుంచి ప్రకటించాను. అలా చేయడం తెలివితక్కువని కొంతకాలానికి గ్రహించాను. మాతృకకు ఉన్న పేరు ప్రబలమైనకారణం లేనిదే మార్చడం మంచిదికాదు. 'రఘునాథ్‌జీ' అచ్చుకు పంపడానికి నాపు ప్రతి తయారుచేస్తూ నా మిత్రులైన చింతా భీమశంక రంగారికి కొన్నిపుటలు చదివి వినిపించాను. భీమశంకరంగారు ఆరోజుల్లో తెనా లిలో ఉపాధ్యాయవృత్తిలో ఉండేవారు. మా యిద్దరికీ టెన్నిసు ఆటవల్ల మైత్రి కుదిరింది. ఆయన మంచి **Sportsman.** అదివరకే పద్యకవిత్వం చెప్పి చిన్నకథలు కూడా రాస్తూవుండేవారు. నాగ్రంథభాగం విని అంతకఠినంగా రాయగూడదనీ సరళంచేస్తే జనరంజకంగా ఉంటుందనీ ఆయన అనేకవిధాల బోధించారు. సిద్ధంచేసిన ౫౦ అరటావులూ చించివేసి మళ్ళీ సరళంగా వ్రాశాను. ప్రారంభ దశలో గ్రంథకర్తలకు పాండిత్యప్రకర్షమీద దృష్టి వుంటుంది. నాకు ప్రదర్శన మీద దృష్టి లేకపోయినా ప్రౌఢోక్తి అలవాటుకావడంచేత ప్రతివాక్యమూ సం స్కృతప్రాయంగా వుండేది. భీమశంకరంగారి సలహావల్ల వచనరచన సరళమూ

ర్గంలో కొంతవరకు నడిచింది. ఎంత మృదు వనుకొన్నా పుస్తకమంతా- సంభాషణలుకూడా- కృతకగ్రాంథికభాషలోనే నడిచింది.

౫

'రఘునాథ్‌జీ' ౧౯౧౮ ప్రారంభదినాల్లో ప్రకటించాను. పుస్తకం బైటికి రాగానే కొత్తమిత్రులు లభించారు. అదివరకే పరిచితులైన కొడవటిగంటి వెంకటసుబ్బయ్య ఆప్తులైనారు. అప్పటికే అతను పద్యకావ్యం ఒకటి రాసి వట్టుగూడా నాకు తెలియనీయకుండా చాలాకాలానికి అందులో ఒక్కపద్యం మాత్రం వినిపించి కావ్యం ఎన్నడూ చూపించనేలేదు. అతను చెప్పిన మాటలను బట్టి ఆకావ్యం ప్రబంధపద్ధతిని నడిచిందని స్పష్టమైంది. తర్వాత కొద్దిరోజులకు త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు 'రఘునాథ్‌జీ' అనువాదకుని చూడాలని ఒకస్నేహితునిద్వారా పరిచయం కలుగచేసుకొన్నారు. అప్పటినుంచీ మా మైత్రి దినదినాభివృద్ధి పొందింది. తర్వాత కొద్దిరోజులకు చింతా దీక్షితులుగారు పుంగనూరునుంచి తెనాలి వచ్చి తమచుట్టమైన శ్రీమరింగంటి రంగాచారిని కలుసుకొని అదివరకే నన్నుగురించి వినివున్నందువల్ల తక్షణమే ఆప్తవర్గంలో చేరారు. దీక్షితులుగారు **Alexander Dumas** రాసిన **Count De Mont Cristo** ను "రాజగిరిరాజు" అనే నవలగా సంగ్రహించారు.

వేదం వేంకటరాయశాస్త్రిగారిమీద గౌరవంవల్ల వారి జ్యోతిష్మతీముద్రాశాలలో నాపుస్తకాలు అచ్చుకిచ్చాను. రెండోనవల 'రాజపుత్రజీవనసంధ్య' "తేజసింగు" అనేపేరుపెట్టి అచ్చుకు ఇవ్వడానికి వెళ్ళినప్పుడు చిన్నవాణ్ణైనా, శాస్త్రిగారు నన్ను బహువిధాల మెచ్చుకొని **Herbert Spenser style** నుగురించి వివరించి చెప్పి 'రఘునాథ్‌జీ' **style** చక్కగా వున్నదని అభినందించారు. నేను పాశ్చాత్యవిమర్శకులగ్రంథాలు అప్పటికి ఎక్కువగా చదవలేదు. వెంకటరాయశాస్త్రిగారి ఉత్సాహవాక్యాలవల్ల విమర్శగ్రంథాలు చదవడానికి ఉన్ముఖుణ్ణి అయినాను. గ్రంథకర్తలు సహజంగా ఏకొద్ది శక్తితోనో రాస్తారు. సమీక్షచేసే సమర్థత సరిగా వుండదనే చెప్పవచ్చు. రచనేకాక విమర్శనకూడా అత్యవసరమని నాకు తోచింది.

ఆసంవత్సరం **Dickens** వెర్రి పట్టుకొన్నది. **Alexander Dumas** మొదలైన వారి నవలలు అనేకం చదివాను. స్వతంత్ర నవల రచించాలనికూడా బుద్ధి

పుట్టింది. అయితే 'ఆఖ్యాయికాపరంపర' లో మూడు పుస్తకాలు ముద్రించిన తర్వాత గ్రంథపరంపర మాని, మాసపత్రిక ప్రకటించాలని అభిలాష కలిగింది.

మిత్రులు ఎక్కువమంది దైనారు. అందరూ కలం నడపగలవారే. గ్రంథ మాల వుంటే సంవత్సరానికి ఏ నలుగురివో ఆరుగురివో ప్రకటించవచ్చు. మాస పత్రిక చేతులో వుంటే త్వరగా అనేకుల రచనలు లోకానికి వెల్లడిచేయవచ్చు. ఇటువంటి భావాలు కలిగించింది చింతా దీక్షితులుగారు. ఆయన మరోసారి తెనాలి వచ్చినప్పుడు, ఈవిషయమై విస్తరించి చెప్పి Windsor పత్రిక ఒకసంచిక చూపించారు. నేను మిషనుకాలేజీలో చదివేరోజుల్లో Atlantic, Maclure, Lifpincob, Scribner మొదలైన అమెరికా మాసపత్రికలూ కొన్ని ఇంగ్లీషు, పరదేశపత్రికలూ మన Modern Review వగైరా చదువుతూ వుండేవాణ్ణి. అవన్నీ జ్ఞప్తికి వచ్చి ఆంధ్రభాషలో సచిత్ర మాసపత్రిక, ఆపద్ధతులమీద నడిపితే బాగుంటుందని నిశ్చయించుకొన్నాను. హెూతా స్వామిశాస్త్రి గారు, వజ్ఝ బాబురావుగారు ఆసంవత్సరమే మిత్రులైనారు. వారిద్దరూ చిత్రకారులు కావడంచేత ఈపద్ధతి ఆమోదించి చాలా ఖుషామత్ చేశారు. "త్రిలింగ" తప్ప ఆరోజుల్లో చెప్పదగిన మాసపత్రిక లేనేలేదు. 'ఆంధ్రభారతి' అంతరించిపోయింది. 'అఖ్యాయిక' అనే పేరుతో మాసపత్రిక ప్రచురించడానికి ఏర్పాటుచేసి ప్రకటనకోసం కొంతధనవ్యయంకూడా చేశాను. అంతకుపూర్వం కొన్ని మాసాల కిందట ఐరోపా మహాసంగ్రామం ప్రారంభమైంది. గవర్నమెంటువారు కొత్త పత్రికలకు తేలికగా అంగీకారం ఇవ్వడంలేదు. నేను ఆట్టే ప్రయత్నం చెయ్యకుండా నిరుత్సాహపడి ప్రయత్నం విరమించాను.

ఆ కాలంలో 'ఆఖ్యాయిక' ప్రచారంలోకి వచ్చినా కృతక గ్రాంధిక భాషమాత్రమే ఉపయోగించేవాళ్ళము. అప్పటికి తయారైన మిత్రులకథ లన్నీ అలాగే వున్నవి. పద్యాలసంగతి చెప్పక్కర్లేదు. అది రాకపోవడమే మంచిదని తరవాత కొంతకాలానికి అనుకొన్నాను.

స్వామిశాస్త్రిగారు తెనాలి హైస్కూలునుంచి రాజమహేంద్రవరం కళాశాలకు చిత్రలేఖనోపాధ్యాయుడుగా వెళ్ళుతున్న సందర్భంలో సభ చేశారు. ఆయనను గురించి నేను అరగంటసేపు ఆరసున్నాలు బండిరాలతోకూడా ఖచ్చితంగా ఉపన్యసించేసరికి నా గ్రాంధిక భాషాప్రవాహానికి శ్రోతలు ఆశ్చర్యపడ్డారు. ఒక మిత్రుడు పుస్తకంలాగ మాట్లాడావు అన్నాడు. ఆకాలంలో సంభాషణకూ గ్రంథానికీ తేడా వుండగూడ దనే నామతం. చిన్నతనంలో కొక్కొండ వేంకట రత్నంగారినిగురించి కథలు వినడంవల్లా, ఒకపర్యాయం ఆ అయిదడుగుల ఎత్తు

మనిషి ఉపన్యాసం వినడంవల్లా సర్వకాలసర్వావస్థల్లో గ్రాంథికభాష మాట్లాడడమే ధర్మమని వెర్రి తల కెక్కింది! సంస్కృతము సలక్షణంగా మాట్లాడితే పుణ్యం వస్తుందనీ స్వర్గాదిలోకాలు కరతలామలక మవుతాయనీ వృద్ధులు చెవుతూంటే వినడంకూడా కొంత పనిచేసింది. మొత్తంమీద భాషను సంస్కరించాలనీ ఉద్ధరించాలనీ లక్ష్యప్రాయంగా వుండాలనీ భ్రాంతి పట్టుకొన్నది.

గతసంవత్సరం ఆంధ్రసాహిత్యపరిషత్తువారు నాకు ఆహ్వానం పంపారు. కార్యదర్శుల్లో ఒకరు పురాణం నాగభూషణంగారు మాకు బంధువు. ఆయనకు నాపుస్తకాలంటే చాలాప్రీతి. తద్వారా ఆహ్వానం వస్తే కాకినాడ పరిషత్సమావేశానికి వెళ్ళాను. అప్పుడే గురజాడ అప్పారావుగారినీ, గిడుగు రామమూర్తిపంతులుగారినీ చూచాను. ఆసభలో వారిద్దరికీ మాట్లాడడానికి అవకాశం వున్నట్టు తోచదు. పరిషత్తువారిప్రాబల్యమే కొంతకాలంవరకూ నామీద చలామణీచేసింది.

ఒకసభలో తెనాలిలో కొందరు యువకులు ఉపన్యాసం చెప్పారు తెలుగులో. వాళ్ళవ్యవహారభాషకు నేను 'shock' అయి లేచి, గ్రాంథికంలో మాట్లాడడం మీరంతా నేర్చుకొనేవరకూ ఉపన్యాసాలు చేయవద్దని గ్రాంథికంలో ప్రసంగించేసరికి వాళ్ళు ఖంగారుపడి క్రమంగా నేర్చుకొంటామని వాగ్దానం చేసి నన్ను వదిలించుకొన్నారు.

దీనికి ప్రోద్బలం మరొకటి జరిగింది. అదివరకు మూడునాలుగు సంవత్సరాల కిందట హిందీ ఉర్దూభాషలు పుస్తకాలను బట్టి కొంతవరకు నేర్చుకొన్నాను. ఉర్దూ మనదేశంలో తురకలకు సరిగారాదనీ, ఆంధ్రవైష్ణవుల అరవంలాగ వుంటుందనీ ప్రతీతి. ఉర్దూ స్వచ్ఛంగా మాట్లాడితే మనిషికి చాలా హుందా వస్తుందని విన్నాను. నేను గుంటూరులో వున్నప్పుడు షేక్ ఇమాంసాహెబుతో స్నేహం వుండేది. పెద్దపెద్దమౌల్వీలు వస్తూండేవారు. ఒకపర్యాయం పర్షియానుంచి ఒకరూ ఆఫ్‌గన్ ఇస్తాన్ నుంచి మరొకరూ వచ్చి మాట్లాడుతూవుంటే ఆభాషలకు నేను ఆశ్చర్యపోయాను. తెనాలిలో పెద్దఉస్తాద్ ఎవరూ లేకపోయినా మహమ్మద్ ఖాసింసాహేబుగారికి ఉర్దూఫారసీ భాషలు వచ్చునని తెలిసి ఆయన్ని పిలిపించి ఆరెండుభాషలూ కొంతవరకు అభ్యసించాను. ఉర్దూలో 'హుస్న కా డాకూ', 'సర్గజస్త్ ఆజాద్ బఖ్త్ పాద్‌షాహకీ' మొదలైనపుస్తకాలు చదివేసరికి అందులో వుండే 'లఫ్'జులు మన భాషలోనికి కూడా తేవలెనని బుద్ధి పుట్టింది. తెలిసినవాళ్ళను కనుక్కుంటే ఉర్దూభాషలోనుంచి తెనుగులోనికి తీసుకురాదగిన నవలలు అప్పటికి లేవనీ, భాషలో పసేగాని నవలల్లో నాణ్యం లేదనీ అన్నారు.

పాశ్చాత్యుల నవలావాఙ్మయం బాగా తరిచి చూస్తేనే తప్ప నవలారచనకు పూనుకోగూడదని మొదట ఫ్రాన్సుదేశ గ్రంథకర్తల పుస్తకాలు చదవడ మారంభించాను. **Victor Hugo, Alfanzo Daudet, Alexander Dumas, Emile Zola** మొదలైనవారి గ్రంథాలు చదివి, రష్యాదేశపు నవల గొప్పదని విని టాల్‌స్టాయ్, డాస్టవిస్కీ, గోగోల్, తూర్జినీవ్ ప్రభృతుల నవలలూ కథలూ ఆసంవత్సరమంతా పఠించాను. పద్యకావ్య నాటకపఠనం మానలేదు. సంస్కృతభాషను విడిచిపెట్టలేదు. వ్యుత్పన్నతకోసమై దేశచరిత్రలూ, శిల్పగ్రంథాలూ, సాహిత్యవిమర్శలూ వాఙ్మయచరిత్రలూ, కవిచరిత్రలూ, నిరంతరం పఠిస్తూ పుష్పాలల్లి గ్రంథరచన మీదికి బుద్ధిపోనేలేదు.

= క్రమశః =

*

# నవ్వు

చింతా దీక్షితులు

ఫక్కున సూర్యుడు నవ్వాడంటే
పట్టపగలు ఈ లోకముకు!

ఫక్కున చంద్రుడు నవ్వాడంటే
చల్లనివెన్నెల జగమునకు!

ఫక్కున పాపాయ్ నవ్వాడంటే
పరమానందం నీకూ నాకూ!
అవునా కాదా అలివేణీ!

*

# శిష్టభాష

## మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రి

శ్రీ రావుసాహెబు, మహామహోపాధ్యాయ, హిందూకేసరి గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారితో నాకు పాతిక సంవత్సరాలనుంచి విశిష్టపరిచయము కలదు. వ్యావహారిక భాషావివాదమునకు అంకురారోపణము చేసిన మహోత్సవములో నేనున్నూ చందనతాంబూలా లందినవాడనే. ప్రారంభదశలో వారి వాదము నొల్లక తీవ్రముగా ఎదుర్కొనుటకు నే నుద్యమిస్తిని. పంతులుగారు నా అభిప్రాయము గ్రహించి వ్యావహారిక భాషలో ముద్రితములున్నూ అముద్రితములున్నూ అయిన వైద్యజ్యోతిషధర్మశాస్త్రగ్రంథాలను, వ్యాఖ్యానములను, శాసనములను వేవేలు నాకు చూపి నా అభినివేశమును సడలించినారు. నాడుమొదలుగా వారి అనుచరవర్గములో చేరి నా ఉడతాభక్తి చూపుచుంటిని. ఆదినములలో పెక్కండ్రు పండితప్రకాండులు పంతులుగారిపై తమ వాగ్వ్రజవర్షధార నిరంతరము కురిపించిరి.

అయినా పంతులుగారు మహామేరువువలె చలింపక తాము పూనుకొన్న కార్యము దక్షతతో సాగించి నేడు సంపూర్ణదిగ్విజయము పొందినారని సంతోషముతో విన్నవిస్తున్నాను. నేటి వార్తాపత్రికలూ, నవలలూ, చరిత్రగ్రంథములూ, వ్యాఖ్యానములూ మొదలయిన వన్నీ వారి యశఃపతాకలై దశదిశల నెగురుతున్నవి. వేనవేలు విపక్షులు సపక్షులైనారు. ఆగ్రహ మనుగ్రహమైనది. అపశబ్దము సుశబ్దమైనది. మ్లేచ్ఛు లార్యులైనారు. సర్వమూ తారుమారై తారకము ముట్టినది. సభాముఖమున పంతులుగారిని ఎదుర్కొనే గ్రాంథికాభిమాని నే డరిది. స్వపక్షాభిమానముతో కొంతమంది పండితకవిచంద్రులు పగటింటి చంద్రులై వెలవెలబారి కనబడుతున్నారు. స్వార్థపరత, దంభము, మోసము ఎంతో కాలము నిలిచి ఉండలేవు. తత్త్వము తలలలో నాటుకొన్నది.

---

శ్రీమన్మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రులవారిని ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు "కలాప్రపూర్ణ" బిరుదమునిచ్చి బహూకరించినందుకు రాజమహేంద్రవనగరమందలి విద్యాసంస్థలు 6-10-86 తేదీ సాయంకాలము పురమందిరమున అభినందనపత్రము సమర్పించినవి. ఆసభ ముగిసినపిదప శ్రీ రావుసాహెబ్ గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారు "లౌకిక భాషానుశాసనం" అనే విషయమునుగూర్చి సంగ్రహముగా శ్రీ సుబ్బారాయశాస్త్రులవారి అధ్యక్షత నుపన్యసించినారు. అనంతరము అధ్యక్షులు తమ అభిప్రాయము ఇట్లుపన్యసించినారు.

శ్రీరామమూర్తి పంతులుగారి వాదములో సత్య మున్నది. దేశపరిస్థితుల లోనూ భాషాపరిస్థితులలోనూ కూడా పూర్వాచారపరాయణులు మార్పులకు సహించరు. సంస్కర్తలు రెండింటిలోనూ ప్రకృతి కనుకూలమయిన మార్పు లంగీకరిస్తారు. పూర్వాచారపరాయణు లేవిషయములోనూ స్వాశయమును నిర్ధారణగా చెప్పరు. తెనుగుభాషకు నన్నయగారి భారతభాగము సమగ్ర లక్ష్యమున్నూ చిన్నయసూరిగారి వ్యాకరణము సమగ్రలక్షణమున్నూ కాజాలవు. నన్నయ భారతములో నూటికి ౭౦ సంస్కృతపదములున్ను ౩౦ తెనుగు పదములున్ను కదా ఉన్నవి! సూరిగారి వ్యాకరణము తన నీతిచంద్రికరూపముల కయినా సరిపడక ఉన్నదికదా! జీవద్భాషలు అర్థములోనూ, శబ్దస్వరూపము లోనూ, పదప్రయోగవిధానములోనూ కూడా మారుతూ ఉంటవి. హిందీ భాషలో 'య'కారస్థానమున 'జ'కార ముచ్చరిస్తారు; 'కృష్ణ'శబ్దమునకు 'క్రుష్ణ, కిష్ణ, కిత్త' మున్నగు అపభ్రంశరూపములు పెక్కులు తెలుగులో వచ్చినవి. 'అనుమానము' సంస్కృతములో ప్రమాణవిశేషము; తెలుగులో సందేహము. ఈవిధముగా భాషలో మార్పులు కనబడుతున్నవి. సంస్కృతభాషకూడా వ్యవహారములో ఉన్నంతవరకూ మార్పు పొందుతూనే వచ్చినది. వైదికకాలము లోని సంస్కృతము వేరు; లోకములోని సంస్కృతము వేరు. వాటికి అనుశాసనములు వేరువేరుగా ఉన్నవి. వ్యాకరణము లన్నీ ఒకనాడు పుట్టినవి కావు. ఒక కాలమున అసాధువులయినశబ్దములు కాలాంతరమున సాధువు లవుతవి. కాళిదాసుని 'విశ్రామ'శబ్దప్రయోగము పాణినీయముప్రకారము అసాధువు; కాని వ్యాకరణాంతరముచే సాధువు. భాషశిష్టవ్యవహారములో మారినపుడు వ్యాకరణము కూడా మారవలెను. ఒకే వ్యాకరణము భాషకు శాశ్వతముగా మంగళసూత్రము కట్టి స్వాధీనము చేసుకొనజాలదు. కుమ్మరి కుండలనువలె వైయాకరణుడు శబ్దములను పుట్టింపజాలడు. భాషాశిష్టులు (లోకజ్ఞానము గలవారు) సభలలో వాడేభాష "భాష" గాని కేవలము పామరులు వాడేభాష "భాష" కాదు. అట్టి శిష్టభాషనే గ్రంథములలో వాడుట సంప్రదాయము. కాలానుసారముగా మారిన భాషకు వ్యాకరణములు వ్రాయుటకూడా ప్రాచీన సంప్రదాయమే. ఇందుకు "ననుగాత్రి" మొదలయినవి తార్కాణములు. ఇంతేకాక ఏఅనుశాసనమైనా భాషను సమగ్రముగా సంస్కరింపజాలదనీ, అట్టి విశిష్టవ్యవహారమే సంస్కారముగా గ్రహింపదగినదనీ పాణిని "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను సూత్రముచే సోదాహరణముగా సూచించినాడు. ఈయాశయమునే "భవేద్వర్ణాగమా ద్ధంసః సింహో వర్ణవిపర్యయాత్ । గూఢోత్మా వర్ణవికృతేః వర్ణనాశాత్ పృషోదరమ్॥" అని అభియుక్తులు వివరించి ఉన్నాడు. శిష్టవ్యవహారములో వర్ణా

గమవిపర్యయవికారలోపములు కనబడితే అవి దూష్యములు కావని మనము గ్రహించడమే న్యాయ్యము.

నన్నయాదులకు అప్రసక్తములయిన పదపదార్థములు వేవేలుండిపోయినవి. నేడు నవీనములయిన భావములూ, పదార్థములూ కుప్పతిప్పలుగా ఉదయించినవి. పూర్వాచారపరాయణులు నవీనశబ్దసంతతికి ప్రాచీనవ్యాకరణపద్ధతి ననుసరించి ప్రకృతిప్రత్యయవిభాగాదులు చేస్తూ ఉన్నారు. అట్లుకాగా శబ్దము నవీనమున్ను ప్రకృతిప్రత్యయవిభాగాది రూపసంస్కారము ప్రాచీనమున్ను అయి శాబ్ద్యతకు భంగము గలిగిస్తున్నది. శాబ్ద్యత ననుసరించే భాషను సంస్కరించవలెను. తమ ఆశయములను పరులకు వెల్లడించడమే భాషయొక్క ముఖ్యప్రయోజనము. అదే సిద్ధింపకపోయేయెడల భాష వ్యర్థము. విశేషించి మాతృభాషలలో ఝడిత్యర్థస్ఫూర్తికే ముఖ్యస్థాన మివ్వవలెను. 'ఫిజిక్సు' మున్నగు శాస్త్రవిషయములను నన్నయాదుల భాషలోగాని కేవలపామర భాషలోగాని వ్రాస్తే అర్థస్ఫూర్తికాక పరివర్తనప్రయోజనమే క్షీణిస్తుంది. విజ్ఞానాభివృద్ధికిన్ని వ్యవహారసిద్ధికిన్ని శిష్టభాషే ఉపకరిస్తుంది. భాషకు విచ్ఛిత్తివిశేషమును కలిగించడముకూడా ఒక ప్రయోజనమే. తార్కికుడు "శుష్కో వృక్షః తిష్ఠ త్యగ్రే" అని చెప్పగా కవి "నీరసతరు రిహ నివసతి పురతః" అని చెప్పెనట. వీటిలో అర్థమొక్కటే అయినా విచ్ఛిత్తిలో అంతర మున్నది. కవులు తమ రసముల కనువైన భాషను వారే సేకరించుకొంటారు. శృంగార రసములో అతిదీర్ఘసమాసాదులు ప్రయోగిస్తే అందులో రసాస్వాదమే కలుగదు. ఏపద్ధతిలో, ఏసందర్భములో రసపుష్టి కలుగుతుందో అది కవులకే తెలుస్తుంది. నిఘంటువులలో "ఏహ్యాము" *మొదలయిన అపశబ్దములు ఎక్కిపోయినవి. ఆనిఘంటువులు అల్లకల్లోలముగా ఉన్నవి. అట్టి కోశముల సాహాయ్యముతో తమకు అసహజమైన భాషలో కవిత్వ మల్లితే అది రసాస్వాదన కలిగిస్తుందా? తమ కావ్యరచనకు రసానుకూలమైన భాషను కవులే చూచుకొనవలెను. వారు నిరంకుశులు. ఈభాషావివాదములతో కవుల కంతగా ప్రసక్తిలేదు. శాసనములలోని భాష, ప్రాచీనాంధ్రలేఖలు, ప్రాదెనుగుగమ్మ, అప్పారావుగారిభాష - ఇవన్నీ ప్రాచీనాంధ్రభాషాపరిణామములే. "గ్రాంధికభాషే అందరికీ సుబోధముకాని వ్యావహారికభాష అన్నిమండలములవారికీ సుబోధము కాదు" అని గ్రాంధికవాదులు వాదిస్తారు. మాండలిక భేదము లుంటే నిఘంటువులు వ్రాసి వాటిని చూపండి. గ్రాంధికభాషకుమాత్రం మాండలిక భేదము

*చూ — ఏహ్యాము, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు ఆంధ్రవాచస్పత్యము. శబ్దరత్నాకరములో ఈపదము లేదు. సంపాదకుడు.

తప్పేదికాదు. భాషకు ప్రకృతి ప్రత్యయవిభాగము తెలియని వక్రగతి తెచ్చి పెట్టడము మంచిదికాదు. నేడు వార్తాపత్రికలలోనూ గ్రంథాదులలోనూ "గౌరవనీయులు" అనే పదము ప్రాయికముగా స్వేచ్ఛగా వాడుకచేస్తున్నారు. గౌరవశబ్దముపైని 'అనీయర్' ప్రత్యయముచేర్చుట కృతకము; కేవలము తప్పు. ఇట్టివే ప్రాముఖ్యత, ఏహ్యము మొదలయినవి పెక్కుపదములు కనబడుతున్నవి. ఇట్టి కృతకభాషను ఆమోదించేవారు శిష్టవ్యవహారభాషను అంగీకరించడానికి వెనుకాడుట న్యాయ్యముకాదు. పామరులు సరిగా ఉచ్చరించలేక తారుమారుచేసిన శబ్దములు సేకరించుటకాని, శిష్టభాషను పరిహరించుటకాని- రెండున్నూ యుక్తిసహములు కావు. అర్థానుస్వారాది పీడవల్ల సహృదయుల భావములు లోలోపల సమసిపోకుండా వ్యావహారిక భాషలోనే వ్రాయుటకు అవకాశము ప్రసాదింపవలెను. "నన్నయచిన్నయల మార్గానువర్తులే పండితులు; అన్యులుకారు" అని చెప్పుట సమంజసముకాదు. వ్యాకరణవిరుద్ధమైన భాష అంతా నిషిద్ధమే అంటే సంస్కృతేతరములయిన భాషలన్నీ అపభ్రంశములే అవుతవి. అవన్నీ నిషిద్ధములే! అపక్షమున సర్వవ్యవహారహాని సంభవిస్తుంది. అందువల్ల శిష్టవ్యవహారభాషను కాలానుసారముగా సేకరిస్తూ దానినే సంస్కరిస్తూ ఉండవలెను. ఇదే ప్రాచీన భాషా వ్యాకరణసంప్రదాయము; ఇదే శ్రీ రామమూర్తిపంతులుగారి వాదము!

* వారి వాద స్వరూప సంగ్రహము *

వైదిక లౌకిక భాషలకువలెనే గ్రాంథిక భాషకూ వ్యావహారిక భాషకూ కొంత అంతరము ఉన్నది. వ్యావహారికభాషను గ్రామ్యమని పేరుపెట్టి నిరసించుట తగనిపని. శిష్టవ్యవహారములో ఉన్నభాషలో గ్రంథములు రచించడమున్ను, వాని కిటీవల వ్యాకరణములు పుట్టడమున్ను సర్వదేశభాషాసత్సంప్రదాయము. ఏసుక్రీస్తు దేశభాషలోనే తన పరమధర్మము ఉపదేశించినాడు. బుద్ధదేవుడు అహింసాధర్మములను నాటి వ్యావహారికభాష అయిన పాళీభాషలోనే ఉపదేశించినాడు. రవీంద్రకవీ, ఆచార్యగిద్వానీ, గాంధీమహాత్ముడూ మొదలయిన పండితవరేణ్యు లందరూ తమతమ వ్యావహారికభాషల్లోనే గ్రంథములు రచించి వాసికెక్కి ఉన్నారు. నన్నయాదులు తమ కాలములో శిష్టవ్యవహారమున ఉన్న పదములనే సేకరించి గ్రంథములు వ్రాసినారు. వారికాలములో ప్రాదెనుగు, క్రొందెనుగు అని రెండు లేవు. వారి తెనుగు నేటివారికి ప్రాదెనుగు అయినది. తమ భారతపు తెనుగునే చెక్కుచెమర్చకుండా ఆచంద్రతారకముగా వాడవల

సిన దని వారు అనుశాసించి ఉండలేదు. గ్రాంధికమునే సర్వత్ర వాడవలసిన దని అనుశాసించేవారు దాని నిజస్వరూపమును స్పష్టముగా నిరూపించి అది సామాన్యముగా అందరికీ అలవడుటకు సాధనములుగా కోశములూ వ్యాకరణములూ మొదలయినవి నిర్మించి దేశముముంగిట పెట్టవలెనుగదా!

నేడు నిలిచి ఉన్న నిఘంటువులున్ను వ్యాకరణాదులున్ను ప్రాచీనభాషా స్వరూపమును నిస్సంశయముగా చూపలేవు. పూర్వగ్రంధముల అచ్చుప్రతులకూ, తాళపత్రప్రతులకున్నూ చాలా భేదము కలదు. ఏపాఠము విశ్వసనీయమో తెలియదు. అచ్చుపడని తాళపత్రగ్రంధములు వేవేలున్నవి. ఔపవిభక్తికములు, శకటరేఫము, పదమధ్యమం దుండే అచ్చులూ, జాత్యేకవచన బహువచనములూ, మున్నగువాని నిజస్వరూపము నిర్ణయించడము ఎవ్వరికీ తరముకాదు. పెక్కుక్రియలకు ప్రేరణార్థకరూపము లేవో తెలియవు. ప్రాచీన కారక మెవ్వరికీ సరిగా పట్టుపడదు. ఇట్టిదుస్థితిలో తెలిసీతెలియని సందిగ్ధ ప్రాచీనభాషలో గ్రంధములు రచించిన ప్రయోజన మెవ్వరికీ కానరాదు.

నేటి పండితులు వ్రాస్తూఉన్నభాష కృతకభాషగాని వ్యవస్థగల వాస్తవభాష కాదు. తమకు సుపరిచితముకాని భాషలో గ్రంధములు రచించడము హాస్యాస్పదమే! గ్రాంధికాంధ్రభాషారచనకు మార్గదర్శకులగు పరవస్తు చిన్నయసూరిగారి కృతులలో కూడా తప్పులు వెలసినవి. ఇటీవలి మహాపండితుల రచనలలోనూ తప్పులు మితిమీరి ఉన్నట్లు పంతులుగారు వేనవేలు దృష్టాంతరములు చూపి తమవాదముయొక్క సత్యతను లోకములో కరతలామలకము చేసినారు. వాడుకభాషలో పలువిధములగు గ్రంధములు రచించుట ప్రాచీనసంప్రదాయ విరుద్ధము కాదని తాళపత్రప్రతులూ, తామ్రశిలాశాసనాదులూ, వీధినాటకములూ, యక్షగానములూ, నీతికథలూ, వ్యాఖ్యానములూ, పిల్లలకథలూ మున్నగువాటిని చూపి తమవాదములోని సత్యతను పెక్కువిధముల రుజువు చేసినారు. ఇటీవల పరిష్కర్తలు వాటిని తారుమారుచేసి పరిష్కరించి అచ్చొత్తించి భాషకు మహా ద్రోహము చేసినారు. నేటి వ్యావహారికభాషను గ్రాంధికభాషగా అంగీకరిస్తేనేకాని దేశమునకు సర్వవిధములా అభివృద్ధి చేకూరదు. ఎట్టి మహాభాషాపండితులైనా సర్వవ్యవహారములనూ ఎన్నడూ గ్రాంధికభాషలో చక్కబెట్టుకోలేరు. ప్రాచీనాంధ్రము అన్యభాషవలె అభ్యసించవలసినదే కాని మాతృభాషవలె స్వయముగా మనలను వరింపదు. దానిలో భావము లుదయింపకుండా ఉండడమే ఇందుకు తార్కాణము. కాబట్టి శ్రీ శ్రీ ప్రభుత్వమువారున్ను, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారున్ను, ఆంధ్రసాహిత్యపరి

షత్తువారున్ను, ఆంధ్రలోకమున్ను సత్యమును గ్రహించి వ్యావహారిక భాషకు గ్రామ్యాపవాదమును తొలగించి ఆంధ్రవాఙ్మయములో సముచితమైనస్థానమును దాని కివ్వవలసినదని పంతులుగారి వాదముయొక్క సంగృహీతమైన సత్యస్వరూపము.

* నా మనవి *

క్రూరశాసనములు తల ఎత్తినకొద్దీ నిరంకుశత్వము చెలరేగి దేశమును విప్లవసాగరములో ముంచివేస్తుంది. అల్లే గ్రాంథికవాదులు భాషావిషయములో చేసే నిబంధనలున్నూ నిరంకుశత్వమున్నూ భాషాప్రపంచమునకు విప్లవము తెచ్చిపెట్టుతున్నవి. నిమ్నగామిని అయిన భాషాస్రవంతికి సైకతసేతువు కట్టుట వల్ల ప్రయోజన మణుమాత్రమూ ఉండదు. ఆగట్టు నిలువజాలదు. నిలిచినా పొంగి పొరలి జనపదమును ముంచివేస్తుంది. అనువగుతావులందు ఆనకట్టలు కట్టి కాలువలు తీసి జనపదమును నదీమాతృకగా చేయడమే సరళసరణి.

నన్నయాదులు తమ కథావస్తువుకు అనువైన ఏకొలదిపదములనో స్వీకరించి కృతులు నిర్మించినారు. ఆపదజాలమునకే భాషాసామ్రాజ్యములో పట్టముగట్టి ఆచంద్రతారకముగా రాజోపచారములు చేస్తూ, మిగిలినపదములను వెలివేయుట అభ్యుదయహేతువు కాదు. పామరు లుచ్చరింపజాలక తారుమారుచేసిన పదసంతతికి నియంతృత్వ మిచ్చి మిన్నకుండుటకూడా మంచిపద్ధతి కాజాలదు

తిక్కన నానాజాతివృత్తుల పనిముట్లకున్నూ ప్రాచీన నవీన భావములకున్నూ వాచకములగు పదములను సర్వవిధములా సేకరించి తన కృతులలో ఉపయోగించి తెలుగుభాషకు పరిపూర్ణతను కలిగించి కవిబ్రహ్మబిరుదము పొందినాడు. అల్లే ఆయా కాలములందు ఆయా నూతనవస్తువులకున్ను నూతనభావములకున్ను సంబంధించిన పదములను శిష్టవ్యవహారము ననుసరించి సేకరించి భాషాసేవ చేయడము తెలుగువారి విధి. పూవులోని మకరందము నాస్వాదింపవలెను; పరిమళము నాఘ్రాణింపవలెను; అంతేకాని రేకుల అందచందములకై తగవులాడుట వృథాప్రయాసము.

శ్రీ రామమూర్తిపంతులువారి వాదలక్ష్మికి "చెవగండములు" దాటినవి. ఆమె శైశవము వీడి ప్రౌఢయై, జగన్మోహినియై విబుధులకూ పామరులకూ భాషామృతము పంచిపెట్టుతూ ఉన్నది. తన హావభావవిలాసములతో సహృదయుల హృదయాలను చూరగొంటూ ఉన్నది.

పండితప్రకాండులూ, కవిచంద్రులూకూడా ఆమెకు జోహారు లర్పిస్తున్నారు. పత్రికాప్రపంచమూ వాఙ్మయప్రపంచమూకూడా ఆమె కనుసన్నల మెలగుతున్నవి. పంతులుగారి వాదలక్ష్మికి దిగ్విజయము చేకూరినదని ఘంటాపథముగా చెప్పుతున్నాను. ఈ లౌకిక వైదిక విద్వత్పరిషత్తు సమక్షమున ఆమెను సర్వజనాంగీకారముతో సింహాసనమున కూర్చుండబెట్టి సామ్రాజ్యపట్టభద్రను చేస్తున్నాను. ఓహో హో జయజయ ధ్వానములు! చారిత్రకచతురాననులు శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు ముదిమిచే వణకు చేతులతో ఆమె శిరముపైని మంగళాక్షత లుంచి చిరాయువుగా దీవిస్తున్నారే! ఆమె ద్వాదశ రాజమండలము నను దాసీనస్థానము నాక్రమించినదే! ప్రతిపక్షులు కన్నులెర్ర చేసినా, పండ్లు పటపట కొరికినా, పరుషవాక్కులతో ధూళిరేగించినా మరి ప్రయోజనములేదు. విగ్రహాయానాసన ద్వైధీభావములకు కాలము గడచిపోయినది. సంధి కింకా తరుణము మించలేదు. ఈసంధి సత్రియాగమునకు ఆధ్వర్యవము చేసేవారెవరో తామే చూచుకోవలెను. కాదేని కొలదికాలములో సమాశ్రయణమే కర్తవ్యమగును.

కనుక అన్యభాషల మర్యాద ననుసరించి గ్రాంధిక వ్యావహారిక వాదులు ఒక విద్యాపీఠమున చేరి సమరసభావముతో మెలగి విప్రతిపత్తులు వీడి సర్వగమ్యమగు త్రోవ నిర్మించుట లెస్స అని విన్నవిస్తున్నాను. ఇదే నేనర్పించు మంగళహారతి!

*

# పురాకృతం

శ్రీ పురిపండా అప్పలస్వామి (కవితాసమితి)

గౌతమముని ఛిన్నాస్థులకోసం
కలహించిన నాపూర్వుల మాధ్యం

కబళంకోసం భిక్షాపాత్రిక
పగిలించిన మావ్యాసుని స్వార్థం

తగవుమాలి సీతమ్మ నడవులకు
వెడలించిన మా రామునికౌర్యం

బానిసీనిగా
బిచ్చగానిగా
పతితజీవిగా
చేసి నన్నిపుడు
పీడిస్తున్నవి,

కన్నీళ్లారని నానట్టింటను
కరాళ నృత్యం సాగిస్తున్నవి,
నరకజ్వాలలు వెలిగిస్తున్నవి !

*

# జెండా

దేవులపల్లి కృష్ణశాస్త్రి

పరువంపు మాజెండా !
భారతీయుల జెండా !
గరువంపు గగినమే
ఒరసి యాడెదు జెండా !

నిదురపోయిన జెండా !
నీలి నీడల జెండా !
కొదమ చుక్కల దండ
కొసల మలచిన జెండా !

నగము పోలిన జెండా !
స్వప్న సీమల జెండా !
సందె వన్నెల నిండ
సాగి ప్రాకిన జెండా !

మేలుకొనిన జెండా !
గాలి దారుల జెండా !
వెలుగు పొదుపుకొండ
నిలిచి పిలిచెదు జెండా !

మొరసి పోయెదు జెండా !
మింటి నడిమి జెండా !
తరుణ తరణి కిరణా
భరణము మాజెండా !

*

# రాష్ట్రియస్యాలకుడు - శకారుడు

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి

రాష్ట్రియుడంటేనే రాజుగారి (బావమరది) స్యాలకుడని[౧] అర్థం. అయినా వాడ వదినలాంటి పవిత్రుడైనందుచాత కాబోలు ఈయన్ను రాష్ట్రియస్యాలకు డని కూడా చెబుతారు. మృచ్ఛకటిక అనే సంస్కృతనాటకంలో శూద్రకకవి ఈయ నను ప్రవేశపెట్టినాడు. అందులో శకారుడు, సంస్థానకుడు, రాష్ట్రియుడు, రాష్ట్రియ స్యాలకుడు అనే పేర్లతో బహుధా ఇతన్ని పేర్కొన్నాడు.

సంస్కృతసారస్వతంతో పరిచయం కల పెద్దలకు శూద్రకుడి మృచ్ఛకటికను గురించి వేరే చెప్పనక్కరలేదు. ఆ భాషలో బయలుదేరిన సాంఘిక కథా వస్తువు గల నాటకాలలో - శేషించినవాటిలో - ప్రధానమైనది ఇది వక్కటే వక్కనాటకం. శూద్రకకవి యీనాటకంలో చాలా స్వాతంత్ర్యం వహించి లౌకికనియమ ప్రవాహానికి ఎదురీత ఈదాడని అనవలసి వస్తుంది ఆలోచించి చూస్తే.

రచన, కథావస్తుపోషణము, పాత్రానుశీలనము, రసస్ఫూర్తి - మొదలయిన వాటిని బట్టిచూస్తే ఇది మహానాటకాల కోటికి చెందవలసివున్నా మనలాక్షణికులు దీనికి దశవిధ నాటకములలో రెండోదైన ప్రకరణస్థానమే ఇచ్చారుగాని ప్రథమ స్థానం ఇవ్వలేదు. కారణం ఏమిచెపుమా! అని అన్వేషిస్తే స్పష్టంగా లేదు గాని ఒక విధంగా పురాణాలనుండి ఇతివృత్తం తీసుకోకపోవడమే అని సూచనగా తెలుస్తుంది.[౨]

సరే, దీన్ని ఇల్లా ఉండనిత్తాము. పంచాంగాలు చించివేసినంతమాత్రాన నక్షత్రాలు ఉండక పోతవా? లాక్షణికులు మహానాటకంగా పరిగణింపనంత మాత్రాన - నిజంగా రసమహితమైన నాటకమే అయితే - లోపం వస్తుందా? ఏదీలేదుకదా! ఈశూద్రకకవిలాగానే భాసమహాకవికూడా ఈకథనే గ్రహించి చారుదత్తమో, లేక దరిద్రచారుదత్తమో - అనే నాటకాన్ని వ్రాశాడట. నేను ఇంకా చూడలేదు గాని చాలా సరసంగా ఉంటూ ఉన్నదని నా మిత్రులు వకరు చెప్పగా విన్నాను.

---

౧. రాజ్ఞస్స్యాలస్తు రాష్ట్రియః - అమరకోశం. ౨. యత్రకవి రాత్మబుద్ధ్యా వస్తు శరీరంచ నాయకంచైవ విరచయతి సముత్పాద్య తద్జ్ఞేయం ప్రకరణం నామ - అనిన్నీ, భవే త్ప్రకరణం వృత్తం లౌకికం కవికల్పితం - అనిన్నీ కవికల్పితం అన్నమాటకు లౌకికం లోకచరితమాత్రప్రసిద్ధం అతఏవ కవికల్పితం - నతుపురాణాది ప్రసిద్ధం - అని అర్థం వ్రాశారు.

అందరు కవులకూ అన్ని కావ్యాలకూ వున్నట్లే ఈమృచ్ఛకటికనాటకాన్ని గురించిన్నీ, దానిని రచించిన కవిని గురించిన్నీ, దానికాలాన్ని గురించిన్నీ, కథ యొక్క మూలాధారాన్ని గురించిన్నీ చాలా మతభేదాలు ఉన్నవి. మన వాళ్ళల్లో మతభేదం అనేమాటకు తాత్పర్యార్థం వకరిమాట మరి వకరికి సర్వాత్మనా పడకపోవడమే కాకుండా, ఒకవిధంగా ఆజన్మశత్రుత్వం – అన్న మాట. నాకు ఇక్కడ ఈచర్చలతో ఏమాత్రమున్నూ సంబంధం లేదు. కారణం లేందీ కార్యం అంటూ ఏర్పడదుగనకా, తండ్రిలేని కొడుకు అంటూ ఉండడు కాబట్టీ – మృచ్ఛకటిక అనేనాటకాన్ని వ్రాసినవాడంటూ వక కవి ఉండక తప్పదు గనక ఉన్నాడని నమ్ముతూ నాకథ ఏదో నేను సాగిస్తాను.

లాంక్షణికుల నియమాన్ని అనుసరించి, కావ్యంలో – (అది శ్రావ్యంగా వున్నా లేక దృశ్యంగా వున్నా) ధీరోదాత్తాదిగుణములతో కూడిన ఉత్తమనాయకుడు వకడు ఆదర్శమూర్తి ఉండవలసి ఉన్నదికదా. ఏమంటే – ఆనాయకుడు ధర్మవీరుడుగా గానీ దానవీరుడుగా గానీ దయావీరుడుగా గానీ లేదా – త్యాగీ కృతీ కులీన స్సుశ్రీకో రూపయావనోత్సాహీ, దక్షో నురక్తలోక స్తేజో వైదగ్ధ్య శీలవా న్నేతా – అనే ఏదోగుణవిశేషణవిశిష్టుడుగా గానీ ఉండవలె నని వారే చెబుతున్నారుగనుక.

మృచ్ఛకటికలోని నాయకుడు చారుదత్తు డనేది అందరికీ తెలిసినవిషయమే. ఈనాటకంలో ఈయనశీలము ఈశ్లోకాన్ని వరసడిగా పెట్టుకొని దిద్ది తీర్చినట్లు స్పష్టంగానే కనిపిస్తూ వుంటుంది. కనుక మృచ్ఛకటికనాయకునిగురించి క్రొత్తగా పరిశీలింపవలసినది ఆట్టే లేదు. ఇక మిగిలింది ప్రతినాయకుడివిషయం. నాయకుడు ఎంతటి ఉత్కృష్టశాలిగా వున్నప్పటికీ, ఆయనగుణము లనే రత్నాలకు మెఱుగుపెట్టడానికిగాను తఱుచుగా కవులు ప్రతినాయకుని ఏర్పఱుస్తూ వుంటారు. ఉదాహరణంగా చూడండి : సకలకల్యాణగుణవిశిష్టుడన్న పేరు రాముడికి ప్రతి నాయకుడైన రావణుడివల్ల మఱింత వన్నెకూ వాసికీ ఎక్కింది. ఇల్లాగే దుర్యోధ నాదులగు ప్రతినాయకులవలన ధర్మరాజాదుల గుణాతిశయాలున్నూ కంసాదు లయిన ప్రతినాయకులవల్ల కృష్ణాదుల లోకోత్తమత్వాదులున్నూ మెఱుగెక్కినవి. కనుక నాయకుడికి ఉత్కర్షను ఆధానంచేసేకొఱకుగాను కవులు ప్రతినాయక కల్పన చేయడమున్నూ తద్ద్వారా నాయకపాత్రమును చక్కగా పోషించి రస స్ఫూర్తి చేయబూనడమున్నూ వకవిధంగా న్యాయంగానే ఉన్నవి.

అయితే ఈసందర్భంలో మనం వక్కవిషయాన్ని మాత్రం జాగ్రత్తగా ఆలోచించాలె. ఏమంటే – ప్రతినాయకుని కల్పనచేసి " తజ్జయా న్నాయకో

త్కర్షః" - అని అన్నాడుకదా అని ఆదినుండీ అంతంవఱకూ ఒక్కటేతీరు బడితెబాజాగా అతగాణ్ణి అతివేలమైన స్త్రీలంపటుణ్ణిగా చేసి బజారెక్కించడం గానీ, లేక తాగుబోతునుచేసి తందనాలు ఆడించడంగానీ, జూదగాణ్ణిచేసి పెండ్లాన్నీ బిడ్డలనూకూడా కుదవబెట్టేవాణ్ణిగా చేయడంగానీ- ఇత్యాదులు వర్ణించడమనేది చేయవచ్చా? ఒకవేళ చేస్తే అల్లాంటిప్రతినాయకుణ్ణి జయించడంచేత ఆనాయకుడికి ఏమాత్రమైనా గౌరవం వస్తుందా? మాటవరసకు వస్తుందని అన్నా- అది గౌరవపదార్థంగా మనం అంగీకరించవచ్చా- అనేవిషయం ఆలోచించవలసి వుంటుంది. ఇది ముఖ్యమని అనుకుంటాను.

కాని సహృదయుడుగానీ, లేక సుహృదయుడుగా గానీ వున్నకవి యెవ్వడున్నా నాయకోత్కర్షకోసరం కేవలం దౌర్భాగ్యచక్రవర్తిగా వుండునట్లు ప్రతినాయకుణ్ణి ఏర్పరచడు; ఏర్పరచపూనుకోడు కూడా - అని మనం నిశ్చయించవచ్చు. సందేహం లేదు. అయితే ఈభావంతో మనం మృచ్ఛకటికను అనుశీలనం చేస్తే- మన బుద్ధికి- ఇందులో శూద్రకకవిచే త్యాగాదులయిన వుత్తమ గుణాలు పూర్తిగా కలిగివున్న నాయకుడైన చారుదత్తుడికి ప్రతినాయకుడుగా ఏర్పరచబడ్డవాడెవ్వడు? అయినవల్ల అంటే ఆ ప్రతినాయకుడివల్ల - నాయకుడికి తటస్థించిన ఉద్వేలములయిన ఆపదలు ఎట్టివి? సంఘర్షణాలు ఏమిటి? వాటి నన్నిటినీ ఈ నాయకుడు చారుదత్తుడు ఏతీరుగా దాటి అతణ్ణి జయించాడు? అందువల్ల నాయకుడికి ఏర్పడ్డ ఉత్కర్ష ఎట్టిది? - అనే ప్రశ్నలు బయలుదేరుతవి గదా! శూద్రకకవియొక్క మృచ్ఛకటిక నాధారం చేసుకొని ఈప్రశ్నలను గురించి విచారణచేయడమే ఈవ్యాసమునకు ప్రధానాశయం. కనుక క్రమంగా ఒక్కొక్క విషయాన్ని తీసికొని అనుశీలనం చేదాము.

మృచ్ఛకటికలోని నాయకుడికి (చారుదత్తుడికి) ప్రతినాయకుడుగా ఏర్పాటు చేయబడ్డవాడు రాష్ట్రియస్యాలకుడు, శకారుడు - అనే విషయం స్పష్టంగా తెలిసినదే. కాబట్టి ఈశకారుణ్ణి గురించి కొంత ఆలోచించవలసి వున్నది. శూద్రక కవి ఇతడికి ఉపయోగించినట్టిపేళ్లు - రాష్ట్రియస్యాలకుడు, సంస్థానకుడు, రాష్ట్రియుడు, శకారుడు - అనేవి ఏవీకూడా ఇతని నిజమైనపేళ్లుగా తోచడం లేదు. మృచ్ఛకటికకు వ్యాఖ్యానాదులు వ్రాసిన పృథ్వీధరాదులు కూడా ఈవిషయంలో ఇదమిత్థం - అని సునిశ్చితాభిప్రాయాన్ని ఎక్కడా తెల్పలేదు. కాని ఈపేళ్లకు యౌగికార్థములను సూచిస్తూ వెళ్లినారు. వాటిప్రకారం రాష్ట్రియ స్యాలకుడు అంటే రాష్ట్రాధికారి అయిన రాజుకు సంబంధించిన బావమఱది అనిన్నీ, సంస్థానకుడు అంటే - రాజాస్థానముకు సంబంధించినవాడనిన్నీ, శకారోచ్చారణం

చేసే స్వభావంకలవాడనీ - అర్థాలు ఏర్పడతవి. చదువరులుగా వుండేవారి వినోదంకోసరం - మనవాళ్ళు ఈ శకారుడి విషయంలో ఏర్పఱచుకొన్న కొన్ని భావాలు మున్ముందు వుదాహరించి ఆపైని శకారుణ్ణి గుఱించింది నాకు తోచింది వ్రాస్తాను.

పధ్నాలుగోశతాబ్దివాడూ సాహిత్యదర్పణగ్రంధకర్తా 'ఆలంకారికచక్రవర్తి' 'సాంధివిగ్రహిక' 'మహాపాత్ర' 'వివిధవిద్యార్ణవకర్ణధార' - ప్రభృతిబిరుదాలు కలవాడూ అయినవిశ్వనాధకవిరాజు శకారవ్యుత్పత్తిని ఇల్లా చేశాడు:- మదమూర్ఖతాభిమానీ దుష్కులతైశ్వర్యసంయుక్తః, సోయ మనూఢా భ్రాతా రాజ్ఞశ్శ్యాలః శకార ఇత్యుక్తః - మదం మూర్ఖత్వం అభిమానం కలవాడుగానూ నీచకులంలో పుట్టడమూ ఐశ్వర్యం కలిగివుండడమూ కలవాడై రాజుగారి వుంపుడుకత్తెకు తోడబుట్టినవాడుగా వున్నవాడు శకారుడు అనబడతాడు - అని అర్థం చెప్పాడు.

వ్యాఖ్యాత అయిన పృథ్వీధరుడు 'నాటకాలలోవాడే ప్రాకృతాలలో నాలుగు ప్రాకృతాలు ఉత్తమజాతులు వాడదగ్గవనీ, నాలుగుప్రాకృతభాషలు నీచజాతులు వాడదగ్గవనీ, శౌరసేని అవంతి ప్రాచ్య మాగధులు ఉత్తమతరగతి ప్రాకృతాలనీ, శకారీచాండాలీశాబరీఢక్క-దేశీయాదులు అధమతరగతి ప్రాకృతాలనీ, అవి అపభ్రంశభాషావిభాగాలనీ శకారీభాషలో తాలవ్యశకారము హెచ్చుగా ఉంటుననీ' - అంటాడు.

సాహిత్యదర్పణకర్త ఇచ్చిన శకారశబ్దనిర్వచనం కొంచెం హెచ్చుతగ్గుగా మృచ్ఛకటికను మనసులో నుంచుకొని లక్ష్యానుసారంగా చేసిన లక్షణకల్పన అని స్పష్టపడుతూనే వుంది. అందుచేత శకారుడంటే ఎవడూ? - అనే ప్రశ్నకు తగిన సమాధానం కలగలేదు. పృథ్వీధరుడి నిర్వచనాన్నిబట్టి శకారీభాష ఢక్క-దేశీయాదులలాగా దేశాన్ని బట్టి ఏర్పడ్డభాష అయినదీన్నీ, లేక చాండాలీలాగా జాతినిబట్టి ఏర్పడ్డభాష అయినదీన్నీ స్పష్టంగా నిరూపణం కావడం లేదు. ఇక శకారీభాషలో తాలవ్యశకారం హెచ్చుగా ఉంటుంది అనే మాటకూడా లక్ష్యానుసారమైన లక్షణవాక్యంలాగానే ఉన్నది. దీనికిఉదాహరణంగాచూడండి.

శ్లో. ఏశా ణాణకమూశికా మకశికా మచ్ఛాశికా లాశికా
ణిణ్ణాశా కులణాశికా అవశికా కామశ్శ మంజూశికా
ఏశా వేశవహూ శువేశణిళయా వేశంగణావేశికా
ఏశేశే హాశ ణామకే మయికలే అజ్జావి మం ణేచ్ఛది.

అని వసంతసేనకు అతడు చేసిన దశనామస్తుతి శ్లోకంలో ఎన్ని శకారాలు ఉన్నవో చిత్తగించారుకదా! అయితే ఇక్కడ సందేహం ఏమిటంటే - ఈశ్లోకంలో ఇన్ని శకారాలు వచ్చాయి గనక శకారుడూ అని అనవలసి వుంటే, తక్కిన శ్లోకాలల్లో కకారాలో పకారాలో వుంటే 'కకారుడూ' 'పకారుడూ' అని యితడిపేరు మారుస్తూ ఉండవలసిందేనా? అని - ఆలోచించి చూడండి.

కాబట్టి శకారస్వరూపాన్ని ఇవి ఏవీ ఇదమిత్థం అని నిరూపించలేకుండా వున్నాయి. పైగా మరో సందేహం కూడా. ఆకాలంలో రాష్ట్రియుడు అనేపేరు సర్వసేనాధిపత్యంలాంటి బాధ్యత గల ఉద్యోగం కలవాడని సూచిస్తుంది. దర్పణకర్త చెప్పినట్లు నిరంతరమదమత్తుడై స్త్రీలంపటుడై ఉన్నవాడిని బాధ్యతగల అంత గొప్పపదవియందు నియమించి ఉంటారా? శకారుడికి రాజుతో ఉన్న సంబంధాన్నిబట్టిచూచినా, (అనూఢాభ్రాతృత్వం అనేది) రాష్ట్రియముఖ్యుడిగా ఇట్టి అయోగ్యుని నియమించుటకు ఆ రాజుకూడా వట్టి దద్దమ్మగా కనబడటం లేదు. ఈవిషయం మృచ్ఛకటికే వెల్లడిగా చాటుతూవున్నది కదా!

అయితే ఈ శకారు డెవ్వడు? - ఈప్రశ్న మళ్ళా వస్తూనే వున్నది. ఆలోచించి చూస్తే ఇల్లా పొడగట్టుతూ వున్నది:- పూర్వకాలంలో ఆర్యుల జాతీయమతాభిమానాలు భరతఖండంలో అంతటా తీవ్రతమములయిన దండయాత్రలు చేస్తూ విమతస్థులను లొంగదీసుకొనడానికి విశ్వప్రయత్నాలు చేసేవి. వాటిధాటికి ఆగలేక కొందరు లొంగిన్నీ మఱికొందరు కుంగిన్నీ పోయారు. ఇది అన్నిజాతులవారిలోనూ ప్రబలమై ఉన్నట్టు మనపురాణాదులవల్ల స్పష్టపడుతోంది. తక్కిన అన్నిజాతులలోకంటే రక్షణధర్మం గల క్షత్రియజాతుల్లో మఱీఎంత విజృంభించి వుంటుంది. ఆర్యుల ఈదాడిని సహింపజాలక ఎదిర్చి పోరిన క్షత్రజాతులుకూడా కొన్ని ఆనాడు ఉండవచ్చును అని తోస్తుంది. అట్టివారిని వ్రాత్యక్షత్రియులుగా మన ధర్మశాస్త్రాదులందు నిర్దేశించి వున్నారు.

వ్రాత్యక్షత్రియులు అంటే వ్రాత్యులైన క్షత్రియు లని బోధపడుతూనే వుంది కదా! వ్రాత్యులు - అన్నమాటకు ఆర్యత్వప్రయుక్తములగు వైదిక సంస్కారములను లేకుండ జేసికొన్నవారని అర్థము. ఈఅర్థాన్ని "వ్రాత్య స్సంస్కారహీన స్స్యాత్" - అన్న నిఘంటువచనమే బలపరుస్తూ ఉన్నది.

ఇట్టి వ్రాత్యక్షత్రియులలో తమకు లొంగినవారినికానీ, లేక వ్రాత్యత్వమును పొందినందుకు పశ్చాత్తాపమును పొందినవారినికానీ, లేదా ఆర్య క్షత్రియులు తాము ఏకారణముచేతనైనా రాష్ట్రరక్షణమునందు తగినంత శక్తిలేనివారుగా

ఉన్నయెడల, అట్టిసమయములలో స్వార్థమునకై వారిని చేరదీసి, ఉన్నతపదవులను ఇచ్చికాని, వారితో సంబంధబాంధవములను నెఱపికొనిగాని, కూడగట్టుకొనుటకై ఆకాలమునందు వ్రాత్యతాదోషపరిహారమునకై వ్రాత్యస్తోమములు అనే యజ్ఞములనుకూడ నాటిరాజులు చేస్తూ చేయిస్తూనూ ఉండేవారు.

కాబట్టే వ్రాత్యశబ్దమునకు అర్థం నిర్వచించేపట్టుల్లో నైఘంటికులు ఇల్లా సెలవిచ్చి వున్నారు:- వ్రాతాత్సమూహాచ్చ్యవతీతి వ్రాత్యః, (కులబహిష్కృత ఇత్యర్థః వ్రాత్యః) - సంస్కారహీనే జాతిమాత్రోపజీవిని, త్రిపూరుషం పతితసావిత్రీకే ఇత్యాది. వ్రాత్యులను సంస్కరించే ఈస్తోమాలు అంటే వ్రాత్యస్తోమాలు అనే యజ్ఞాలు నాలుగు ఉన్నవట. అందులో ఏస్తోమాన్ని ఎవరెవరు చేయవలెనో వారే వివరిస్తారు. చూడండి :- వ్రాత్యగణస్య యే సంపాదయేయుః తే ప్రథమేన యజేరన్. సంపాదనం చ గాయనన ర్తకాదీనాం తేషాం ప్రథమే ధికారః - అని ఇల్లాగే స్థపతిష్టి ఉక్థ్యాదులు చెప్పబడ్డవి. గ్రంథము పెరుగుతూ వున్నందున ఇక్కడ వాటివివరాలు వ్రాయలేదు. వాటిని ధర్మశాస్త్రాదులందు చూడవచ్చును.

చాలాదూరం శాఖాచంక్రమణం అవుతున్నది. ప్రకృతం ఏమంటే. గాంధారాదిశబ్దాలలాంటిదే శకారశబ్దంకూడా. ఇది దేశవాచకమున్నూ ఆదేశపు రాజును బోధించేదిన్నీ జాతివాచకశబ్దంకూడా అయివున్నది. (లేదా శకదేశమనికూడ వకదేశం కలదుగదా- అక్కడివారు శకారులు.) కాబట్టి శకారదేశీయుల ప్రాకృతభాష శాకారీభాష అనబడుతూ వున్నది. వీరు పైని చెప్పిన విధపు వ్రాత్యక్షత్రియుల్లో పరిగణితులయి వుండవచ్చును. వారితో కార్యావశ్యకత్వం ఏర్పడ్డరాజు కాబట్టి శకారుడి తోబుట్టువును ఉంపుడుకత్తెగా వుంచుకొని అతడికి రాష్ట్రీయాధికారాన్ని ఇచ్చిఉండవచ్చును.

ఈతీరుగా వ్రాత్యక్షత్రియకోటినుండి రాష్ట్రియపదవికి వచ్చిన శకారుడు అధికారగర్వంచేతా, రాజసంబంధిని అనే ఆత్మాభిమానంతచేతా, అంతవఱకూ తమను వ్రాత్యకోటిలో గణించిన ఆర్యపురుషుల జీవితములనుగుఱించి బౌద్ధాదులగు విమతస్థులు వ్రాసిన ఆర్యపురాణవ్యత్యస్తకథలను విని నమ్మియుండడం చేతా, సుప్రసిద్ధుడై ఆర్యమతాదర్శపురుషుడుగా ఆకాలంలో ప్రసిద్ధిపొందివున్న చారుదత్తుని ద్వేషించి సాధింపదలచినట్టి ఆర్యేతరవ్రాత్యవ్యక్తి అయి వుండునని మనము ఇతనిని ఎన్నుకోవచ్చును.

ప్రాచీనకాలంలో రాజాంతఃపురముల్లో ఇట్టి వ్రాత్యులయిన ఆర్యజాతులవారినుండిన్నీ ఆభీరాదులగు నీచజాతులవారి నుండిన్నీ నౌకరులనుగా స్త్రీలనూ పురుషులనూకూడా నియమించువాడుక ఉండేది. విశ్వనాథకవిరాజు- శ్లో. వామన

షండకిరాతమ్లేచ్ఛాభీరా శ్శకారకుబ్జాద్యాః- అని ఇట్టివారిని అంతఃపురసహాయులుగా పేర్కొంటున్నాడు. ఇట్లే కౌటిల్యుడు కూడా ఇట్టివారిని నయజ్ఞుడైన రాజు ఉపధాశుద్ధుల గావించి రాష్ట్రరక్షణమునకై జాగ్రత్తచేసుకోవాలె అంటాడు.

శకారుడు పైనివ్రాసినట్లుగా వ్రాత్యక్షత్రియకోటికి చెందినవాడుకాబట్టే బౌద్ధాదులగువిమతస్థులు ఆర్యులపురాణాలలోని పాత్రములగుఱించివ్రాసిన కథాసందర్భములను తాను బహుజ్ఞుడ నని చాటుటకు వ్యత్యస్తముగా ఉదాహరించినట్లు శూద్రకకవి తన నాటకమునందు కూర్చిఉండవచ్చుననిన్నీ, లేనిచో ఇట్టి క్రోధినీ, క్రూరునీ, స్త్రీలంపటునీ బాధ్యతగల రాష్ట్రియాధికారమునందు రాజు ఉంచడం సంభవించదనీ, నాటకమును సూక్ష్మేక్షికతో పరామర్శించినయెడల ఆర్యచారుదత్తునివంటి నాయకుడికి ప్రతినాయకుడుగా వుండి నాయకోత్కర్షను, దానితోబాటుగా తన రాజతంత్రప్రావీణ్యమును సాటిన అంశములు గోచరింపగలవనీ తోచుచున్నది. శకారుని సంభాషణలోని వ్యత్యస్తవిషయములను గురించిన్నీ, ఆయన ప్రతినాయకుడై వుండి చూపిన రాజకార్యనిర్వహణాలోని మెలుగులనూ ముందు వ్రాస్తాను.

*

# ఆనందమూర్తి

పి. గణపతి శాస్త్రి

మీమధురహాస లేశోదయమున దేవి,
తోచె నాకంవ విస్మృతాత్మునకు నాకు
ఏ మహారాజ రాజాధి రాణ్మహార్హ
హైమ మకుట మణిప్రభా దామమూ నని !
చిర చిరంతన యుగ పరంపరల నుండి
ఏ యమృత ధామములు తపియించెనో కద !
నన్ను సృజియించుకొనె మహానందమూర్తి !
భువన మిది దేవి, ధన్యతాపూర్ణ మింక !
ఈ మహానంద సుముహూర్త మేగె ననుడు,
మీస్మరణ సాగరామృతోర్మికల నెన్న
డేని బిందుత్వమేని వహించు కాంక్ష ;
మరణమేని శుభస్వయంవరణ మిపుడు !

# ప్రకృతి సత్యము

బొడ్డు బాపిరాజు

ఏ యరిపేదగుండియల నెక్కి చురుక్కున మూడు ప్రొద్దులన్
పాయని చుట్టమై, కుతిక పట్టి కనీసపు గంజి చిప్పలో
రా యిడి, వేయి నాల్కలను రాజిన యాకలి మంట లెన్ని యీ
యీ మొసంజలో నినుమడించినవో గణియించి నారటే ?

కనికర మూటచేరు కలకంఠ కుహూ. హూ నిక్వణా బిదే
అనుగు నిసుంగు గొంతు తడియూరగ మూల్గుచు నీల్గుచుండ, వె
జ్జున కొక చిల్లపెంకయిన జోలె నెరుంగని పేదముద్దియా
జనని యెలుంగో యేప్పడిగ జూడకు తీసిన వారలుండిరా ?

కరకరి పర్వతెత్తు వడగాడ్పులలో, పసుపారుమేని మేల్
పరువపు క్రొత్తముత్తయిదువల్ మెడగట్టిన తాళిబొట్టు నొం
డరయని తల్లిదండ్రుల ధనాశలకుం బలిచేసి బిట్టు ని
ట్టూరలుచు నూర్పు లెన్ని కలవో అలవోకల పోల్ప వచ్చునే !

ఉక్కుగజమ్ముల ట్లణగ నొత్తుచు ప్రేవుల తోడివైచు ఆ
రొక్కపుసాములన్ దయనెఱుంగని దయ్యపుమూక బారికిం
జిక్కి నరాలబొమ్మలగు జీవులలో నడుకెత్తు నెత్తురుల్
చిక్కగ పూచెనో సరిగ చెప్పుడి ఇయ్యవి గడ్డిపూవులే ?

చల్లని వెన్నెలల్, పిదుకు జాబిలి, ప్రాయపు పాల పొంగులో
చెల్లిన మంచి చెడ్డలను, శీలము కాలము చేయగా తుదిం
దెల్లమొగాలతో, బ్రదుకు నీరసమై నుసిగాగ నేడ్చు ఆ
పిల్లలు ఆ అనాయికలు పేర్చిన కాళిమ మెంత మ్రింగెనో !

తగని దారిద్ర్యరోగ సంతాప పాప
మోహముల నెల్ల తలమోసి ముక్కుచున్న
ప్రకృతి కేటికి వింతరూపముల నిత్తు
వోయి కవిచంద్ర ! పలికింపు మున్న నిజము.

*

# హితసూచని

## టేకుమళ్ల కామేశ్వరరావు

'హితసూచని' అనే పుస్తకం 1862 వ సం॥ జూలై నెలలో అచ్చయింది. ఇది డెమ్మీసైజున 224 పుటల పుస్తకం. క్యాలికో అట్టబెండు. గ్రంథకర్తఅయిన స్వామినేని ముద్దునరసింహానాయుడు యొక్క బొమ్మకూడా పుస్తకంలో వుంది.

ఈపుస్తకంయొక్క ప్రతి ఒకటి గౌతమీ గ్రంథాలయంలోనూ, మరొకటి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిదగ్గిరా వున్నాయి. వీరేశలింగ గ్రంథాలయంలో ఈపుస్తకం లేదు. హితసూచనియొక్క పీఠిక శ్రీ గిడుగు రామమూర్తిపంతులు గారు 'గద్యచింతామణి' లో ప్రకటించారు.

హితసూచనియొక్క ముఖపత్రంవల్ల తెలిసేసంగతి యేమి టంటే - గ్రంథకర్త మరణించినతర్వాత అతని కుమారుడైన రంగప్రసాదనాయునిచేత హితసూచని ప్రకటింపబడినదని - ఈరంగప్రసాదనాయుడు అప్పుడు రాజమహేంద్రవరపు జిల్లా ఆక్టింగు గవర్నమెంటు వకీలుగా వుండేవాడు.

గ్రంథకర్తనుగురించి గ్రంథంలోంచి మనకేమీ విశేషాలు తెలియవనే చెప్ప వచ్చు; ఏవో ఒకటి రెండు మాత్రమే తెలుస్తున్నాయి. ఇతను రాజమహేంద్ర వరపు జిల్లా ఫస్టుక్లాసు ఆక్టింగు డిస్ట్రిక్టుమునసబుగా పనిచేశాడు. 163 వ పుట లోని ఈకింది వాక్యభాగంవల్ల 'ఆదివెలమవారనే మాబంధుజాతమువారు,'యితను ఆదివెలమ కులస్థుడని తెలుస్తూంది. ముద్దు నరసింహం యీపుస్తకం తప్ప మరే మీ రాసినట్టు కనబడదు - ఆంధ్రవాఙ్మయసూచికలో అయినా 'హితసూచని' పేరొక్కటే కనబడుతూంది. ఆకాలంలో వుండే పత్రికలలో ఇతను యేమేనా రాసేవాడో యేమో మనకు తెలియదు. పోనీ అప్పటి పత్రికలు పరిశీలించి తెలు సుకొందామంటే అంతశ్రద్ధగా వాటిని జాగ్రత్తపెట్టినవారెవరు! మన కంతశ్రద్ధ వుంటే మన వాఙ్మయస్థితి ఇలాగ వుండదు.

ముద్దు నరసింహానాయుడు ఆకాలంలో అనేకమంది పెద్దలతో అనేక విష యాలనుగురించి వాదిస్తూవుండేవాడని మనం ఈకింది సంగతినిబట్టి అనుకోవచ్చు. అదేమి టంటే, ఈయనరాసిన 'వివాహప్రమేయం' ఈయన బంధువులు పంపిన ఒక ప్రశ్నకు ఉత్తరం. ఈఉత్తరానికి వీరిబంధువులు జవాబుఇవ్వదలచు కొన్నారుట (215 వ పుట). అత్యాశ్చర్యకరమైన సంగతి. ఎంచేతంటే ముద్దు

నరసింహనాయుని యుక్తివాదాలకు జవాబు యియ్యడం అసాధ్యమైనపని. అం చేతే వారు ఇద్దాము ఇద్దా మనుకోవడమేగాని యియ్యడం పెట్టుకోలేదు. (215 వ పుట)

ఈ గ్రంధకర్త తెలుగు, ఇంగ్లీషే కాకుండా సంస్కృతం కూడా గట్టిగా చదువుకొన్నాడు. ఆసంగతి మనకు 'వివాహ ప్రమేయం' వల్ల తెలుస్తూంది. ధర్మశాస్త్రాధారంతోనే బాల్యవివాహాలు చెయ్యకూడదు అని ఖండించాడు. ఇతను వైద్యంకూడా నేర్చుకున్నాడు. విషూచి కొక చక్కెనిమందు ప్రకటిం చాడు.

హితసూచని 1862 వ సం॥ జూలైలో ప్రకటించబడింది. ఈగ్రంధం గ్రంధ కర్త అనంతరం ప్రకటించబడిందని అన్నాను. అంచేత గ్రంధకర్త మరణించిన తర్వాత రెండుమూడేళ్ళకు ప్రకటించబడి వుండవచ్చు. వివాహప్రమేయ మను ఆఖరువ్యాసంలో 215వ పుటలో 'ఈవ్యాసం (వివాహప్రమేయం) రాసి చాలా కాల మయింది, ప్రతిపక్షుల దగ్గిరనుంచి జవాబుకోసం యిన్నాళ్ళా యెదురు చూశాను, కాని రాలేదు' అన్నాడు. అంచేత అప్పటికి రెండుమూడుసంవత్స రాల కిందటే ఈ పుస్తకం సిద్ధమయి వుండవచ్చుననుకోవచ్చును. మొత్తంమీద 1856 కే హితసూచని గ్రంథం పూర్తి అయిందన్నమాట. చిన్నయసూరి నీతిచంద్రిక 1852 లో ప్రకటింపబడింది. అంటే నీతిచంద్రికతర్వాత నాలుగేళ్ళకు హిత సూచని తయారయిం దన్నమాట.

హితసూచనిలో ఎనిమిది ప్రమేయా లున్నాయి – ఈకాలంలో మనం వ్యాస మంటామూకాని ప్రమేయం అనం. ఆకాలానికి ఇంకా యిటువంటి రచనలకు వ్యాస మనేమాట రూఢి కాలేదు. హితసూచనిలోని ఎనిమిది వ్యాసాలూ ఏవేవంటే - విద్యాప్రమేయం, వైద్యప్రమేయం, సువర్ణప్రమేయం, మనుష్యేతర జంతు సం జ్ఞాప్రమేయం, మంత్రిప్రమేయం, పరోక్షాదిజ్ఞాన ప్రమేయం, వివాహప్రమేయం. ఈ ఎనిమిదింటిలోకీ వివాహప్రమేయం చాలపెద్దది.

హితసూచని రాయడానికి కారణం ప్రకటనకర్త ఇలాగ చెప్తున్నాడు. 'ఈలోకమునందు సకల శ్రేయస్కరంబులకు సాధకంబులగు వివేకసంపత్తులకు వలసిన చర్చ విషయము లనేకము లుండినను వానిలోని కొన్ని విషయములు ప్రజలకు సుబోధమగునట్లు యోచించి......ముద్దు నరసింహనాయని ముఖ్యా వశ్యకములగు కొన్ని విషయములను వచనరూపముగ రచించెను.' సంస్కరించ వలసిన, విమర్శించవలసిన విశేషాలు చాలా వుండగా నరసింహనాయడు కొన్ని

టిని తీసుకొని విమర్శించాడు. అటుతర్వాత వచ్చిన వీరేశలింగకవి సంస్కరించవలసిన విషయాలన్నిటినీ ప్రజలకు చూపి దేశానికి మహోపకారం చేశాడు.

ముద్దు నరసింహం తను రాసిన పీఠికలో దురాచారాలూ, మూఢవిశ్వాసాలూ, పురాణాలూ, ధర్మశాస్త్రాలలో అజ్ఞానం - మొదలయినవి నివారించవలసి వుందని ఈప్రమేయాలు రాశానని అన్నాడు.

ఇతను తన వ్యాసాలలో చెప్పినసంగతు లేమిటంటే —

విద్యాప్రమేయం అన్న వ్యాసంలో విద్యార్థులకు వాస్తవమైన జ్ఞానం తెలియచెయ్యాలనీ, పురాణాలలోని అవాస్తవ మైన సంగతు లన్నీ నమ్మనియ్యకూడదనీ అన్నాడు. గ్రంథశైలి కఠినంగా వుండకూడదనీ, వచనగ్రంథాలు వృద్ధికావాలనీ, పుస్తకాలన్నీ దేశభాషల్లో వుండాలనీ చెప్పాడు. ఆకాలపు విద్యావిధానంలో ఇతను కొన్ని మార్పులు చెయ్యాలని సూచించాడు. భూగోళశాస్త్రం, రేఖాగణితం, జీవశాస్త్రం మొదలైన వన్నీ ఆకాలంలో ఇంగ్లీషులో చెప్పేవారు. అవన్నీ ఇంగ్లీషులో గాక తెలుగులో వుండాలని అన్నాడు. వైద్యం, నీతి, న్యాయం, శారీరం, వ్యవహార విషయాలూ, ఉత్తరప్రత్యుత్తరాలూ, పాకశాస్త్రం మొదలైనవికూడా పిల్లలకు సంగ్రహంగా బోధించాలని అన్నాడు. ఈ పుస్తకాలు రచించేటందుకు ప్రత్యేక పండితసంఘాలను ఏర్పరచాలనీ, ఇవి పుస్తకాలను అప్పుడప్పుడు సరిచూస్తూ కొత్తకొత్త సంగతులు చేరుస్తూ వుండాలనీ అన్నాడు. ఈమోస్తరుగా అప్పటివిద్యావిధానంలో కొన్ని మార్పులు సూచించాడు.

వైద్యప్రమేయం అనేవ్యాసంలో ప్రజలలోని అనేకమూఢనమ్మకాలు ఖండించాడు. లంఖణాలు అన్నిటికీ పనికిరా వన్నాడు. విషూచికి తాను కనిపెట్టిన మందొకటి తెలియజేశాడు. అదేప్రకారంగా ఆకాలంలో ప్రజలలో వుండే యితరమైన అజ్ఞానాన్ని విమర్శించాడు. అంటే, పరుసువేది మొదలైనవాటితో బంగారం చెయ్యవచ్చనుకోడం, మనుష్యేతర జంతువుల కొక భాషవుందని అనుకోడం, ఆభాష కొంతమందికి తెలుసని అనుకోడం, ఆవిషయమై వున్న కథలూ - అన్నీ ఖండించాడు. ఆకథలు నీతికోసం కల్పించబడ్డవే కాని మరొకటి కాదని చెప్పి, పురాణాలను గురించి 'పురాణాదులందుండే సంగతులన్నీ వాస్తవమైనవిగా బుద్ధిమంతులు నమ్మవలసిన పనిలేదు. వివేకశాలులైనవారు పురాణాదులయందుండే ప్రమేయములను పరిశీలిస్తే వాస్తవములైనవాటినిన్ని ఆయా నిమిత్తములలో నుండే నీతినిన్ని యుక్తినిన్ని విశదపర్చగలందులకు కల్పించబడియున్న వాటినిన్ని కనిపెట్టనేవచ్చును, (56 వ పుట) అన్నాడు. రక్షఃప్రభృతి ప్రమేయంలో దయ్యా లనేవి లేవనీ, వాటినిగురించి వున్నకథలన్నీ అబద్ధమనీ వాదిం

చాడు. మంత్రప్రమేయంలో మంత్రాలవల్ల దేవతలు వశమవరనీ, మంత్రాలవల్ల రోగాలు కుదరవనీ, మాంత్రికులను గురించి వున్న కథలన్నీ నీతికోసమే కల్పించబడ్డవనీ యుక్తియుక్తంగా వాదించాడు. పరోక్షాది జ్ఞానప్రమేయంలో మనుష్యులికి భవిష్యత్తు, దేవతోపాసనవల్లా, జ్యోతిషంవల్లా తెలుస్తాయని అనుకోడం తప్పు అన్నాడు. ఈ సందర్భంలో మంత్రాలనుగురించి తన అభిప్రాయ మిలా చెప్పాడు: 'మంత్రములవల్ల ప్రత్యక్షమైన ఫలమేమీ లేదని పైప్రమేయములో వ్రాసియున్నాను. అట్లా వ్రాయడముచేత భగవంతుణ్ణి ప్రతిపాదించే నామములలో నొకదాన్ని స్మరించడమువల్లగాని జపించడమువల్లగాని కిఫాయితు లేదని నాఅభిప్రాయము కాదు. అటువంటి నామము స్మరించడంచేతనైనా జపించడముచేతనైనను ఈశ్వరుణ్ణి తలచుకోడమునకు హేతువుచేతును గనుక భగవంతుణ్ణి ప్రతిపాదించే నామమును మంత్రముగా స్మరించినా జపించినా కిఫాయితు లేదని యెప్పుడూ చెప్పకూడదు.' (161 వ పుట)

ఈ వ్యాసాలలోకల్లా వివాహప్రమేయం పెద్దదని పైన చెప్పాను. ఈప్రమేయంలో వివాహంయొక్క ముఖ్యమైన ఉద్దేశం నశించిపోయి బొత్తిగా అనవసరమైన వన్నీ వివాహం పేరను జరిపించబడుతున్నా యని గ్రంథకర్త చెప్పి, ధర్మశాస్త్రం ఒప్పుకున్నది ప్రౌఢవివాహాలే కాని బాల్యవివాహాలు కాదని శాస్త్ర సహాయంతోనే ఋజువుచేశాడు. ప్రజలు వివాహాల్లోచేసే ధనవ్యయానికి దుఃఖించాడు. వితంతువులకు పునర్వివాహం అవసరమని తెలియచేశాడు. కన్యాశుల్కం కూడదన్నాడు. వివాహ ప్రమేయం తనకులంవారు కొందరడిగిన ప్రశ్నకు సమాధానమని వెనకే చెప్పాను. నాయుడుతో ఎవరూ వాదన పెట్టుకోలేరు. పెట్టుకొని గెలవడం అసాధ్యం.

ఈమోస్తరుగా వీరేశలింగానికి చాలాకాలం ముందే రాజమహేంద్రవరంలో సంఘసంస్కరణ వాద ప్రతివాదాలు జరుగుతూ వుండేవి. ఈవాద ప్రతివాదాల యొక్కచరిత్ర మన దురదృష్టంవల్ల మనకు తెలియదు. వీరేశలింగం కూడా యీ వాద ప్రతివాదాల చరిత్ర మనకు తెలియచెయ్యలేదు. సంఘసంస్కరణాభిలాష బ్రాహ్మణులలో బయలుదేరిందో బాహ్మణేతరులలో బయలుదేరిందో పరిశోధన చేసి మనం ముందుముందు తెలుసుకోవలసి వుంది. వీరేశలింగం కాలానికి మాత్రం సంఘసంస్కరణ ఘర్షణలు బాగా వృద్ధి పొందాయి. దానికి వీరేశలింగం పట్టుదలే కారణం.

ఇప్పుడు మరొక సంగతి చూద్దాం. వీరేశలింగానికి హితసూచన్ని గురించి తెలుసా తెలియదా? వేరేశలింగం హితసూచని పేరుగాని, దాన్ని రచించిన

నాయుని పేరుగాని తన పది సంపుటాలలో యెక్కడా యెత్తలేదు. తనకంటే ముందు అద్భుతమైన సాంఘికవ్యాసాలను రాసిన నాయుడు సంగతి యెక్కడా యెత్తకపోడం చాలా ఆశ్చర్యకరమైన సంగతి. వీరేశలింగం ముద్దు నరసింహం సంగతి మనకు తెలియచెయ్యలేదు కాని తాను తెలుసుకున్నాడు. ఆసంగతి మనకు అతనిరచనలవల్లే తెలుస్తూంది. మరొకరు రాసినరాతలను వీరేశలింగం తనసొంతవాటిలాగా వాడుకోగలడు. ఇక్కడ చూపిస్తాను వీరేశలింగం యొక్క తప్పు.

హితసూచనిలోని రక్షః ప్రభృతి ప్రమేయంలోని యీభాగం "చనిపోయిన మనుష్యులు కొందరు రక్షస్సులున్ను - పిశాచములున్ను - భూతములున్ను - దయ్యములున్ను - ఐ - తమకు ఏవిధమైన యిలాకాలేనివారి గృహములయందు కూడా ప్రవేశించి వాటిలో నివసించియుండే మనుష్యులకు కనపడకుండా నుండి తాళములువేసియుండే గదులలోను పెట్టెలలోను ఒకదానిలో నుంచబడిన వస్తువులు మరియొకదానిలో నుండేలాగు చేయడమున్ను, అటువంటి యొక పెట్టెలో నుంచబడిన వస్త్రములలో మధ్యవస్త్రముయొక్క కొన్ని పొరలు కాలియుండేలాగు చేయడమున్ను - ఇండ్లమీద రాళ్ళు పడేలాగు చేయడమున్ను - చూరులయందు ఒకానొకప్పుడు లోపల అగ్నిగల గడ్డితుట్టెలుగాని కొరువులుగాని పొగ రాజుతూ నుండేలాగు దోపియుంచడమున్ను ఒకరు - ఇద్దరు - ముగ్గురు-నలుగురు - ఎత్తడమునకు భారముగానుండే వస్తువులు ఒకచోట నున్నవి మరియొక చోట పడియుండేలాగు చేయడమున్ను - శుభ్రముగా నున్న స్థలముల యందున్ను వస్తువుల యందున్ను అసహ్యములైన వస్తువులు ఉండేలాగున చేయడమున్ను - ఇంకా ఇటువంటి చాలాతొందరలు జరిగించడమున్ను - ఆయిండ్లలో నివసించేవారు వాటిలో నుండలేక మరి వేరేయిండ్లకు వెళ్ళితే అక్కడికిన్ని, గ్రామాంతరములకు వెళ్ళితే అక్కడికిన్ని కూడా వెళ్ళి సదరుతొందరలే జరిగించడమున్ను కలదని చాలామంది నమ్ముతున్నారు కాని వాస్తవముకాదు. (63, 64 పుటలు) ఆ అశక్తములను పొందినవారు వారి స్వభాషలలో నేమి వారికి వచ్చియుండే భాషాంతరముల నేమి శ్లోకముల నేమి పద్యముల నేమి అమితముగానున్ను స్వభావమునకు భిన్నముగానున్ను చాలామట్టుకు అసందర్భములుగానున్ను వచించడము కలదు - వారికి రాని భాషలను - శ్లోకములను - పద్యములను - కూడా వినియుండడము చేత జ్ఞాపకము ఉన్నమట్టుకు సదరు ప్రకారమే వచించడమున్ను కలదు - మరిన్ని వారిలో నొకరు తమశక్తికి సంపూర్ణముగా సరిపడియుండే భారమును ఎప్పుడైనా విశేష ప్రయత్నముచేత వహించడమున్ను కార్యమును

చేయుడమున్ను కలదు - సదరహి ప్రకారము వహించడమున్ను భారమును వహించడమున్ను కార్యములను జరిగించడమున్ను ఆమనిషి పూర్వము సహజముగా జరిగించేవి కానందున వీటిని విన్నటువంటిన్ని - చూచినటువంటిన్ని - వారు వాస్తవమును కనిపెట్ట లేక భ్రమను పొంది ఆ మనిషి తనకు రాని భాషలు మొదలైనవి వచించినట్టున్ను - ఎత్తలేని భారమును ఎత్తినట్టున్ను - చేయలేనికార్యములు చేసినట్టున్ను - ఎంచుకుని వాటిని పెంచి చెప్పడమున్ను కలదు గాని భూతము మొదలైన పేర్లుగల రోగములలో నొక రోగముగల మనిషి సంకోచమున్ను భయమున్ను లేని హేతువుచేత కొంచెము విపరీతముగ భాషలను శ్లోకములను వచించినా - కృత్యములను జరిపించినా ఆమనిషికి రానటువంటి భాషలున్ను శ్లోకములు మొదలైనవిన్ని యథాక్రమముగా వచించడమున్ను నిజబలమువల్ల విశేషప్రయత్నము మీదనైనా చేయలేని కార్యములను చేయడమున్ను అసంభవముగా నెంచవలసినది - యొకానొక కుటుంబమువారిలో ఒకానొకడు యజమానిని వంచించే కపటబుద్ధిచేతనున్ను భూతావేశమైనట్టు చాలా వికారచిహ్నములను కనుపరచేది కద్దు. (68,69 పుటలు)-" పైభాగం వీరేశలింగకవియొక్క ఎనిమిదో సంపుటంలో యిలాగ కనబడుతూంది. "తాళము వేసియున్న పెట్టెలలోని వస్తువుల నొకదానిలోనివాని మఱియొక దానిలోనికి మార్చుటయు, దండెములమీద గాని పెట్టెలలోపల గాని యుండు వస్త్రములను గొంతవారెఱుఁగకుండఁ దీసి కొన్ని పొరలను కాల్చి చల్లార్చి మరల నెప్పటివొప్పున మడతలుగాఁ బూర్వస్థలములలో నుంచుటయు శుభ్రములైన చోటుల సహ్యములైన వస్తువులు పడియుండులాగున జేయుటయు, చూరులలో నుండుచుండు గడ్డితుట్టలు గాఁజుచుండు కొఱవులు దోపుటయు, మొదలగు దుష్కార్యములను జేయుచుండు నాచారము కలవారుగానున్నారు.........ఇద్దఱు ముగ్గురికెత్తరాని బరువుల నొకచోట నున్నవానిని వేఱొకచోటనుండునట్టును ఇండ్లమీఁద రాళ్ళు బొగ్గులు మొదలగునవి పడునట్టును చేయించుచు (389, 390 పుటలు) భూతభీతిచేత దేహమును మఱచి పరవశమయి యున్నప్పుడు కొందరు స్వభాషలోనొండె నితర భాషలలోనొండెఁ దాము విన్న పద్యములను మాటలను స్వభావమునకు భిన్నముగాఁ గారణములేనిదే యసందర్భముగా వచించుట కలదు. .........కొందఱు సుందరులు తాము విన్నభాషలను శ్లోకములను గ్రహించుటయు, సిగ్గుచే వానిం దమకు దెలిసియున్నటు లితరుల కెఱుక సేయకుండుటయు, రోగాదికముచేఁ దెలివియొక్క సహజస్థితి తప్పియున్నప్పుడు లజ్జాభయములులేక సంకోచపడక వాని నుచ్చరించుటయు, చూచిన వారికది విపరీతముగా దోచి భ్రాంతి పడుటయు కూడఁ దటస్థించును (388, 389

పుటలు)". ఈమోస్తరుగా నాయుడు రచించిన దాన్ని వీరేశలింగం తన సొంత మాటలలో చెప్పాడు. పై ప్రమేయంలోని తక్కిన మరికొన్ని భాగాలు కూడా వీరేశలింగం యొక్క ఈవ్యాసంలో కనబడుతున్నాయి. హితసూచనిలోని విద్యా ప్రమేయంలో పదార్థమంతా వీరేశలింగం యొక్క ఎనిమిదో సంపుటంలో 'విద్య' (343 పుట) అనే వ్యాసంలో కనబడుతూంది. ఇలాగే తక్కిన ప్రమేయాల లోవికూడా వీరేశలింగం యొక్క వ్యాసాలలో కనబడుతున్నాయి. కాని ఇది ఫలానాది అని నిష్కర్షగా చెప్పలేము. ఎంచేతంటే అది అతని సొంతమాట లలో జేరిపోతుంది. ముద్దు నరసింహనాయుడు కొంచెం వరస తప్పి చెప్పిన యుక్తి వాదాలన్ని వీరేశలింగం చక్కగా వరసగా ఏర్పరచి చెప్పాడు. హితసూచని వ్యావహారికంలో వుందని చెప్పి వీరేశలింగం దానిపేరు చెప్పడానికి నామోషీపడి దానిలోని పదార్థం వాడుకొన్నాడో యేమో! ఏదయితేయేం ఇతను హితసూ చని ఎరిగివున్నాడు అన్న సంగతి మనకు ఋజువయింది.

హితసూచనిలోని సంఘసంస్కార విశేషాలు తెలుసుకున్నాం. ఇంక శైలి విషయం తెలుసుకొందాం. శైలి వ్యావహారికం. ముద్దు నరసింహం బ్రాహ్మణేత రుడయినా ఎంతో చక్కని వ్యావహారికం వ్రాశాడు. స్వచ్ఛమైన శిష్టులభాష.

ముద్దు నరసింహం సంఘసంస్కారాని కెంత పాటుపడ్డాడో శైలీసంస్కారానికీ అంతేపాటుపడ్డాడు. ఆకాలంలో అప్పటికప్పుడే గ్రాంథిక శైలి ధ్వజమెత్తింది. చిన్న యసూరి తన నీతిచంద్రిక 1852 లో ప్రకటించాడు. నరసింహస్వామి తన గ్రంథ పీఠికలో: 'పదవ్యాపారమందు హద్దులు ఏర్పరచుటకు దేశముయొక్క వాడికయున్ను నీతియున్ను ఆచారములై యుండవలసినది గనుక - అటువంటి పదముల వాడికకు అనుగుణముగానే యీపుస్తకమందు వ్రాయబడుచున్నవి.' చిన్నయసూరి గొప్పపండితుడైనా ఈమాత్రం గ్రహించలేకపోయాడు. ఒక్క పదకొండో శతాబ్దం భాష కంఠతాపట్టడమే పాండిత్యమని అనుకొన్నాడు కామోసు! అరసున్నలూ, బండి 'ఱ' లూ ఎంచేత వాడనక్కరలేదో ముద్దు నర సింహం నిరూపించాడు. గ్రాంథికసంధులూ, అశుద్ధిగురించి "యీపద్ధతి సులభ ముగానున్ను రమ్యముగానున్ను భాషను రచించుటకు సదుపాయమైయున్న ట్టునాకు తోచదు" (పీఠిక) అన్నాడు. హితసూచని ఏదో పెద్దవాళ్ళు చదువుకొని గ్రహింపు అయినంతమట్టుకు తెలుసుకొని పూరుకోడానికి గ్రంథకర్త రాశాడు అని మనం అనుకోవచ్చు. కాని అదికాదు. అతని ఉద్దేశం హితసూచని విద్యా ర్థులకు పఠనీయగ్రంథముగా ఏర్పరచవలసిందని. ఆకాలంలో వ్యావహారిక భాషలో రచించిన పుస్తకాలు పాఠశాలలో నిషేధింపబడలేదు ఇంకా. విద్యార్థులకు

'యీ హితసూచని అప్పుడే కాని ముందు చెప్పబడే గ్రంథములు కొన్ని చదివిన మీదటగాని చెప్పించవచ్చు! (8 పుట) అని అన్నాడు.

ఆకాలంలోని వ్యావహారిక శైలిలో కొన్ని లోపాలుండేవి. 'స'కు 'శ' రాయడం, 'ఋ' కు 'రు' రాయడం, సంస్కృతపదాల వర్ణక్రమం తిన్నగా పాటించకపోడం మొదలైనవి. ఈతప్పులు ఆశతాబ్దంయొక్క మొదటిపాదంలో రాసినవ్యావహారిక గ్రంధాలలో బహుసకృతు; పొరపాట్లు అనే అనుకోవచ్చు. ఇటువంటి తప్పులు అసలు వుండకూడదని ముద్దు నరసింహం యొక్క ఉద్దేశం కాబట్టి పిల్లలకు సలక్షణమైన వ్యావహారికమే నేర్పాలని అన్నాడు. వ్యాకరణం బాగా చెప్పించినట్టయితే పని నెరవేరుతుం దన్నాడు. (8, 7 పుటలు) ఈమోస్తరుగా భాష కోసం కూడా పాటుపడ్డాడు. (మన మిప్పుడు వచనగ్రంధమనే ముక్కకు అతనప్పుడు వ్యాసగ్రంధమనే సమాసం వాడాడు.)

'హితసూచని' లో హిందూస్తానీ పదాలు చాలా కనబడుతున్నాయి. అప్పుడు వాడుకలోవున్న అనేక పదాలు ఇప్పుడు వాడుకలో లేవు.

హితసూచని శైలిలో 'న్ను' లు ఎక్కువ. ఈ 'న్ను' లు వేసి 16 పుటల పాటు ఒకటేవాక్యం వుంది. ఈ వాక్యంలో ఒక కథ అంతా ఇమిడివుంది. చిన్నచిన్న వాక్యాలు రాయడం కూడా అలవాటువుంది కాని విరతి గుర్తులు వాక్యాంతాన్ని పెట్టే ఆచారం లేదు. ఎప్పుడెప్పుడేనా అర్థగీతా, కామా, చుక్కా వాడబడ్డాయి. పేరా కొసనుమట్టుకు చుక్క తప్పకుండా వుంటుంది.

ముద్దు నరసింహం యొక్క చిత్రపటం పుస్తకంలో వున్నందుకు మనమంతా చాలా సంతోషించవలసి వుంది.

హితసూచని కంటె ముందు రాయబడ్డ సాంఘికవ్యాసాల పుస్తకమేదేనా కనబడే వరకూ హితసూచనే మొదటి సాంఘిక వ్యాసాల గ్రంథం అని మనం అనుకోవాలి.

మనభాషలో 'సెలెక్షన్సు' పుస్తకాలు చాలాతక్కువ. అవి ఏర్పరుచుకోవలసివుంది. వ్యాసాల సెలెక్షన్సులో ముద్దు నరసింహనాయని వ్యాసాలు ప్రకటించి విద్యార్థులకూ, చదువరులకూ ఉపకారం చెయ్యవలసి వుంది.

# కృత్యాద్యవస్థ

## విశ్వనాథ సత్యనారాయణ

లోకంలో యేదైనా కష్టమైనపని చేస్తే కృత్యాద్యవస్థ అయింది అంటాం. కృత్యాద్యవస్థ అంటే కార్యారంభములో పడే కష్టం. నా కెన్నిసార్లు ఆలోచించినా, కావ్యారంభ మనే తోస్తుంది. కార్యారంభానికి కష్టం లేదా, అంటే, ఉంది. దానికి విఘ్నేశ్వరపూజాదులతో ఆ కష్టం తీరుతుంది. కావ్యారంభాని గ్గూడా తీరుతుంది గదా అనవచ్చు. మన తెలుగుకవులు చాలామంది అట్లాగే తీర్చుకున్నారు. సంస్కృతంలో లేని కృతి యివ్వడమనే సాంప్రదాయంతో తెలుగుకవుల కా చిక్కు వదిలింది. కథారంభంలో ఆచిక్కు మళ్ళీ వస్తే మన వాళ్ళు తేలిగ్గా దాటుకు పోయినారు. ఆ పూరు కోట వర్ణించడం, సప్రిపరిఖలను వర్ణించడం, నాల్గు వర్ణాల వారినీ వర్ణించడం, ఆపూళ్ళో ఒక రాజున్నాడు అని పేదరాసి పెద్దమ్మ కథవలె అందరు కవులూ తయారు చేశారు. అందుచేత వాళ్ళ కావ్యాలను నిందించడం లేదు. కావ్యాల్లో తక్కిన భాగాలన్నీ జగదద్భుతకరంగా చేశారు. కాని కృత్యాద్యవస్థ అనేదాన్ని పడ్డారుకాదు.

తెలుగులో ఒక రిద్దరు కృత్యాద్యవస్థ పడ్డవాళ్ళు ఉన్నారు. పింగళి సూరన వారిలో ప్రధానుడు. ఆయన కళాపూర్ణోదయ ప్రభావతులు రెండింటిలోనూ కృత్యాద్యవస్థ పడ్డాడు. కళాపూర్ణోదయంలోకన్న ప్రభావతిలో యీ అవస్థ యెక్కువ హృదయంగమంగా ఉంది. కల్పనలో యెక్కువ ప్రసన్నత వుంది.

సంస్కృతకవులు, అందులో నాటకకవులు పడ్డ యీ అవస్థ శిల్పాచార్యకమా అన్నట్లుంటుంది. ఆకవులు మొదలుపెడుతూనే అగాధమైన విషయంతో మొదలు పెట్టడమో, ఒక్కసారిగా పఠితను రసాబ్ధిలో మధ్యభాగంలో దించడమో చేస్తారు. వాళ్ళు కావ్యాన్ని చూచే వైఖరియే వేరు. షేక్సుపియరు నాటకాల్లో ఆయన రాబోయే కథలో వుండే సమస్యాఘట్టాన్ని మొదటి రంగాల్లో ప్రదర్శించి వదిలిపెడతాడు. తక్కిన నాటకం యీసమస్యాపూరణం. ఆయన కథలో అన్ని భాగాలూ ఒకదానితో ఒకటి అతికితే అతుకవచ్చు, అతక్కపోతే అతక్కపోవచ్చు. పాశ్చాత్యగ్రంథాలు చాలాభాగం యిలా వున్నట్టు తోస్తుంది. కొన్ని అత్యుత్తమగ్రంథాలూ వున్నవి. ఇబ్సెన్ వ్రాసిన 'Lady of the Sea' చాలా అద్భుత రచన కలది. Silas Marner ఒకటి

అటువంటిది. ఇంకా ఉన్నవి. ఈ గ్రంథాల్లో ఉన్న గొప్ప యేమిటంటే ఆ గ్రంథకర్తల దృష్టి సర్వతో ముఖమైనది. ఏ నాల్గు ఘట్టాలో రమ్యంగా వర్ణించి కావ్యం పూర్తయిందని అనుకోరు. వారు సృష్టినంతా ఒక అనంతరితమైన సూత్రంగా భావిస్తారు. ఈ సూత్రంయొక్క ఆది మధ్యాంతాలు అన్యోన్య నివిష్టాలుగా ఉంటవి. ఆది అంతమునందు అంత మాదియందును ప్రతిబింబిస్తవి. ఒకే వస్తువుయొక్క పరిణామంకాని, భిన్నవస్తువుల సమాహారం కాదు. ఇది వాళ్ళ సృష్టి వైలక్షణ్యం. ఇది సంస్కృతనాటకకవులు, ప్రధానంగా కాళిదాస భవభూతులు చేసిన సృష్టి. పాశ్చాత్యులలో ప్రధాననిర్దిష్టవస్తువు లోకవర్తమాన ప్రదర్శనమే అవటంచేత యీశిల్పపుబిగువు వస్తుబలము లేక సన్నగిల్లినట్టు కనబడుతుంది. కొన్నిచోట్ల అదీ బాగానే వుండవచ్చు.

ఇట్టి సృష్టిని కావ్యమునందు నిక్షేపించడంలో రెండు పద్ధతులు కనబడుతున్నవి. ఒకటి కావ్యాదియందు కావ్యప్రధానోద్దేశ్యము వ్యంగ్యభూతంగా నిక్షేపించి తక్కిన కావ్యం కావ్యంగా వ్రాసుకుపోవడం. రెండవది కావ్యముయొక్క సర్వాకృతి ఒక మహార్థానికి వ్యంగ్యరూపంవలె చెయ్యడం. ఈ పద్ధతిలో కవికి కృత్యాద్యవస్థయే కాదు, కృతి మధ్యాంతావస్థలు కూడా తప్పవు. ఈ రెండోరకాన తన కృతిని దీర్చిన ప్రభువు ఋషిప్రథమగణంలో చేరుతాడు. వారిద్దఱూ కాళిదాసభవభూతులు. శాకుంతలోత్తరరామచరితలలో వారిట్లాంటి సృష్టి చేశారు. ఈచెయ్యడంలో వారిద్దఱిమధ్యా కొంత వైలక్షణ్యంలేకపోలేదు.

ఇందులో మొదట చెప్పినటువంటి సృష్టి వారిద్దరినీ మినహాయిస్తే మఱికొంత మంది చేశారు. భాసుడు, భట్టనారాయణుడు మొదలైనవారు కృత్యాద్యవస్థ మాత్రమే పట్టారు. ఈ యవస్థ కలికాలములోనే మొదలు పెట్టలేదు. త్రేతనాటి వాల్మీకి, ద్వాపరమునాటి వ్యాసుడూ దీనికి మార్గదర్శకులు.

వాల్మీకి రామాయణము నారంభిస్తూ ఎల్లా ఆరంభించాడు? అయోధ్యాపుర వర్ణనలతో ప్రారంభించలేదు. రాజును వర్ణించి కథ మొదలు పెట్టలేదు. మునిపుంగవుడైన వాల్మీకి వాగ్విదాం వరుడైన నారదుని 'కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్.........ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః' అని ప్రశ్నించి తన మహాకావ్య పరమార్థంలోనే మహానాయకుణ్ణి కూడా సంకల్పించాడు. ఆత్మవాన్ అని పరమేశ్వరుణ్ణి ఉద్దేశించాడు. ఈకావ్యారంభం యుగాలు చన్న తరువాత సామాన్యంగా గోచరిస్తుంది. చిన్నప్పుడు చదివిన మనుచరిత్రలో పద్యాల్లోని అందం పెద్దయింతర్వాత తెలియనట్లు. కాని దానిలో వున్న ప్రత్యగ్రత భావిస్తే గోచరిస్తుంది. అది అలుప

మైన విషయం కాదు. కావ్యదృష్టితో గాకుండా, పురాణ దృష్టితో చూస్తే ఆయన అడిగాడు, ఈయన చెప్పాడనటం మాత్రమే పరమార్థం. అది అట్లాగే జరిగినా దాన్ని కావ్యాదియందు నిక్షేపించడం మాత్రం కవితాత్మను దర్శించడం.

ఇటువంటి కావ్యాదిసృష్టి యుగధర్మభేదంవల్ల మారుతుంది. వేదచ్ఛందస్సులు మాత్రమే తెలిసివున్న ఆరోజుల్లో కావ్యాది యిట్లా చెయ్యడమే ఘనం. పైగా ఆకాలంలో వుండే ధర్మపు బిగువు కాలం గడచినకొద్దీ వచ్చిన ధర్మచ్యుతి లేక పోవడంవల్ల కావ్యంలో కూడా ప్రతిబింబిస్తూ వుంటుంది. నిత్యధర్మానసక్తుడికి వ్యంగ్యం తక్కువ కావాలి; వ్యంగ్యం ద్వారా రససిద్ధి అల్పసంస్కారికి.

ఇంక వ్యాసుని కావ్యారంభం చూడాలి. వ్యాసుడి నాటికి ద్వాపరం చివరకి వచ్చి కలి ముట్టుకోబోతోంది. ధర్మమంతా ఉత్సన్నమైంది. అందుచేత ధర్మబోధనం చేస్తూ సృష్టియొక్క పరమరహస్యం భారతం చెప్పవలసి వచ్చింది. ఆరహస్యం వాల్మీకి నాటికి విస్మృతిపథంలో పడిపోలేదు. వ్యాసుడి నాటికి పడ్డది. కనుక ఆరహస్యాన్ని వ్యాసుడు తన భారతగ్రంథంలో సర్వథా పరామృశిస్తూ కావ్యపరమార్థం మళ్ళా కళ్ళు మళ్ళోరీతిగా భావించకుండా గ్రంథాది యందే సర్పయాగ కథద్వారా ఉపదేశించాడు. భారతమంతా కర్మప్రాధాన్యాన్ని బోధించే గ్రంథం. కర్మ అంటే నిత్యనైమిత్తికం కాదు. ఆగామిసంచిత ప్రారబ్ధాలు. సృష్ట్యాది నుండీ తనయందు ప్రతిఫలించిన బ్రహ్మపదార్థం కలిగిన మూలప్రకృతి యెల్లాపరిణమిస్తుందో అందులో బహుజీవుల కర్మసూత్రం యెల్లా నడుపుతుందో కర్మకు మొదలూ చివరా యెక్కడో యీ విషయాలన్నీ ధ్వని తాలయ్యే సర్పయాగకథను యీ మహావిషయాలనే బోధించే భారతగ్రంథాది యందు ఆమహర్షి నిక్షేపించాడు.

ఆయన భారతాన్ని శంతను డున్నాడు, అని కాని, భరతుడు దగ్గరనుంచి కాని మొదలెట్టి కథ చెప్పలేదు. హస్తినాపురాన్ని వర్ణించనూ లేదు. అయితే సర్పయాగం కథాముఖంగా యెందుకు చేశాడు? సర్పయాగంయొక్క బీజాలు కొన్నివేల యేండ్లకు పూర్వం పడ్డవి. సర్పయాగం కల్యాదిలో జరిగింది. సముద్రమథనం త్రేతాదిలో జరిగింది. సముద్రమథనమైన తరువాత ఉచ్చైశ్శ్రవము ఆ తీరాన మేస్తోంటే కద్రూవినతలు చూచి పన్నిదం చరిచారు. ఆ సందర్భంలో కద్రువ తన కొడుకులు జనమేజయ సర్పయాగంలో చచ్చేటట్టు శాపమిచ్చింది. ఈశాపం తరువాత కొన్ని లక్షల యేండ్లకు యాగం జరిగింది. కర్మసూత్రం రకరకంగా సాగుతోంది. ఇందులో ఉదంకుడి కథ అనుస్యూతమైంది. రురుప్రమద్వరల కథ కలిసిపోయింది. ఆస్తీకుడు

వచ్చాడు. పరిక్షితుడు చచ్చిపోయిన పామును ఋషిమెడలో వేశాడు. ఇట్లా బహుకథోపనదులను సంగ్రహించుకొని యీ కర్మకథా ప్రవాహం భారతసముద్రాభిగామిని అయింది ప్రారబ్ధకర్మను మనం గుర్తుపట్టలేము. దారిలో ఆగామి సంచితాలు వస్తవి. ఇవన్నీ కలిసి యేం పరిణామం పొందుతవో తెలియదు. మొత్తానికి యీసృష్టి అంతా చుట్టిన చాపవంటిది. పఱచినకొద్దీ పోయి చివర కనపడాలిసిందే తప్ప అంతవఱకూ కనపడదు. అయితే ఆ చివర పఱచినప్పుడు మాత్రమే లేదు చుట్టినప్పుడూ ఉంది. ఆదిమధ్యాంతముల సమష్టి సంక్షిప్తి యీ సృష్టి అనడం యీ సృష్టి రహస్యాన్ని తమ కావ్యాల్లో వ్యంగ్యభూతంగా ఉంచటం యీకర్మభూమిలో ఉన్న మహాకవులకు తెలిసినదీ చేసినదీ అయిన విషయం. ఆనుశాసనికపర్వంలో మొదట గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు సంవాదమని ఒక ఉపాఖ్యానం ఉంది. అది ఆనుశాసనికంలో మొదటిది. భారతంలో అనుశాసనిక శాంతిపర్వాలు రెండూ ధర్మాల కాయువుపట్టులు. శాంతి ఆధ్యాత్మికవిద్య నెంత చెబుతుందో, ఆనుశాసనికం ఆధిభౌతికాన్ని అంత చెబుతుంది. ఈగౌతమ్యాదిసంవాదంలో గౌతమికొడుకు పాముకఱచి చస్తాడు. కిరాతుడు ఆ పామును కట్టి తెచ్చి చంపుతా నంటాడు. గౌతమి వద్దంటుంది. పాము, నాదేం తప్పంది, మృత్యువు కఱవ మన్నాడు, కఱిచా నంటుంది. మృత్యువు వచ్చి నేను కాలుడి ఆజ్ఞచేశానూ, నాదేం తప్పూ అటుంది. కాలుడు వచ్చి యీ కుఱ్ఱవాడు పాముకఱచి చనిపోయే దుష్కర్మ చేశాడు; ఇట్లా చచ్చాడు' అంటాడు. "తన యెఱుకయు దేవాలాపములు నొక్కటెఱిగె యున్నకా" గౌతమి యిట్లా అంటుంది. వాడు అల్లాంటి కర్మ చేసి పాముచేత కఱవబడ్డాడు, నే నిటువంటి కొడుకును కనే కర్మచేసి యిట్లా కొడుకును కోల్పోయా నంటుంది. ఇది భారతంయొక్క పరమార్థం. దీన్నే వ్యాసుడు తన కావ్యాదియందు సర్పయాగకథద్వారా ధ్వనితం చేశాడు. ఆయన పడ్డకృత్యాద్యవస్థ యిది. కొందఱాధునికులు పాండవులది న్యాయమా, కౌరవులదా అనీ, అర్జును డెక్కువ వీరుడా, కర్ణుడా అనీ, యిందులో బ్రాహ్మణబ్రాహ్మణేతరకక్షలు ఉన్నవనీ బహువిధాలుగా ఆలోచిస్తున్నారు. ఈ ఆలోచన యీ కాలాన్నిబట్టి తగినదే కాని వ్యాసుడి కీగోల తెలియదు. తెలుసు నని కూడా ఆలోచిస్తే ఆలోచించవచ్చు. వ్యాసుడు జరిగిన కథలో ఆధ్యాత్మికాధి భౌతికవిషయాలు కొన్నిచోట్ల కథారూపంగానూ కొన్నిచోట్ల వ్యంగ్యభూతంగా పరమార్థదృష్టితోనే వ్రాశాడు. దీనికి భారతంలో ఉన్న బహుకథలూ, తద్గ్రంథానికి తిలకాయమానంగా వుండి, యిట్లాంటి ఉద్దేశం వ్యాసుడికి లేకపోతే తన్ముఖమునందు నిక్షేపించడం వ్యర్థమూ గుణరహితమూ అయ్యే సర్పయాగ కథ, వ్రాయడు.

కావ్యకళ కల్యాదినుండియే మిక్కిలి విజృంభించిం దని చెప్పాలి. తత్పూర్వం వేదానికీ ఋక్కులకే ప్రాశస్త్యం. సృష్టిలో అదేమిచిత్రమో ఆదియందు సంపూర్ణత్వం, పోనుపోను ఛిద్రత్వం కనబడుతోంది. అన్నిజాతులలోనూ మహాకవులు తజ్జాతి సారస్వతోదయప్రథమకాలాల్లోనే పుట్టారు. అట్లాగే కాళిదాసున్నూ. ఆయన శాకుంతలంలో తీర్చిన తీర్పు అద్వితీయంగా ప్రకాశిస్తోంది. ఆయన తీసుకొన్నది ఒక రాజు కథ మాత్రమే. చేసిన సృష్టి శంభుతనువు. దానిలో యజమాని, హోత, సూర్యచంద్రులు, పంచభూతాలూ యిమిడిపోయినవి. ప్రస్తావన నాటకానికి ముఖం కాబట్టి మనాక్కావ్యార్థసూచనం దానిలో ఉండాలి కాబట్టి ప్రస్తావన యెవళ్లైనా కొంచెం కవులైతే బాగా వ్రాయవచ్చు. కాని కథారంభం చేయడం మాత్రం కాళిదాసభవభూతులకు మాత్రమే తెలుసు. కాళిదాసు వ్రాయబోయేది శృంగారరసవిషయం. తక్కినరసములకూ శృంగారానికీ చాలా భేదం ఉంది. రౌద్రాదిరసాల్లో ఉదాత్తత్వం కొంచెం తగ్గినా తగ్గినట్లు కన్పించదు. శృంగారరసం యేమాత్రం పొల్లువచ్చినా అనుదాత్తత వచ్చి గ్రామ్యమైపోతుంది. రచనలోనే కాదు, అభినయంలో కూడాను. చాలామంది నటులు ఉదాత్తతాగ్రామ్యతల మధ్య కల పొలిమేర గుర్తెఱుగక రసాభాసం చేస్తారు. ఇట్టి శృంగారరసాన్ని కాళిదాసు పట్టుకొని కావ్యం యెల్లా ఆరంభించాలో తెలియక చాలా గగ్గోలు పడ్డాడు. ఎకాయెకి శకుంతలను ప్రవేశపెడితే దుష్యంతుడిచేత ఎల్లా మాట్లాడించాలో తెలియదు. దుష్యంతుడే ప్రవేశించినా ఎల్లా చెయ్యడమో కష్టం. ఈ కష్టాన్ని తప్పించుకునేందుకు ఆయన ఒక యెత్తు యెత్తాడు. దుష్యంతుడు లేడిని తరుముతున్నట్లు.

రంగముమీద రథ మెట్లా పరుగెత్తుతుందీ? లేడి యెట్లా పరుగెత్తుతుందీ? వాడు పూర్వుడు గనుక సరిపోయింది. ఆధునిక రంగానికి యిటువంటి పరిస్థితులు పనికిరావు. వాళ్ళ వుద్దేశం వేరు. లేడి పరుగెత్తటం, రథం పరుగెత్తటం కవి పాత్రలచేత వర్ణింపించి సామాజికుల భావనలో ఆ పరుగెత్తటం కనిపింపచేస్తాడు. దానికి ఆ కాలపు నటకులూ సామాజికులూ కావాలి. ఈ లేడిని యింతమాత్రం కోసమే ప్రవేశపెట్టాడా? పెడితే మాత్రం శిల్పం కాదు. శిల్ప మేంచేస్తుందంటే బహు విషయాలను స్ఫురింప చేస్తుంది. స్ఫురితాలూ, వ్యంగ్యాలూ, ధ్వనులూ అధికంగా ఉన్నకొద్దీ అధికమైన శిల్పం. అదే సౌందర్యం. అనగా భావనా సౌందర్యం. ఈ లేడి కాని రథాశ్వాలు కాని కాళిదాసు కావ్యవస్తువును ధ్వనిస్తున్నవి.

"గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యందనే బద్ధదృష్టిః, పశ్చార్ధేన ప్రవిష్టః శ్శరపతనభియా భూయసా పూర్వకాయం"; ఆ లేడి మాటిమాటికి వెను

కకు తిరిగి చూస్తోందిట. పశ్చార్ధభాగాన్ని పూర్వార్ధకాయంలో ప్రవేశపెడు తోందిట. కవి తన కావ్య కథను యిట్లాగే ధ్వనించాడు. తన కావ్య పశ్చార్ధ భాగము పూర్వార్ధభాగంలో ఉంది! తన కావ్యం మాటిమాటికీ వెనక్కి తిరిగి చూస్తూ లక్ష్యాన్ని వదిలిపెట్టకుండా పోతోంది. ఉదగ్రప్లుతాలతో ఆకాశం మీాద యెగిరిపోతోంది. ఈ ఉదగ్రప్లుతఘట్టాలు, స్తోకంగా ఉర్విని స్పృశించే ఘట్టాలు, శాకుంతల విమర్శ విషయాలు. కవికే తన కావ్యారంభంలో తా నెటు వంటి కష్టంలో ఉన్నాడో తెలుసు. అందుకనియే 'ఉత్ఖాతినీ భూమిరియం' అన్నాడు. నేల మిట్టపల్లాలుగా వుందిట. ఇది తన కథలోని యిక్కట్టు. శృంగారరసం ప్రారంభించటం కష్టమని ధ్వనించటం. తాను రథంమీాద పోయే వేగాన్ని చెపుతూ కూడా దీన్నే ధ్వనిస్తాడు.

'యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా త ద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధానమివ తత్"

ఏది సగంలో తెగిపోతుందో అది మళ్ళీ కలుసుకున్నట్లే వుంది. శకుంతల ఉంగరం పారవేసుకోడంమూలంగా కథ తెగిపోయింది. కాని ఉంగరం దొరికి రాజుకు మళ్ళీ స్మృతి రావడంతో కథ కలిసింది.

'ప్రకృత్యా యద్వక్రం తదపిసమరేఖం నయనయోః' స్వభావంగా యేది వంకరగా ఉందో అది మళ్ళీ చూస్తే చాపుగా ఉంది. దుష్యంతుడు శకుంతలను తిరస్కరించడం వక్రంగా కన్పించినా, దుర్వాసుని శాపంవల్ల, దుష్యంతుడి ధర్మబుద్ధివల్ల న్యాయంగానే తోచింది. శకుంతల వక్రమార్గం పడుతోం దని దుష్యంతుడికి కనిపించినా అంగుళీదర్శనంతో అది రాజుకు మళ్ళీ సరిగ్గానే కనిపించింది.

ఇల్లాగా కొన్నిచోట్ల సువ్యక్తంగా, కొన్నిచోట్ల వ్యక్తావ్యక్తంగా కాళిదాసు తనకథను పూర్వభాగమంతా ధ్వనిస్తూనే వచ్చాడు.

'తేన మృగ ఏష విప్రకృష్టాంతర స్సంవృత్తః' ఈవాక్యంకూడా దానినే ధ్వనిస్తోంది. ఈకష్టపు భూమి దాటింతరువాత తన కావ్యం యెల్లా నడుస్తుందో యిల్లా చెప్పాడు.

'ముక్తేషు రశ్మిషు నిరాయతపూర్వకాయాః
నిష్కంపచామరశిఖా నిభృతోర్ధ్వకర్ణాః'

తన కావ్యం క్లిష్టఘట్టం దాటితే అంత దర్జాగా పోతుందట. ఈవాక్యానికి ఆయన చతుర్థాంకంలో ఉన్న రచన, సప్తమాంకపు రచన చాలా నిదర్శనం.

ఇంక తరువాత ప్రతి చిన్నవాక్యమునందు వస్తుధ్వనులు నించి కావ్యాన్ని బిగించాడు. శకుంతలచీర పొదమీద పడ్డది. మళ్ళీ ఆవిడ తీసుకొంది. అప్పుడామె చెలికత్తె 'పరిముక్తాసి' అన్నది. వదిలిపెట్టబడ్డావు అని అర్థము. ఎవరిచేత? ఒక్క పొదచేతనే కాదు. కాశ్యపునిచేత కూడా. దుష్యంతుడు శకుంతలను 'అపి తపో వర్ధతే' అని అడుగుతాడు. తపస్సు సాగుతోందా అని. ఎవరి తపస్సు. ఎటువంటి తపస్సు? కణ్వునిదా? ఆశ్రమంలోదా? కన్యాత్వతపస్సా? దీని అర్థం బహుముఖంగా ఉంటుంది?

ఇల్లా కాళిదాసు కృత్యాద్యవస్థ పడ్డాడు. ధ్వనికి అవధి అయిన అతని రచనలో అవస్థ అవస్థకాదు. ఊరికే నామమాత్రం.

ఇట్లాగే భవభూతికూడా ఉత్తరరామచరిత్రలో చేశాడు. సంస్కృత నాటకాలంటే కృషిప్రసంక్లిప్తితో కూడిన రచనలు. ప్రవేశనిష్క్రమణాల దగ్గరనుంచీ అర్థవంతాలుగా ఉంటవి. ప్రత్యక్షరమూ ప్రయోజనకారిగా ఉంటుంది. ఉత్తర రామచరితలోని ఆద్యంతాంకాలు మంత్రశాస్త్రంవంటివి. వర్ణసమామ్నాయంలో ఆద్యక్షరమైన అకారమూ, అంత్యాక్షరమైన క్షకారమూ కలిసి అక్షమాల అయినట్లుగా భవభూతి ఆద్యంతాంకాలు రెండూ అల్లా చేశాడు. ఒకరు భవభూతి ప్రథమాంకనిర్దిష్టాలయిన బహువిషయాలను చివరి అంకాల్లో వాచ్యంగా చేశా డన్నారు. ఒక దృష్టికి అది వాచ్యంగా కనపడుతుంది. కాని లక్షణోదిత ధ్వనుల కతిశయించి శ్రీరామచంద్రుడి పరమ పురుషత్వం మహాధ్వనిగా కావ్యంలో కనిపిస్తుంది. మొట్ట మొదటనే

కిం త్వనుష్ఠాన నిత్యత్వం స్వాతంత్ర్య మపకర్షతి
సంకటా హ్యాహితాగ్నీనాం ప్రత్యవాయైర్గృహస్థతా

గృహప్రస్థితుడైన జనకుని మూలంగా సీత విషాదం పొందుతూంటే రాముడామె నిట్లా ఓదార్చాడు. అనుష్ఠాన నిత్యత్వము స్వాతంత్ర్యమును లాగి వేస్తుందిట. రాముడు రాజ్యానుష్ఠాన నిత్యత్వం కలవాడు. తనకు స్వాతంత్ర్యంలేదు. అందుకనియే సీతాదేవినికూడా వదలిపెట్ట వలసివచ్చింది. ఈధ్వని యిందులో లేకపోతే అదిశిల్ప మనిపించుకోదు. ఒకధర్మాన్ని చెప్పడం మాత్రమే అవుతుంది. భవభూతి ప్రథమాంక మంతా చిత్రపట దర్శనంచేస్తూ మాట్లాడిన మాటల్లో రాబోయే సీతావియోగాన్నే సూచిస్తాడు. ఇది పూర్వార్థంలో పశ్చార్థం ప్రవేశించి కావ్యాన్ని కర్మసూత్రంతో కట్టివెయ్యటం. కథలు భేదమే తప్ప ఆ మహానుభావుల దృష్టి అంతా ఒకటే. కాళిదాసు రఘువంశంలో దిలీపుణ్ణి రాజ్యాశ్రమముని అన్నాడు. అది భవభూతి రామచంద్రుడి కెంత తగిపోతుంది?

సంస్కృతనాటకాలు చదువుతోంటే కావ్యం యిల్లా మొందుకు మొదలు పెట్టాడు, ప్రతి అంకమూ ప్రవేశకంకూడా యిల్లా మొందుకు చేశాడు, ఈమాట యిల్లా మొందు కనిపించాడు, అన్న ప్రశ్నలకు సమాధానాలుగా బహుప్రయోజనాలు కనబడుతూంటవి.

ఇది ఒక మహాశిల్పలక్షణం. ఇది సంస్కృత నాటక సారస్వతంలో నిండి నిబిడీకృతమై వుంది. భాసుని ప్రతిమలో వల్కల వృత్తాంత మిట్లాంటిది. అది దీని కన్న తక్కువరకం. వేణీసంహార నాటక ప్రథమాంకం తక్కిన నాటకంతో మొక్కవ ప్రసక్తిలేని భీముని రౌద్రమంతా కృత్యాద్యవస్థా విషయం. ఆ అంకంలో భట్టనారాయణుడు చూపించిన నేర్పు తక్కిన అంకాల్లో లేదు. ఆ అంకం వ్రాసిన మొత్తుగడలో తక్కిన పుస్తకం సంబాళించుకోలేకపోయినా డనిపిస్తుంది.

తక్కిన చాలామంది కవులు యీ క్లిష్టమార్గాన్ని పట్టక పాత్రపోషణాదులు, అలంకారాదులు సంవిధాన కల్పనలతో తమ నాటకాలు రమ్యంగా చేసుకుంటూ వచ్చారు. ఈ మార్గం వ్యాస కాళిదాస భవభూతులది. తక్కినవారు చేతనైనంతమట్టుకు కొద్ది కొద్దిగా సవరించుకొన్నారు.

తెలుగులో పింగళిసూరన్న తన కథా కల్పనావైదుష్యంచేత కొంత కొంత యీ మార్గాన వెళ్ళాడు. కాని ఆయన ఉపశ్రుత్యాది శబ్దాలు నిక్షేపించి ఆ రెండవ రకపు చేతలోనే కొంత వాచ్యం చేశాడు.

తిక్కన్నగారు తాను భారతము వ్రాస్తూ ఉపాఖ్యానాల్లోనే కావ్యరచనా వైదుష్యం వెల్లడిస్తూవచ్చాడు. ఆయన మరుత్తునికథ ఒకటి అట్లాంటిది. భవిష్యత్కథా సూచన, ఆగామి కథాంశ స్ఫురణచేసే మాటలు ప్రయోగించడం ఆయన చాలాచోట్ల చేశాడు. పది పద్యాలు చాలిన ఉపాఖ్యానంలో కూడా తిక్కనలో యీ పద్ధతి కనపడుతూ ఉంటుంది.

ఇది భారతీయ శిల్పానికి ఉత్కృష్టస్వరూపం అనుకోవాలి. ఇలాంటి రచనలో సృష్టి రహస్యం గోచరమవుతూ ఉంటుంది గనుక. ఒక రకంగా చూస్తే యిది కావ్యగుణాపాదనమే అనిపించవచ్చు. కాని భవభూతి కాళిదాసాదుల తరగతులలో వారియందే కనబడుతున్నది. ఇట్టి రచన కొన్ని పాశ్చాత్య గ్రంథాల్లోనూ కనబడుతోంది. కాని వాళ్ళు ప్రధానంగా ప్రతిపాదించే విషయాలు రసప్రధానాలు కాకుండా భావప్రధానా లవడంచేతనూ, వారి పరమోద్దేశాలు సంఘగత క్లిష్టపరిస్థితుల విమర్శించుట కావడంచేతనూ వారికి భారతీయులకు వలె ధర్మప్రాధాన్యబుద్ధి లేకపోవటంచేతనూ, ఇట్టి పద్ధతిలో ఆకొద్దిమంది మహాకవుల రచనా కించి దూనంగా కనబడుతుంది. వట్టి కావ్యరచనా శిల్పం తీసుకొంటే అందు యీపద్ధతులు కొద్దిమంది మహానుభావులలో లేకపోలేదు.

# విశ్వపర్యటనం

కందర్ప వెంకటరామ శాస్త్రి

## ౧

మన తాతలు కాశీ కేగిన వాడు కాటికేగినవాడు ఒక్కటే అనేవారు. ఆకాలంలో అతివేగంగా వెళ్లే వాహనం గుఱ్ఱము ఒక్కటే! అదైనా సగటున గంటకు 20 మైళ్ళకంటె ఎక్కువ పరిగెత్తలేదు. ఈవేగంతో పరిగెత్తినా పరిమితకాలమే పరిగెత్తగలదు. కాని ఇప్పుడు రోజులుమారేయి. నేలమీద వెళ్ళడానికి రైలుబండ్లు మోటారుకార్లు, మొదలయినవి వచ్చేయి. తెరచాపసహాయము అక్కర లేకుండానే యంత్రసహాయముతో గంటకు 80 మైళ్ళకు పైగావెళ్లే ఓడలు సముద్రంలో తిరుగుతున్నాయి. గాలిలో ప్రయాణం సర్వసాధారణ మయిపోయింది. ఆధునిక నాగరికతకు త్వరితగతి పట్టుకొమ్మ! ఇప్పటివరకూ మోటారుకారుయొక్క ఉచ్చాంకం (Record) గంటకు 300 మైళ్లు. గాలివిమానం అపాయం లేకుండా గంటకు 120 మైళ్ళు మాత్రమే వెళ్ళకలదు. పూర్వకాలంకంటె ఇప్పుడు గమన వేగం 100 రెట్లు ఎక్కువయిపోయింది. ఆకాలంలో కాశీకివెళ్లిరావడానికి సంవత్సరంకంటె ఎక్కువకాలం పట్టేది. కాని ఈరోజులలో సుమారు 25000 మైళ్ళ చుట్టుకొలతకలిగిన భూమికిప్రదక్షిణం చేయడానికి ఆరురోజులు పడుతోంది. ఆధునిక గమనవేగం వలన భూమి చిన్నదైపోయింది. చూచిరావడానికి ఎన్నోవింతలు కనపడవు. కాబట్టి ఆకాశయాత్ర చేసి ఇతరగోళముల స్థితి తెలుసుకుందాం. వీలైతే తరువాత ఆక్రమణకు తగుప్రయత్నాలు చేయవచ్చును.

ఈయాత్రకు గాలివిమానాల వేగం పనికిరాదు. గంటకు 200 మైళ్ళవంతున వెళ్ళినప్పటికీ మన విమానం సూర్యునిచుట్టూ తిరిగి రావడానికి 1 సం॥ 6 మాసములు పడుతుంది. సూర్యకుటుంబస్థుడైన నెప్ట్యూన్‌కక్షను చుట్టిరావడానికి 3500 సంవత్సరాలు పడుతుంది. కాబట్టి విమానాలు విశ్వపర్యటనానికి పనికిరావు. అందువలన మన వాహనానికి ఎంతవేగం ఉండాలో ఆలోచించవలసి ఉంది. మనం అతివేగంగా వెడుతోందనే తుపాకీగుండు గమనవేగం, గంటకు 2400 మైళ్ళు; అనగా సెకనుకు $\frac{2}{3}$ మైలు. కాని భూమి, సూర్యునిచుట్టూ తిరగడానికి గంటకు 66 వేల మైళ్ళు వెడుతోంది. అనగా సెకనుకు $18\frac{1}{3}$ మైళ్ళు. అనేక అంగుళముల దళముగల ఇనపరేకును చొచ్చుకొని వెళ్ళగలిగిన గామాకిరణములు సెకనుకు 180,000 మైళ్ళు వెడతాయి. కాని వెలుగువేగం మాత్రం

సెకనుకు 186,000 మైళ్ళు. అనగా గంటకు 670,000,000 మైళ్లు. వెలుతురు కంటె ఎక్కువవేగంగా వెళ్లేది మన స్పేక్కటే! ఐన్‌స్టన్ మహాశయుడు భౌతికప్రపంచంలో వెలుతురుకంటె వేగంగా వెళ్లేది ఏదీ ఉండడానికి వీలులేదని సూత్రీకరించాడు. అందువల్ల భావనలో వెలుతురు వాహనంగా చేసుకొని, ఆకాశంలోని వింతలు విచిత్రాలు చూస్తూ ప్రయాణం చేద్దాం. ఉష్ణము శీతలము ఎంత ఉన్నా ఓర్చుకునేస్థితి సంపాదించే మనుకొందాం.

౨

మనం ప్రయాణం మొదలుపెట్టిన రెండు సెకనులలోపుగానే చంద్రుడిదగ్గరకు వెడతాం. ఈబింబము భూమికి 240,000 మైళ్ళ దూరంలో ఉంది. దీని వ్యాసం భూవ్యాసమునకు నాల్గవవంతు. చంద్రుడు భూమినుండి విడిపోయిన గోళమని ఒక సిద్ధాంతం ఉంది. ఏది ఎట్లున్నా భూలోకవాసులకుమాత్రం ఇతడు మహోపకారం చేస్తున్నాడు. శుభ్రమైన వెన్నెలతో మనకి భావోద్రేకం కలిగించడమే కాకుండా సముద్రంలో పాటుపోటులు కల్పించి వాణిజ్యానికి సహాయకారి అవుతున్నాడు. మానవజాతికి మొదట జ్యోతిశ్శాస్త్రంలో అభిరుచి కలగడానికి కారకుడు చంద్రుడే! ఇక్కడి ఎత్తైన కొండలు, విశాలమైన మైదానాలు భూలోకవాసుల నాకర్షిస్తాయి. కాని భూమికివలె చంద్రుడికి వాతావరణం లేకపోవుటచేత ఈగోళం వాసయోగ్యం కాదు. వాతావరణం లేకపోవడంచేతనే భూమినుండి చూడడానికి వీలులేనివి అనేకములు ఈగోళంనుండి చూడవచ్చును. సూర్యునిదగ్గరనుండి వచ్చే వెలుతురిని వెదజల్లడానికి గాలి లేకపోవడంచేత ఇక్కడినుంచి నీలమైన ఆకాశంలో సూర్యుడు, నక్షత్రాలు ఒకేసారి కనపడతాయి. భూమినుండి చూచే నక్షత్రాలకంటే ఎన్నోరెట్లు ఎక్కువ నక్షత్రాలని చంద్రుడిలోనుంచి చూడవచ్చు. మనకుండే అప్పటి అదృష్టాన్ని చూచి భూలోకశాస్త్రజ్ఞుడు అసూయపడతాడు. మన భూలోకానికి ఎంత ఉపకారం చేసినవాడైనా విశ్వమంతా తిరిగివద్దామని బయలుదేరిన మనం ఇక్కడ అట్టేసేపు ఉండడానికి వీలులేదు. సూర్యుడికి దగ్గరగా ఉన్న బుధుడిదగ్గరకు వెడదాం. ఈగ్రహం చంద్రుడికంటె కొంచెం పెద్దది. వ్యాసం సుమారు 3300 మైళ్ళు ఉంటుంది. ఎప్పుడూ ఒక భాగమే సూర్యుడివైపు పెట్టి తిరుగుతుంది. ఇక్కడకూడా కొండ లున్నాయి. కాని వేడి ఎక్కువ. ఇంతకంటె కొంచెం చల్లగా ఉండే శుక్రుడిదగ్గరికి వెడదాం.

బుధుడికంటె సూర్యుడికి ఈగ్రహం దూరంలోఉంది. భూమికంటె దగ్గరగా ఉంది. ఇది ఎప్పుడూ దట్టమైన మేఘాలతో నిండియుండడంచేత దీని ఉపరిభాగము యొక్క తత్త్వంపూర్తిగా తెలియటంలేదు. కాబట్టి వాసయోగ్యంకాదు. వాసయోగ్యమై భూ పుత్రుడనే పేరుపొందిన కుజుడిదగ్గరికి వెడదాం.

భూమికీ ఈగ్రహానికీ కొన్ని పోలికలుండడంచేత దీనికి కుజుడనే పేరు చాలా మట్టుకు సరిపోతుంది. ఇచ్చటి దినప్రమాణం భూమిమీది దినప్రమాణంకంటె కొంచెం ఎక్కువ (24 గంటల 37 నిముషములు). ఇక్కడి ప్రజలకు (ఉంటేగింటే) సంవత్సర ప్రమాణం 780 రోజులు. సూర్యుడికి ఈగ్రహం భూమికంటె ఎక్కువ దూరంలో ఉంది. దీనిచుట్టూ రెండు ఉపగ్రహాలు తిరుగుతూ ఉంటాయి. మన భూమికి ఒక్కటే ఉపగ్రహం (చంద్రుడు). ఈకుజుడినుండి భూమి మనకి కొన్ని రోజులు వేగుచుక్కలాగ, కొన్నిరోజులు సూర్యుడు అస్తమించినతరువాత, కంటికి కనపడుతుంది. సూర్యబింబం, భూమిమీదనుండి కనబడినదానిలో మూడవ వంతు బింబంగా కనపడుతుంది. దీని ఉపరిభాగం చంద్రుని ఉపరిభాగంలాగ కాకుండా కొంత చదునుగా ఉంటుంది. ఇక్కడికి వచ్చాం కనక భూమిమీద నుంచి కుజుడిలో కనపడే గురుతులు శాస్త్రజ్ఞులు చెప్పినట్లు కాలవలో కాదో చూచి తెలిసికో వచ్చును.

ఈగ్రహం భూమికంటె చాలచిన్నది. చుట్టూ వాతావరణం అంతదట్టంగా ఉండదు. వేడికూడా అంతగా ఉండదు. అందువలన ఇతరగ్రహాలకంటె చాలా మెరుగైనప్పటికీ ఈగ్రహంకూడా అంత వాసయోగ్యం కాదు. సూర్యకుటుంబములో చూడవలసినవి ఇంక 4 గ్రహాలున్నాయి. కాని ఈగ్రహాలు ఇంకా ఘనీభవించలేదనీ ద్రవరూపంగాను వాయురూపంగాను ఉన్నాయనీ జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అంటారు. అందువలన ఆలాంటి ఉపరిభాగాలకు తగిన కవచాలు వేసుకొని వెళ్ళాలి.

గురుడు అన్ని గ్రహాలలోను పెద్దది. దీనివ్యాసం భూవ్యాసానికి సుమారు పదకొండురెట్లు ఉంటుంది. బరువుకూడా భూమికంటే 317 రెట్లు ఎక్కువ ఉంది. అందుచేతనే దీనికీపేరు వచ్చిందేమో! ఇక్కడినుంచి సూర్యుడు నక్షత్రంకంటె కొంచెం పెద్దదిగా కనపడతాడు. ఇక్కడ మనకుండే వెలుతురులో పాతికోవంతు వెలుతురుంటుంది. ఇక్కడ చుట్టూ దట్టమైన వాతావరణం ఉండడంచేత వెలుతురు ఇక్కటికి చాల తక్కువ వస్తుంది. ఇక్కడ దినప్రమాణం సుమారు 10 గంటలు. కాని ఈగ్రహం సూర్యునిచుట్టూ తిరిగిరావడానికి సుమారు 12 సం

వత్సరములు పట్టుతుంది. దీనికి 9 ఉపగ్రహా లున్నాయి. అందులో 5 మాత్రమే ముఖ్యమైనవి. ఈఉపగ్రహాలలో ఒకదానిదగ్గరకు వెళ్లిచూచినట్లయితే గురుడు ఆకాశంలో మనచంద్రుడికంటె 100 రెట్లు పెద్దదిగా కనపడతాడు! మన జీవితాలకి కష్టాలు తెచ్చిపెడతా డని మన మనుకునే శని సూర్యకుటుంబములో అందమయిన గ్రహం. ఇతడు సూర్యుడికి భూమికంటె తొమ్మిదిన్నర రెట్లు ఎక్కువ దూరంలో ఉన్నాడు. ఇతనిచుట్టూ తొమ్మిది ఉపగ్రహాలు తిరుగుతూ ఉండగా, అందమయిన కుండలం (Ring) లో శని ఆకాశ దృశ్యా లన్నిటిలోనూ ముఖ్యమై పోయేడు. శని మధ్యరేఖలోనుంచి చూస్తే ఈకుండలం ఆకాశాన్ని సరిగ్గా రెండు భాగాలుచేసే జ్యోతిర్గంగలాగ కనపడుతుంది. సూర్యుడు ఇచ్చటినుండి ఒక పెద్ద నక్షత్రంలాగ కనపడతాడు. భూమికిచ్చే వెలుతురులో నూరవవంతు వెలుతురిస్తాడు. యురేనస్ నెప్ట్యూన్ అనే గ్రహాలుకూడా సూర్యకుటుంబమునకు చెందినవే! వీటికి క్రమంగా 400 వ వంతు 900 వ వంతు వెలుతురు మాత్రమే వస్తుంది. యురేనస్ సూర్యుడికి భూమికంటె 19 రెట్లు ఎక్కువ దూరంలో ఉంది. నెప్ట్యూన్ 30 రెట్లు ఎక్కువదూరంలో ఉంది. ఇక్కడి వెలుతురు భూమిమీద వెలుతురుకన్న చాలా తక్కువైనప్పటికీ భూమికి చంద్రుడిచ్చే వెలుతురుకన్న 520 రెట్లు ఎక్కువ ఉంటుంది. చదువుకొనేందుకు చాలా వీలుగానే ఉంటుంది. ఇంక మన గ్రహకుటుంబమునకు తండ్రియైన సూర్యుని కూడా దర్శించి తర్వాత ఆకాశయాత్ర సాగిద్దాం.

**సూర్యుడు** స్వప్రకాశకుడైన మధ్యరకపు నక్షత్రం. ఆకర్షణశక్తివలన గ్రహాలన్నీ వీనిచుట్టూ తిరుగుతున్నాయి. దీనివ్యాసం 864,100 మైళ్ళు; అంటే భూవ్యాసానికి 109 రెట్లుంది. భూమివ్యాసం ఒక అంగుళం ఉంటే సూర్యునివ్యాసం 109 అంగుళము లుండాలన్నమాట. ఉపరిభాగం అంతా హనుమంతుడు తగలపెట్టిన లంకలాగ ఎప్పుడూ మండుతుంది. మంటలు 400 మైళ్ళు లేస్తూంటాయి. వెలుతురు వేగంతో వెడుతున్నాం కనుక ఆట్టే ఆలస్యం అవకుండా సూర్యకుటుంబాన్ని దాటేశాం. భూమినుంచి సూర్యునిదగ్గరకు వెళ్ళడానికి సుమారు 8 ని॥ 13 సెకనులు పట్టింది. సూర్యకుటుంబంలో గ్రహాలన్నిటికన్నా చాలా దూరములో ఉన్న నెప్ట్యూను దగ్గరకు వెళ్ళడానికి సుమారు 4 గంటలు పడుతుంది. మొత్తంమీద సూర్యకుటుంబాన్ని దాటడానికి 8 గంటల 20 నిముషములకంటె ఎక్కువ పట్టలేదు. ఆట్టే ఆలస్యం అవలేదు కనుక ఆకాశంలోని మరికొన్ని వింతలు చూద్దాం.

## 3

మన సూర్యకుటుంబం ఆకాశమనే మహాసముద్రంలో ఉన్న చిన్న ద్వీపమని చెప్పవచ్చును. దీనిచుట్టుపట్ల ఇంకేమీ నక్షత్రాలు లేవు. ఎన్ని వందలకోట్ల మయిళ్ళు వెళ్లినా, అక్కడక్కడ ఉల్కలు మొదలయినవి కనబడడమేకాని, ఒక్క నక్షత్రం దగ్గరకైనా వెళ్ళలేము. దూరంగామాత్రం అనేకనక్షత్రాలు కనబడతాయి. మన జ్యోతిర్వాహనం గ్రహలోకయాత్రకు బాగా పనికివచ్చినా విశ్వపర్యటనానికి రోకలిబండే! కాని ఇంతకంటె వేగంగా వెళ్లేది ఇంకేదీ లేదు.

విసుగుచెందకుండా సుమారు 4½ సంవత్సరాలకాలం (సెకనుకు 186,000 మయిళ్ళ వేగంతో) వెడితే మన పొరుగున ఉన్న ఆల్ఫాసెంటారిస్ అనే నక్షత్రం దగ్గరకు వెడతాం. ఇక్కడనుంచి చూస్తే మన సూర్యుడు ఆకాశంలో దక్షిణ పాలవెల్లిలో (Southern Milkyway) ఒక ప్రకాశవంతమయిన బొట్టులాగ కనపడతాడు. మౌంట్‌విల్సన్ నక్షత్రపరిశోధనశాలలోని 100 అంగుళముల దూరదర్శనీయంత్రం మనం పట్టుకెళ్లినా మనభూమీ ఇతర గ్రహాలూ ఇక్కడనుంచి కనబడవు. భూమినుంచి బయల్దేరిన 8 సంవత్సరాలలో ప్రకాశవంతమయిన వ్యాధుడనే (Sirius - గొల్లవాడు) నక్షత్రం దగ్గరకు వెడతాం. భూమి దగ్గరనుండి ఇది ఒక్క నక్షత్రంలాగ కనబడినప్పటికీ, నిజంగా ఇక్కడ రెండు నక్షత్రాలున్నాయి. 11 సంవత్సరాలలో రాజహంస (61 Cygni) దగ్గరికీ 13 సంవత్సరాలలో కార్డోబా అనే నక్షత్రం దగ్గరికీ వెడతాం. ఈవిధంగా బయలుదేరిన 13 సంవత్సరాలలో 18 నక్షత్రాలకంటె ఎక్కువ చూడలేము. అంటే మన భూమికి సుమారు 13 జ్యోతిర్వర్షములు * అర్ధవ్యాసంగల గోళంలో 18 నక్షత్రాలు మాత్రం ఉన్నాయన్నమాట! కాని మన కంటికి కనపడే నక్షత్రాలే ఆరువేలకుపైగా ఉన్నాయి. 2½ అంగుళముల టెలెస్కోపుతో ఆర్గ్‌లేండర్ 324,000 నక్షత్రాలు లెక్కపెట్టేడు. 100 అంగుళముల టెలెస్కోపుతో చూస్తే ఎన్నివేలకోట్లు ఉంటాయో చెప్పలేము. అందువలన చిల్లర నక్షత్రాలను లెక్కచేయకుండా పెద్దవాటిదగ్గిరికే ప్రయాణం సాగిద్దాం.

34 సం॥ లు ప్రయాణం చేస్తే స్వాతి నక్షత్రాన్ని చేరుతాం. 46½ సం॥ లు దీక్షతో వెలుతురు వేగంతో పరుగెత్తితే ధృవుణ్ణి దర్శిస్తాము. ఈ నక్షత్రం కేసే భూమి యిరుసు తిరిగిఉంది. భూమిదగ్గరనుండి ఈ నక్షత్రంయొక్క దూరం సుమారు 279 లక్షల కోట్లు మయిళ్ళు. మన పాలవెల్లికి చిట్టచివర నున్న ఆర్ద్రా

* జ్యోతిర్వర్ష మంటే 5,865,696000,000 మైళ్ళు.

నక్షత్రం దగ్గరకు వెడానికి 2000 సం॥ లు పడుతుంది. ఈ నక్షత్రం యొక్క వ్యాసం సూర్యుని వ్యాసానికి 300 రెట్లు. ఈ విధంగా నక్షత్రమండలాన్ని ఒక వైపునుండి ఇంకొక వైపునకు దాటడానికి 4000 సంవత్సరాలకు పైగా పడుతుంది. ఈ లోపుగా సూర్య కుటుంబాలలాంటివి ఎన్నైనా చూడవచ్చును.

౪

ముఖ్యమయిన సంగతి మరిచి పోయాం. మనుష్యుని జీవితకాలం సాధారణంగా 70 సంవత్సరాలకు మించదు. ఈ సందర్భంలో 4000 సంవత్సరాల ప్రయాణం చేయడం ఎలా తటస్థిస్తుందని అడగవచ్చును. కాని ఆ ప్రశ్నకు జవాబు చెప్పక పూర్వమే నే నొక ప్రశ్న వేస్తా. భూమిమీద సెకనుకు ⅔ మయిలు వేగం కంటె ఎక్కువ మనము సృజించలేముకదా, సెకనుకు 186,000 మయిళ్ళు ఎల్లా వెడతాము? అట్టి ప్రయాణం చేయగలిగితేమాత్రం మనకు జరామరణభయం ఉండదు. ఈ విషయమే అయిన్‌స్టైన్ రెలెటివిటీ సిద్ధాంతంలో విపులంగా చెప్పేడు- మనకు వేగం ఎక్కువయ్యేకొద్ది కాలం తక్కువవుతుంది.*

అంటే వెలుతురు వేగంతో వెళ్లేవానియొక్క కాలచక్రం తిరగదని దీని భావం. అప్పుడు మనకు ఎదుగూ బొదుగూ కూడా ఉండదు. ఎంతవయస్సులో ప్రయాణం మొదలు పెట్టేమో అంతవయస్సులోనే తిరిగి రావచ్చును. ఆకలీ దప్పీకాకూడా ఉండవు. కావున ఈ విశ్వపర్యటనంలో జీవితపరిమితిని గూర్చి ఆలోచించనక్కర లేదు.

౫

నక్షత్రమండలాన్ని దాటినతరువాత ఇతర నక్షత్రరాష్ట్రాల లోనికి వస్తాం. ఈరాష్ట్రంలోని దగ్గర రాసి ఓమేగా సెంటారి (W. Centawri). భూమి దగ్గరనుండి ఇది చాలా ప్రకాశవంతంగా కనపడుతుంది. కాని ఈరాష్ట్రానికి వెళ్ళడానికి 21,000 సంవత్సరాలు పడుతుంది. ఉత్తరగోళంలోని ప్రకాశవంతమయిన నక్షత్రరాసి ( Messier 13 ) దగ్గరకు వెళ్లడానికి 32,750 సంవత్సరాలకు పైగా పడుతుంది. ఇప్పటివరకు శాస్త్రజ్ఞులు చూచినవాటిలో అతిదూరంగా ఉన్న నక్షత్రరాసి ( N. G. C. 7006 ) దగ్గరకు వెళ్ళడానికి 230,000 సంవత్సరాలు

* "As a consequence of its motion the clock goes more slowly than when at rest" (Einstein)

పడుతుంది. ఈనక్షత్రరాసులలోకూడా రెండు తెగ లున్నాయి. కొన్నిరాసులలో ఒక వెయ్యినక్షత్రములకు లోపుగా ఉంటాయి. కొన్నిటిలో అనేకవేల నక్షత్రాలు ఉంటాయి. మొత్తంమీద ఇటువంటి నక్షత్రరాసులు సుమారు 200 ల వరకూ ఇప్పటికి లెక్కపెట్టి, ఛాయాపటాలు తీశారు. అవన్నీ 10,000 నుండి 300,000 జ్యోతిర్వర్షములమధ్య ఉన్నాయి. అనగా, నక్షత్రరాసుల మండలమును దాటడానికి 800,000 సంవత్సరాలు పడుతుంది. ఈలోపుగానే నాళికామండలము (Nebula) లోనికి వస్తాం. నాళిక లంటే నక్షత్ర కర్మాగారాలు అని చెప్పవచ్చును. వీటిలో అనేక కోట్ల నక్షత్రా లుంటాయి. ఇంకా అనేక కోట్ల నక్షత్రాలు జన్మించడానికి సరిపడే పదార్థం ఉంటుంది. ఒక్కొక్క నక్షత్రాన్ని అనుసరించి అనేక గ్రహాలూ ఉపగ్రహాలూ ఉండవచ్చును. కాని వీటి నన్నిటినీ పరీక్షించకుండా నాళికనుండి నాళికకు గంతులు వేతాం. మనకు అతి సామీప్యమున ఉండే నాళికకు వెళ్ళడానికి 45,000 సంవత్సరాలు పడుతుంది. ఉత్తరాభాద్రలో ఉండే నాళిక దగ్గరకు వెళ్ళడానికి 870 వేల సం॥లు పడుతుంది. ఇది ఆకాశంలో ఉండే నాళిక లన్నిటిలోనూ పెద్దది. దీనివ్యాసం భూమికీ సూర్యునికీ ఉన్న దూరాన్ని 386,500 రెట్లు. మన వెలుతురు శకటంతో ఒక వైపునుండి ఇంకొకవైపునకు పోవడానికి సుమారు 6 సం॥లు పడుతుంది.

మనకు దూరంగాఉండే నాళికలలో కొన్ని సర్పిలాకారంగా (Spiral) ఉంటాయి. వీటిలో అన్నిటికంటె దగ్గరగాఉన్న నాళికకు వెళ్ళడానికి 80,000 సంవత్సరాలు పడుతుంది. కన్యరాసిలోఉన్న నాళికాసమూహం దగ్గిరికి వెళ్ళడానికి ఒక కోటి సంవత్సరాలు పడుతుంది. ఈ నాళికలలోనుండి మనసూర్యుడు ఎంత పెద్ద యంత్రముతో చూచినా కనబడడు. 100 అంగుళముల టెలెస్కోపుతో చూచినట్లయితే మన సూర్యుడున్న నెబ్యులా ఒక చిన్నపాము చుట్టలాగ కనబడుతుంది. మనము యంత్ర సహాయమున 14 కోట్ల జ్యోతిర్వర్షాల దూరం చూడగలము. ఆపైన ఏముందో ప్రయాణంచేస్తే తెలుస్తుంది. ఇప్పటివరకూ 20,000 నాళికల ఛాయాపటములు జోతిశ్శాస్త్రజ్ఞులు తీశారు. యంత్రసహాయమున 2,000,000 నెబ్యులాలు కనపడతాయి. ఇంటిదగ్గరనుండి బయలుదేరి కోటిసంవత్సరాలు అయినా, వెళ్లేది సెకనుకు 86,000 మయిళ్ళయినా, విశ్వాన్ని చుట్టబెట్టలేక పోయాం. జితోస్మి అని వెనక్కి మళ్ళుదాం– దారి తెన్ను కనబడటంలేదు. ఎక్కడచూచినా నక్షత్రములు నాళికలు కనపడుతున్నాయి. కాని మన సూర్యుడు కనపడడంలేదు. పోనీ సూర్యుడున్న పాలవెల్లి కూడా ఏదో తెలియటంలేదు. ఇట్టి మహాసముద్రంలో మనకు ఏదిగతి! భయపడవద్దు. ఆకాశము (Space) ఐన్‌స్టన్, డిసిట్టర్ చెప్పినట్లే ఉంటే, ఒక్కదిక్కుగా వెడితే తిరిగి మనం బయలుదేరినచోటుకు వస్తాం.

౬

భూ ప్రదేశము త్రిధావిస్తృత (3 Dimensions) ఆకాశంలో ఇమిడిఉంది. దాని ఉపరిభాగము పరిమిత మయినప్పటికిన్ని అంతములేనిదై ఉంది. అట్లే త్రిధా విస్తృతాకాశభాగంకూడా, చతుర్ధావిస్తృత బృహర్గోళములో ఇమిడియున్నదని అయిన్‌స్టయిను సిద్ధాంతము.

భూతలముమీద ఒక దిక్కుగా బయలుదేరితే, తిరిగి అదే ప్రదేశానికి రెండవ దిక్కుగుండా రావడానికి కారణం భూమి ఉపరిభాగము వంగి ఉండడమే (Curved Surface). అట్లే అవకాశం వంపు తిరిగి కలుసుకొందని వీరి వాదం. అనగా ఆకాశం పరిమితపరిమాణం కలిగియున్నది. ఈవిషయం ఊహించడం కష్టమే! ఏది ఎట్లున్నా వీరి వాదం నిజమైతే తిన్నగా వెళ్ళగావెళ్ళగా సుమారు 10 వేలకోట్ల సంవత్సరాలలో ఇంటికి చేరుకుంటాం. మనకు కాలం గతించినట్లు కనపడకపోయినా అప్పటికి మనభూమీ, ఇతరగ్రహాలూ, ఏమవుతాయో చెప్పలేము. సూర్యుడేనా ఉంటాడని నమ్మకంలేదు.

బ్రహ్మాండంయొక్క విస్తీర్ణము 10 వేలకోట్ల జ్యోతిర్వర్షములు. అంటే బాగా బోధపడదు- ఈవిషయాన్నిగూర్చి సర్ జేమ్సు జీన్స్ (Sir James Jeans) అను గొప్ప శాస్త్రజ్ఞుడు ఈవిధంగా చెప్పేడు.

బ్రహ్మాండమును భూగోళమంత చిన్నదిగా నిరూపిస్తే అందులో ఆండ్రోమెడా (Andrormeda) ఒక చిన్నద్వీపము కంటె పెద్దదిగా ఉండదు.సూర్య కుటుంబం అంతా ఒక ఇసుకరేణువంత వుంటుంది. అందులో మన భూమిని అంగుళములో కోటవ వంతు వ్యాసంగలదానినిగా నిరూపించాలి - ఇసుకరేణువులో అణువు కంటె చిన్నదిగా వుంటుంది. మనుష్యుడు నివసించడానికి చోటేదీ!

అనేకకోటికోట్ల సంవత్సరాల నక్షత్రజీవితంలో మనుష్యుని 70 సంవత్సరముల జీవితం ఒక లిప్తకంటె తక్కువే! అయినప్పటికీ ఇంత స్వల్పకాలంలో ప్రపంచతంత్రములు ఇన్ని కనిపెట్టగల మానవునిబుద్ధి మహిమ ఎట్టిదోకదా!!!

*

1

# గ్రంథవిమర్శనము

లలితకథావళి. (వెల రు 0-8-0) 36|11

(గ్రంథకర్త రాయసం వెంకటశివుడుగారు, ఎం. ఏ., ఎల్. టి., గుంటూరు.)

ఈ గ్రంథకర్త శ్రీరాయసం వెంకటశివుడుగారు సుప్రసిద్ధులు. గుంటూరు క్రైస్తవకళాశాలలో చాలా కాలము ఇంగ్లీషు ప్రొఫెసరుగానూ పిమ్మట నెల్లూరు కాలేజీలో ప్రిన్సిపాలుగానూ పనిచేసి ఇప్పుడు వృద్ధాప్యంలో విశ్రాంతితీసుకుంటున్నారు. కాబట్టి వీరి ఇంగ్లీషు భాషాజ్ఞానము ప్రత్యేకించి వివరించనక్కరలేదు. వీరు చిన్నతనమునుంచీ తెలుగుభాషపైని అభిమానముంచి ఎన్నో కథలూ, వ్యాసాలూ, నవలలూ, మొదలైనవి వ్రాసినారు. కొంతకాలము జనానా పత్రికకు సంపాదకులుగా ఉండేవారు. అట్టి శ్రీ వెంకటశివుడుగారినిగూర్చి తెలుగుపాఠకులకు ఇక్కడ విశేషించి చెప్ప నవసరం లేదు.

ఈకాలపు తెలుగు జీవితము ప్రధానంగా ప్రతిబింబిస్తున్న పదకొండు కథలు ఇందులో ఉన్నవి. ఈ సంపుటానికి నామకరణము మిక్కిలి సరసముగానూ సమంజసముగానూ ఉన్నది. "లలితకథావళి!" ఈ కథలలో ప్రధానగుణము ఏమో ఆలోచిస్తే అది లాలిత్యమే తప్ప ఇంకొకటి కాదని స్పష్టమవుతుంది. ఏకథ చూచినా తీవ్రముగా శోకముగాని భయముగాని అద్భుతముగాని ఆనందముగాని కలిగించి చదువరులను బాధపెట్టదు. కాని కథలన్నింటిలోనూ నవరసములూ కలిగించే పట్లు ఉన్నవి. కాని ఏరసమూ ఎక్కడా తీక్ష్ణముగా కలగదు. పాశ్చాత్య సంపర్కమువల్ల మనసంఘములో ఎన్నిసమస్యలో తలయెత్తి సంసారాలలో ఎన్నో కల్లోలాలు కలిగిస్తున్నవి. ఈ సమస్య లన్నీ చాలావరకు ఈకథలలో కనిపిస్తవి. కాని ఆసమస్యలు లోకంలో కలిగిస్తున్న కల్లోలంవంటి కల్లోలం ఈ కథలలో కలిగించవు. కథలు భావోద్రేకము కలిగించికాని, ఆలోచనలు ప్రేరేపికాని పాఠకులను వృథాగా బాధపెట్టవు ఎన్నిచిక్కులు వచ్చినా తేలికగా దాటిపోతవి. ఏమి సంఘర్షణలు వచ్చినా చల్లగా జారిపోతవి.

ఈ కథలు ముఖ్యముగా చదువరుల వినోదార్థమే అల్లినట్లు అవతారికలో గ్రంథకర్త వ్రాసినారు కథలన్నిటిలోనూ ఈ సంగతే వ్యక్తమవుతూ ఉంటుంది. మహాకవుల కవిత్వము మహాప్రవాహంవలె పుట్టుతుందంటారు. అందువల్లనే కవులుస్వయంగా పుట్టవలసిందే కాని తయారు చేస్తే కవులుకారని ఇంగ్లీషులో ప్రసిద్ధోక్తి ఉన్నది. గొప్ప కథకులుకూడా గొప్ప కవులవంటివాళ్లే. పద్యాలు అల్లినంత మాత్రంచేత కవిత్వంకాదు. కథలు అల్లినంతమాత్రాన అవి మంచికథ లనిపించుకోవు. కవిత్వమువలెనే కథలుకూడా ఆత్మలోనుంచి బలవంతాన పుట్టి పరిపక్వమైన కళాపూర్తితో బయలుపడ్డప్పుడే ఉత్తమశ్రేణిలోకి వస్తవి. ఈలలితకథావళిలో కథలు ఏవీ అట్లా పుట్టి బయలుపడ్డవికావు. ఈకథలు ప్రయత్నపూర్వకముగా అల్లినవి - అదికూడా వినోదార్థమే.

గొప్పరచయితలు వ్రాసే నవలలలోగాని కథలలోగాని వచ్చేపాత్రలు, అందరూ కాకపోయినా ముఖ్యులైనా, పాఠకుల మనస్సులలో గాఢంగా ముద్రితు లవుతారు. ఈపదకొండుకథలలో అటువంటిపాత్ర ఒక్కటీ లేదు. అటువంటిపాత్రలు చిత్రించవలెనని ఈకథలలో ప్రయత్నించారు. దయ మణిరాణి, జానకీబాయి, మయూరశర్మ, సభాపతయ్య, ఈలాటిపాత్రలలో విశిష్టత చూపవలెనని చూచినారు. కాని గ్రంథకర్త ప్రయత్నము నిష్ఫలమైనది.

కథాసంవిధానాలుకూడా అంతే. కథలు చాలావరకు ఒకపాత్ర తనకథచెప్పుతుంటూ ఉన్నట్లే ఉంటవి, ఇట్లా ఆత్మకథ చెప్పుతునేకథలకూ, గ్రంథకర్త తననోటిమీదుగా చెప్పేకథలకూ భేదము ఉండవలె. కాని ఇందులో కథలు ఒకపాత్రచేత చెప్పిస్తున్నా గ్రంథకర్త చెపుతున్న ధోరణివలెనే పోతున్నవి. దీన్నిబట్టి చూస్తే గ్రంథకర్త పాత్ర తనకథ చెప్పేటప్పుడు ఉండే మానసికస్థితిని చక్కగా ఊహించుకోలేకపోయినట్లు స్పష్టమవుతుంది. ఇది వివరించడానికి ఒక్కకథ ఉదాహరణముగా చూపుతాను.

మీనాక్షికథ- ఆకథ క్లుప్తంగా ఇది : ఒకానొక ఆంధ్రుడు పట్టభద్రుడై జీవనోపాధి దొరకక ఒకతెల్లదొరకు ఎండాకాలంలో తెలుగు చెప్పడానికి కొడైకనాలు వెళ్లినాడు. అక్కడికి చాలా కాలముకిందట తెలుగుదేశమునుంచి వచ్చి అక్కడ మిరాసీదారుగా ఉన్న సభాపతయ్యను చూడడానికి పోతే ఆయన తనయింట్లోనే భోజనాదులకు ఉండేట్లు చేస్తాడు. సభాపతయ్యభార్య కమలమ్మ. వాళ్ళకూతురు మీనాక్షి. మీనాక్షికికూడా ఈఆంధ్రుడు తెలుగు చెపుతాడు. దొర వేసగి సెలవులయి ఇంటికి తిరిగివెళ్ళినతరువాతకూడా సభాపతయ్య ఇతనిని తనయింటివద్దనే ఉంచుకుంటాడు. మీనాక్షికీ ఇతనికీ ప్రేమ కలుగుతుంది. సభాపతయ్య ఇతనికి తన ఏకపుత్రిక నిచ్చి వివాహము చేస్తానంటాడు. ఇతను తనతల్లిదండ్రుల అనుజ్ఞ తీసుకొనడానికి స్వదేశము వస్తాడు. వాళ్లు ఒప్పుకోరు. ఐనా మళ్ళీ తిరిగి కొడైకనాలు వచ్చి మీనాక్షిని మింజూరులో వివాహముచేసుకొని సభాపతయ్య ఆస్తికంతకూ కర్త అవుతాడు. ఆస్తి చేత చిక్కగానే దుర్వ్యసనాలలోకి అకస్మాత్తుగా ఇతను దిగుతాడు. నటేశము, శర్మ అనియిద్దరి దుస్సహవాసము కలుగుతుంది. భర్తవలెనే మీనాక్షికూడా అకస్మాత్తుగా మారిపోయి శర్మతో కళంకజీవితానికి అలవాటుపడుతుంది. ఒకరాత్రి వారు తోటలో ఉండగా తాగి పడిపోయిఉన్నకథానాయకుడు, దాహమై, తెలివివచ్చి, భార్య పక్కన లేనందున తోటలోకి వెళ్ళినాడు. మనుష్యుల అలికిడి విని టార్చిలైటు అనుకొని పిస్తోలు తీసి, స్విచ్చి నొక్కితే అది పేలి శర్మ చనిపోతాడు. సభాపతయ్యగారి పలుకుబడివల్ల ఆహత్య కోర్టుకు ఎక్కకుండా అణిగిపోతుంది. కథానాయకుడు మీనాక్షినీ ఆమెవల్ల కలిగినపిల్లవాణ్ణీ మామగారి ఆస్తితోపాటు వదలి దారిద్ర్యము ఆశ్రయిస్తాడు- ఇదీ కథ. ఈకథ కథానాయకుడు ఉత్తమపురుషలో చెప్పినాడు. చివరకు ఇంతటిమార్పువచ్చినవ్యక్తి తనపూర్వకథ చెప్పుతూవుంటే ప్రథమంనుంచీ ఈమార్పుచెందిన వ్యక్తి ద్యోతమౌతూ వుండవలె. కాని అటువంటి దేమీ లేదు. చూడండీ ఈకథ ఎట్లా ప్రారంభించినారో !

"కొడైకనాలుచేరిన సాయంకాలమే నేను దొరబంగాళా చూడబోయితిని ... నేటినుండి శాపగ్రహవిమోచనము కలిగి నాకు గురుడు ఉచ్చదశకు వచ్చినట్లు తోచెను !" తర్వాత మీనాక్షికీ తనకూ ఎట్లా నెమ్మదిగా ప్రేమ వృద్ధి అయినదో చెప్పినాడు. అందులో ఎక్కడాకూడా ఈకథ చెప్పుతున్నప్పుడు ఆమెమీద ఉండవలసిన అసహ్యము సూచనకూడా కాదు. దీనికి కారణమేమంటే గ్రంథకర్త కథానాయకుడిచేత కథచెప్పిస్తున్నాకూడా తానే కథ అల్లుతున్న సంగతి మరచిపోలేకపోయినారు. ఉత్తమపురుష వాడడమే తప్ప అంతా గ్రంథకర్త చెప్పినలాగానే ఉంటుంది కథ. పాశ్చాత్యకథకులు కొందరు ఉత్తమపురుషలో చక్కని కథలు వ్రాసినారు. వాటిలో ఉత్తమపురుష ఈగ్రంథకర్తకు నచ్చి అది ఇందులో అవలంబించినారు. అయితే వినోదార్థము అల్లిన కథ కాబట్టి తీవ్రముగా ఆకథ చెప్పుతున్నవాని మానసికస్థితిని ఊహించక వ్రాసుకొనిపోయినారు. అందువల్ల ఎంత అసంబద్ధముగా ఉంటుంది ! ఈలోపము ఉత్తమపురుషలో వ్రాసిన అన్నికథలలోనూ స్పష్టముగా కనబడుతుంది. ఇందులో కథలు చాలా భాగము అటువంటివే.

మొదటికథ రమణప్పరావి. ఇది దయ్యాలకథ. ఇందులో భయానకరసము వ్యక్తముకావలసింది "అలగ్జాండరు ఆలెను పో" వ్రాసిన కథలు జ్ఞాపకమువచ్చేటట్లు చేయవలసింది. కాని అట్లా చేస్తే

వినోదము ఉండదు. వినోదముకొరకు కాబట్టి కథ చెప్ప నయినది. పిచ్చుకపిల్ల అనే కథలో తనపిల్లను కోల్పోయిన కామాక్షి కాకులు పొడుస్తున్న పిచ్చుకపిల్లను తనకుమార్తెవలె మాదుగా పెంచుతుంది. కాని ఈకథాసందర్భములో గ్రంథకర్తకూడా అది పిచ్చుకపిల్ల అనేమాట మరచిపోయినట్లున్నారు. మనుష్యులు తాకిన పిచ్చుకలను మిగిలినపిచ్చుకలు దగ్గరకు రానీయవనే ప్రసిద్ధవిషయము మరచిపోయి అపిచ్చుక పెనిమిటితో కాపురము చేస్తూ పిల్లలు కంటూ కామాక్షివద్దకు పుట్టింటికి వస్తున్నట్లుకూడా వ్రాసినారు.

ఈవిధంగా కథలన్నిటిలోనూ చాలా లోపాలు ఉన్నవి. కాని అన్నిటికంటే గొప్పలోపము విశిష్టత ఎందులోనూ లేకపోవడమే.

గ్రంథకర్త సంఘసంస్కరణాభిలాష కలవారని ప్రసిద్ధి. కందుకూరి వీరేశలింగము పంతులు గారితో కలిసి సంఘసంస్కరణకు పాటుపడ్డవారని వాడుక. అయితే ఈకథలలో మొత్తముమీద పూర్వాచారమందే అభిమాన మున్నట్లు స్పష్టమవుతుంది. కులాంతరులలో వివాహములూ, పఙ్తి భోజనములూ జరగడము ఇష్టము కానట్లు ధ్వనిస్తుంది. విద్యకై విదేశయాత్ర చేయడముకూడా గ్రంథ కర్తకు సమ్మతమైనట్లు తోచదు. కాని ఈపూర్వాచారాలయందు అభిమానమైనా వేదశాస్త్రము లలో విశ్వాసము ఉండడమువల్ల కాదు.

గ్రంథములో మొత్తాన ఒక్కటి స్పష్టమవుతుంది. ధనము జాగ్రతగా కాపాడుకొని మితవ్యయమే చేస్తూ వుండవలె. ఈసంగతి ఈకథలలో ముఖ్యముగా ప్రతివారూ గమనించదగినది.

ఇంకొక్కవిషయము మాత్రము ఎత్తుకోనిదే ఇది పూర్తిచేయలేము. అది భాషావిషయము! దీని లోనిభాష ఏమిభాష? ఇది గ్రాంథికమా లేక వ్యావహారికమా? ఏమయినా వ్యవస్థ ఇందులో ఉన్నదా?

మొత్తముమీద చూస్తే గ్రంథకర్త ఒకవ్యవస్థ పెట్టుకొనట్లు తోస్తుంది: సంభాషణసందర్భ ములలో వ్యావహారికభాష, మిగిలినచోట్ల గ్రాంథికము వ్రాయవలెనని గ్రంథకర్త ప్రయత్నమని అను కొంటాము. కాని రెండుప్రయత్నములూ విఫల మయినవి.

గ్రాంథికభాషగా వ్రాయదలచిన చోట్లలో వ్యావహారిక భాషాప్రయోగములు దొర్లినవి. శ్రీగిడుగువారు ఘోషిస్తున్నట్లు కృతకభాష పడ్డది. ౬ వ పేజీలో "తృప్తిశాంతిలేక చనిపోయిన యావిప్రునిజీవుం డంత బ్రహ్మరాక్షసియై"– ఇక్కడ 'బ్రహ్మరాక్షసి' పుంలింగములోకూడా ప్రయోగించడము లోకవ్యవహారములో ఉన్నది. గ్రాంథికమైతే ఈ స్త్రీలింగరూపము రాదు. కూతుని జీవితము (౪) ముదుసలి (౮) వంశీయులు (౭) వినవచ్చుటయేగాని (౫) అంతర్వర్ణ వివాహము (వేరువేరువర్ణములవారికి ఒకరితో ఒకరికి వివాహము అనే అర్థములో) (౧౧౫)– గ్రాంథికభాష ఈవిధముగా ఉన్నది.

ఇక ఇందులోని వ్యావహారికభాషకు ఉదాహరణము:– మంగలిమాటలు – "తరతరములనుండి మావంశము బ్రాహ్మణభక్తికి ప్రసిద్ధికెక్కినది. ఈయమంగళకార్యము నీకైనను అయుక్తమని తెలియవద్దటయ్యా;" "చేమ్మడా ఇట్టి చెడుపనులు మాయింట జరుగగూడదు!" ఈవిధముగా వాడుకభాషకూడా తృప్తిగాలేదు.

సంభాషణలో వాడుకభాష పెట్టవలెనని ప్రయత్నించిన గ్రంథకర్త – ఈకథలు చాలాభాగము కథానాయకులో కథలోనిపాత్రలో తమకథచెప్పినట్లుగా వ్రాసినవే కదా, మరి ఎందుకు వ్యావహారిక భాషే ప్రయోగించవలెననుకోలేదో ఊహించలేము. వినోదార్థము కథల్లిన గ్రంథకర్త బహుశా ఈసంగతులు క్షుణ్ణముగా ఆలోచించి ఉండరు.

ఇకముందు కథలు వినోదార్థము వ్రాయడము మాని శ్రమపడి హృదయంగమముగా సందర్భశుద్ధితో, కలగాపులగము కాకుండా శుద్ధమైన వ్యావహారిక భాషలో చక్కని కథలు వ్రాసి ప్రకటిస్తారని ఆశిస్తున్నాము. ప్రాచ్యపాశ్చాత్యభాషలలో విద్వత్తుకల ఈగ్రంథకర్తవంటివారు కథారచనలలో ఉత్తమమార్గాలు చూపకపోతే ఇక ఎవరు చూపగలరు !

శాస్త్రి.

## మాలతీమాధవము

జనమంచి వేంకటరామయ్య ఆంధ్రీకరించినది.

పుటలు 142- వెల 1-4-0

ప్రకాశకులు జనమంచివారు : రాజమహేంద్రవరము

భవభూతి రచించిన మూడు నాటకములు మనకు లభ్యమవుతున్నవి. ఉత్తరరామచరితము జగద్విదితము. అనేకులు దాన్ని తెలిగించారు. 'మహావీరచరితము' అంత ప్రసిద్ధంకాదు. దాను శ్రీరామకవి అనువాదం మాత్రం నాకు తెలుసును. "మాలతీమాధవీయము" అనే పేరుతో శ్రీరామకవీ, పైపేరుతో వెంకటరామయ్యగారూ తెలిగించిన గ్రంథాలు మాత్రం చదివాను.

మాలతీమాధవము భవభూతి మొదటి నాటకమని తోస్తుంది. మహావిద్వాంసుడూ, మహాకవీ అయినా దృశ్యకావ్యం చేస్తే, ఆకాలపు కుకవులు (విమర్శకులు) ఆక్షేపించినట్టు కనపిస్తుంది. అలా కాకపోతే కోమలహృదయం గలిగిన భవభూతి బాధపడి, గంభీరుడు కావడంచేత —

యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ

అని ఎందుకు వ్రాయవలసివస్తుంది ? లలితకవి కాళిదాసునుకూడా విమర్శకులు బాధిస్తే, ఆయన-

పురాణ మిత్యేవ న సాధు సర్వం
నచాపి కావ్యం నవ మిత్యవద్యమ్.
సన్తః పరీక్ష్యా న్యతర ద్భజన్తే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః

అని చెప్పుకోవలసి వచ్చింది.

అవును- కొత్తది బయలుదేరితే అంగీకారం పొందడం కష్టం. భవభూతి నవీనకథావస్తువుతో నాటకం వ్రాసినాడు. కథాబీజం 'బృహత్కథ'లో ఉన్నప్పటికీ వస్తువు ఉత్పాద్యమే. రామాయణ, మహాభారతాదులలోనుంచి స్వీకరించిన వస్తువే ప్రసిద్ధమైన దని ప్రాచీనాలంకారికుల ఉద్దేశ్యం. తర్వాతగాని 'బృహత్కథను' approved list లో చేర్చలేదు. ఉత్పాద్యవిషయంలో పది అంకాల

ప్రకరణం రచించిన కవిని శ్రోత్రియులు ఆక్షేపించడంలో ఆశ్చర్యం లేదు. జ్ఞాననిధి అనే సార్థక నామధేయుడైన గురువువద్ద విద్య అభ్యసించి, శ్రీకంఠపదలాంఛితుడై, పదవాక్యప్రమాణజ్ఞుడైన పంక్తిపావనుడు భవభూతికి ఆక్షేపణ తప్పకపోవడం సామాన్యకవులసంగతి చెప్ప నవసరం లేదు. అంతటివాడు ఆయన నాటకరచన మానుకోక మరిరెండు రూపకాలు చేయడం సారస్వత ప్రపంచాదృష్టం బాగుండడంవల్లనే!

కొంతమంది 'ఉత్పాద్యవిషయ మేమిటి! గౌరవార్హం కా' దన్నారు. మరికొందరు 'ఈయన శ్రోత్రియకుటుంబంలోవాడు. వేదవేదాంగాలూ షడ్దర్శనాలూ చదివినవాడు. అవన్నీ ఇందులో ఎక్కిస్తాడు. ఇటువంటివాడు నాటకం రచించడ మేమిటి' అన్నారు. అందుకు కవి ఇలా అన్నాడు.

వేదపఠన మేల, వేదాంతసాంఖ్య యో
గములు నేల, నాటకములకు అర్థ
గౌరవంబు వాగుదారతయును ప్రౌఢి.
తగును పాండితీవిదగ్ధతలకు.

ఇలా అన్నప్పటికీ, మాలతీమాధవ ప్రకరణాన్ని యోగపరంగా సమన్వయించే విద్వాంసు లున్నారు. నాటకం యోగపరంగా సమన్వయ మయినా దోషంకాదు.

కాలప్రియానాథుని యాత్రామహోత్సవసందర్భంలో ఈనాటకం మొదటిసారి ప్రదర్శించి నప్పుడు చూచిన కొందరు ఆలోచకులు ఇది నాటకమే కాదన్నారు. ఏవేవో ఆక్షేపాలు చేశారు. వాటికి సమాధానప్రాయంగా భవభూతి ప్రస్తావనలో మార్పులు చేశాడు.

ఇది రంగప్రదర్శనయోగ్యం అవునా కాదా ? కాదని అనేకు లంటారు. Maurice Maetclinerk అనే బెల్జియం నాటకకర్త చేసిన Blue Bird అనే మహారూపకం ప్రదర్శన యోగ్యం ఎంత మాత్రం కాదని నటులు వాదిస్తే, రష్యానటశేఖరుడు Stanisloviskey (స్తనిస్లావిస్కీ) తయారుచేసి రక్తికట్టించాడు. ఏం చెప్పగలం ! మొదట మనోరంగం బాగా ఉంటే. ...

మహాకవి భవభూతి ప్రేమలో విఫలమనోరథుడు అయి ఉండాలి. ఆ సుకుమారహృదయం ఎన్ని బాధలు పడ్డదో! అలా కాకపోతే మాలతీమాధవ ఉత్తరరామచరితలు కడుపులో చల్లకదలనివాడు రచించగలడా! జీవితంలో ఎప్పుడూ కల్లకిల ఈత మీద తాకేవాడికి ప్రేమలోతు తెలుస్తుందా! వియోగస్వరూపం గోచరిస్తుందా ! పుస్తకాలు చదివి వ్రాసిన పుస్తకాలు కావు ఇవి. అనుభూతిలో సముద్రమథనం జరిగేటప్పుడు బయలువెలిన రత్నాలు !

కాబట్టే మాలతీ మాధవంలో 'ప్రథమ ప్రణయం' మహాద్భుతంగా వర్ణించాడు కవి. ఇంతహృదయంగమమైన నాటకం మరొకటి లేదు. 'మల్లికామారుతము' ఉన్నదంటే, అది దీనికి నకలు !

ప్రేమ అంటే, అదేదో తలపెట్టగూడనిది అనే భావం మన దేశంలో చాలా ప్రబలిపోయింది. ప్రేమస్వరూపం అవగత మయి, అనుభూతిలోకి వస్తే ఎటువంటి పరివర్తనం కలుగుతుంది! శరీరం దూష్య మని, సాంగత్యం పనికి రాదని పిడివాదం చేసేవారికి భవభూతి పద్యం ఒకటి వినిపిస్తాను.

అతిముక్తకగ్రథిత కేసరావలీ
పతితాధవాసమభగార్పిత స్తనమ్
అపి కంఠజామదనిబేకితాననః
ప్రియయా తదంగ పరిశ్రుత్తి కాల్పయామ్.

అలమ్ !

భవభూతి వాణి ఆంధ్రీకరణానికి అందేది కాదు. అనేకులు ప్రయత్నించారు. కృతకృత్యులైన వారు లేరు. ఆంధ్రీకరించేవారి అసమర్థత అనుకోవడం కంటె నాటకకర్త అతిలోకసామర్థ్యమే దీనికి కారణం.

వెంకటరామయ్యగారి అనువాదము సరళంగానే ఉన్నది. తెలుగులో ఎంతవరకు కొద్దిలో అవకాశ మున్నదో అంతవరకూ సరసంగా నడిపించారు. దిఙ్మాత్రంగా వారి పద్యాలు మూలమూ, అనువాదమూ చూడవచ్చు:—

పశ్యామి తా మిత ఇతఃపురతశ్చ పశ్చా
ద న్తర్బహిః పరితఏవ వివర్తమానామ్
ఉద్బుద్ధ ముగ్ధ కనకాబ్జ నిభం వహన్తీ
మాసంగి తిర్యగపవర్తితదృష్టి వక్త్రమ్.
విచ్చు పొందామరవు నీడు వచ్చు ముద్దు
మొగము నావంక దిప్పిన మగువ మిన్న
కానబడెడు నాకు వివర్తమాన యగుచు
నిట, నావల. లో, వెలి, నెల్లయెడల.

సంభూయేవ సుఖాని చేతసి పరం భూమాన మాతన్వతే
యత్రాలోకపథావతారిణి రతిం ప్రస్తౌతి నేత్రోత్సవః
యద్బాలేన్దు కలోచ్చయా దుపచితై స్సారై రివోత్పాదితం
తత్పశ్యేయ మనఙ్గమఙ్గలగృహం భూయోపి తస్యా ముఖమ్.
పొదలుం దేని గనుంగొనన్ హృది సుఖంబుల్ గుప్పలుం దెప్పలై,
యెది కోర్కుల్ నిగిడించు గన్నులకు దా నింపై, కడుం బొల్పునే
యది బాలేందు కళోచ్ఛయోపచిత సారాంశప్రభూతంబు నా
నది వీక్షింతు ననంగదేవ నిలయం బా మోము నింకొక్కమాఱ్.

చూడా పీడకపాలసంకులగలన్మందాకినీ వారయో
విద్యుత్ప్రాయ లలాటలోచన శిఖిజ్వాలా విమిశ్రత్విషః
పాన్తు త్వా మకఠోరకైతకశిఖా సందిగ్ధముగ్ధేన్దవో
భూతేశస్య భుజఙ్గవల్లివలయ స్రఙ్నద్ధజూటా జటాః !
సురనది నీరు నెట్టెముగ జుట్టిన పుఱ్ఱల దండ నిండగం
బ్రిరుచులు మించు లీనగల ఫాలవిలోచనకీలికీలతో
బెరయ, నవేందురేఖ మఱపింపగ గోమలకేతకీశిఖల్
సరులుగ సర్పవల్లుల బెనంగు మహేశుజడల్ శుభం బిడున్ !

కైలాసవాసి వెంకటరామయ్యగారు ఇహలీలలో మేఘదూతము, ఉత్తరరామచరితము, విద్ధసాలభంజిక తెలిగించారట. వారిపుత్రులు ఆపుస్తకాలు ప్రకటిస్తారని నమ్ముతాము.

గ్రీకుభాషానాటకాలను ఇంగ్లీషులోకి Dr. Way, Professor Gilbert Murray మొదలైన విద్వత్కవులు చేసినవిధంగా సంస్కృతరూపకాలను మన విద్వత్కవులు మళ్ళీ ఆంధ్రీకరిస్తే బాగుండును !

## సిందుబాదు కథలు.

సచిత్రము : 66 పుటలు : వెల 0–5–0

మొసలికంటి సంజీవరావు : విశాఖపట్నం

'యవనయామినీవినోదములు' 'వేయిన్నొక్క రాత్రులు.' 'అరబ్బీరాత్రి కథలు' అనే పేర్లతో Arabian Nights Entertainments మన గ్రంథకర్తలు కొందరు తెలుగుచేశారు. సంజీవరావు గారు అందులో సిందుబాదుకథలు ఏడూ, గూనివానికథ ఒకటి కలిపి ఈచిన్నపుస్తకం తయారు చేశారు. ఇంగ్లీషు తర్జుమాలలో ఏది అనుసరించారో తెలియదు. అన్నింటిలోకీ Sir Richard Burton అనువాదం చాలా ప్రశస్తమైనది.

ఈకథాసముచ్చయం ఉత్తమశ్రేణిలోది. భావనాశక్తిని పురికొల్పడానికీ, మనస్సును విశాల - అనంతసీమలలోకి తీసుకుపోవడానికీ చాలా ఉపకరిస్తుంది. విద్యార్థిదశలో చాలా మంది ఈకథలు చదువుతారు; అయితే ఎంతమంది పుస్తకం పూర్తిగా చదువుతారో తెలియదు. సంగ్రహించిన గ్రంథంగానీ కొన్నికథలుగాని చదివి సంతృప్తిపడతారు. Gulliver's Travells, Robinson Crusoe, Swiss Family Robinson మొదలైన కథాగ్రంథాలు అనేకులు పూర్తిగా చదవరు.

సంజీవరావుగారు కథ చెప్పడంలో నేర్పరి. ఇదివరలో చాలా పుస్తకాలు తెలిగించడంవల్ల వీరి లేఖిని అశ్రమంగా నడుస్తుంది. అయితే ఈకథాసంగ్రహం వాడుకభాషలో ఉంటే ఎక్కువ హృదయంగమంగా ఉండేది. మనకు 'బాలవాఙ్మయం' చాలా తక్కువ. పాఠ్యపుస్తకశ్రేణిలో చేర్చవలెననే ఊహ విడిచిపెట్టి, మనకథకులు చింతా దీక్షితులుగారివలె పుస్తకాలను జీవద్భాషలో రచించడం ధర్మం.

మనగ్రంథకర్తలలో అరబ్బీభాషబాగా వచ్చినవారు ఎవరైనా ఉంటే, ఈకథాసముచ్చయాన్ని సరళమైన వాడుక తెనుగులో వ్రాసి ప్రకటిస్తే బాగుండును!

## గృహలక్ష్మి కంఠాభరణం

సంపాదకుడు : వసుమర్తి కృష్ణమూర్తి

గృహలక్ష్మి కార్యాలయం, ఎగ్మోరు, మద్రాసు.

వెల : తెలియదు.

గృహలక్ష్మి అనే మాసపత్రికను ప్రారంభించి ఏడెనిమిది సంవత్సరాలుగా శ్రీ కేసరిగారు ఆంధ్రమహిళలకు చేస్తున్న సేవ అపారమయినది. చక్కని ఏకవర్ణ త్రివర్ణ చిత్రపటాలతో, ముచ్చటైన ఆకృతితో, ప్రధానంగా స్త్రీసంబంధి – స్త్రీరచిత వ్యాసాలతో గృహలక్ష్మి తెలుగు దేశంలో ఉత్తమపత్రికలలో వకటి అనిపించుకున్నది. దానికి సహాయసంపాదకులుగా వుండేవారు శ్రీ కృష్ణమూర్తిగారు. సంగీతసాహిత్యాలలో మంచి అభినివేశం కలవారు.

ఆంధ్రరమణీమణులను అలంకరించడానికి ఈ కంఠాభరణాన్ని అందచందాలు అలవరించి రచించారు. కృష్ణమూర్తిగారు. గృహలక్ష్మిలో అప్పుడప్పుడూ ప్రకటించబడ్డ ఏకవర్ణ త్రివర్ణచిత్రాలను-శ్లోకులు వృథాపోకుండా - అన్నీ ఏకత్రా సమకూర్చి సరస - సముచిత - సంగ్రహ వ్యాఖ్యలతో సహా ఈ సంపుటాన్ని తయారుచేశారు. ఇలాంటి ప్రయత్నాలకు తెలుగులో ఇదే మొదటిదనవచ్చు. పాశ్చాత్యదేశాల్లో ఇలాంటివి చాలా వున్నవి. ముఖ్యంగా ఆర్థర్ మీ మహాశయుడు ప్రకటించిన బాలవిజ్ఞానసర్వస్వం (Children Encyclopedia), దేశాలూ - ప్రజలూ (Lands & Peoples) వంటివి చాలా ఉత్తమమైనవి. ఈకంఠాభరణంగూడా వాటిలాగానే చిత్రపటాలతో - వాటికి వ్యాఖ్యలతో - బాలికలకు ఉత్తమవిషయాలను హృదయంగమంగా ప్రత్యక్షపద్ధతిని బోధించడానికి ఉద్దేశపడ్డది. సర్వథా యీప్రయత్నం శ్లాఘ్యం.

వివిధవిషయాలకు సంబంధించి - వివిధనీతులను బోధించే పెక్కుచిత్రాలను సేకరించి, క్రమం ఏర్పరచి చక్కగా ముద్రించారు. వ్యాఖ్యలుగూడా నాతిదీర్ఘంగా, నాతిలఘువుగా-యథోచితంగా వ్రాశారు. రచనావిధానంలో అవలంబించిన పద్ధతిగూడా ఆహ్లాదకరమై - బాలికలకు - సుకుమార బుద్ధులకు - చదవడానికి చవులూరుతూ ఆకర్షవంతంగా ఉంది. లోకోక్తులు, ఉపమానాలు, ఉదాహరణాలు - అన్నీ యథాస్థానంలో చక్కగా అమరివున్నవి. సంపాదకులు - వ్యాఖ్యాతలు - కృష్ణమూర్తిగారు గృహలక్ష్మి సంపాదకులుగా వుండి, స్త్రీ - బాలికాహృదయాలను బాగా గమనించారు. వాళ్ళ అవసరాలూ, అభిరుచులూ, బాగా గ్రహించారు. పైగా వారివయస్సూ, విజ్ఞానమూ, ఈపనికి వారిని సర్వవిధాలా అర్హులని చాటుతున్నవి.

వ్యాఖ్యలలో ఉపయోగించిన భాష వ్యావహారికం. "మా అమ్మా అక్కయ్యా మొదలైనవాళ్ళు నన్నే భాషలో పెంచి పెద్దవాణ్ణిగా చేశారు అదే భాష" లో ఈగ్రంథం వ్రాస్తున్నట్లు వ్యాఖ్యాత చెప్పినాడు. కృష్ణమూర్తిగారు దేశకాలములను గుర్తించిన పండితులు. ఉచితమైన సంస్కరణాన్ని ఉదార హృదయంతో ఆహ్వానించే ఉత్తమపండితులు. భాషావిషయంలో నేడు రాదగ్గ మార్పును వారు సంపూర్ణంగా స్వీకరించారు. తనకు కన్నబిడ్డలలాంటి తెనుగు బాలికలతో సంభాషించేటప్పుడు కృతకమైన గ్రాంథికం ఉపయోగించక సజీవమైన, స్వాదువైన వ్యావహారికాన్నే స్వీకరించడం మాకు ఎంతో ఆనందం కలిగిస్తోంది. ...

ఇది "సత్సంప్రదాయసిద్ధమైన సదాచారమని" అభినవవాగనుశాసనులు ఆమోదించారు. అయితే ఈవ్యావహారిక భాషకుగూడా కృష్ణమూర్తిగారు కొంత ఛాందసాన్ని ఆపాదించారని చెప్పాలి.

'మనమూనూ' అనడానికి 'మనంవూఁను' అని - 'నడిపించడమే' అనడానికి 'నడిపించడంవేఁ' అని వ్యవహారత్వసిద్ధాంతానికి అతివ్యాప్తిదోషం పట్టించి అందులోనూ కొంత వీరత్వం చూపించారు.

'ఏమిటి' 'మనమే' వంటి మాటలు 'ఏంవిఁటి' 'మనంవేఁ' అని కృష్ణమూర్తిగారు వ్రాయుడములో విశేషమున్నది;" అని టీకాకర్తలు కొంత వివరణ వ్రాస్తూ ఉచ్చారణానుకూలమైన లిపిసంజ్ఞలు లేవని శలవిచ్చారు. అయితే ఇప్పటికే బోలెడు అక్షరాలతో తలమునకలుగా వున్న మనకు ఇంకా లిపిసంజ్ఞలు ఎందుకు? 'ఏమిటి' అనే దానిలోని 'మ' కారాన్నే ఉచ్చారణానుసారంగా చదువుకోగూడదా? 'మ' కారం పదాదిని వుంటే మకారోచ్చారణనే కలిగివుంటుంది. ఇతరస్థలాల్లో 'ంవ' కారోచ్చారణ కలిగించుకోండి. 'మామయ్య' అనే పదంలో మొదటి 'మ' కారం ముఖ్యోచ్చారణతో వుంటూనేవుంది రెండో 'మ' కారం వ్రాతలో ఎలావున్నా ఉచ్చారణలో 'ంవ' కారంగా వాడుకోవచ్చును. ఒకే అక్షరానికి స్థానభేదాన్నిబట్టి ఉచ్చారణభేదం కలిగించడం అరవంలో సంప్రదాయం. 'ంవ' కారానికి వేరే లిపిసంజ్ఞ తెచ్చుకునేకంటే ఈవిధంగా సరిపెట్టుకోవడం ఉచితం అనుకుంటా.

వ్యావహారికరచన అలవాటులేకపోవడంచేత కాబోలు భాష అంతటా ఒకేతీరుగా లేదు. విచారింతువేని- పెట్టుచున్నారు వంటి గ్రాంథికప్రయోగాలు బహుళంగా వున్నవి. 'చన్దమామ' - 'హైన్దవ' - 'గ్రిష్న' వంటివి వ్రాతలో ఛాందసంగా వుంటవి. 'పోవుమండి' - 'వుండిరయే' - 'చెప్పుచుండి' వంటిరూపాలు ఉభయభ్రష్టాలై కృత్రిమంగా ఉంటవి. 'చల్నీళ్ళు', అనే ఉచ్చారణ వర్ణోద్భవస్థానాలు నిష్కలుషంగా వుండే వాటిలో వినరావు. 'వాఙ్ఞ' అనేఉచ్చారణ అమితకృతకం- కటువుగా - వెగటుగా వుంటుంది. మొత్తానికి కొత్తగా వ్యావహారికభాషామతం పుచ్చుకున్న ఉద్ధృతీ - అపరిణతీ ఈరచనలలో బాగా గోచరిస్తున్నవి.

స్త్రీజనానికి ప్రధానంగా నాలుగుదశలలోనూ కావలసిన ఉపదేశం ఈగ్రంథంలో వున్నదని చెప్పవచ్చు. ఒక్కొక్క బొమ్మను ఆధారం చేసుకుని వ్యాఖ్యాత బాలికలకు ఎంతో ఉపదేశం - విలువగలవిషయం - బోధించారనవచ్చు. దేశంలో ప్రస్తుతం క్లిష్టంగా వున్న ఎన్నో సమస్యలను చిన్నపిల్లలకు సుబోధమయ్యేటట్లు, తేటతెనుగులో అరటిపండొలిచి చేతిలోపెట్టినట్లు స్పష్టంగా వివరించారు. నిజంగా తెలుగుకన్నెలకు ఈగ్రంథం మిక్కిలీ విలువగల నగ.

ఇక - బొమ్మలవిషయం కొంచెం : ఇందులోవున్న బొమ్మలు ఉత్తమ మధ్యమ అధమ - మూడు శ్రేణులకూ చెందుతున్నవి. చాలాబొమ్మలకు కర్తలపేర్లు లేవు. ఇది లోపమే అనాలి. ఈబొమ్మలను చూచి ఇంత నేర్చుకుంటున్న బాలికలు చిత్రకారుల పేర్లు తెలుసుకోవడానికి కుతూహల పడడం సహజం - సబబున్నూ. ఈచిత్రాలలో గౌరీపూజ, దుర్గాపూజ, అనసూయ సీతను దీవించుట, చిత్రాంగి, రాజ్యకాంక్ష, మాతృదేవత, బాగున్నవి. వీటిల్లో రామారావుగారి బొమ్మలు మరీ బాగున్నవి. దుర్గాపూజ, గౌరీపూజ, వీటిల్లో శిల్పియొక్క వర్ణసంకలనప్రతిభ బాగా గోచరిస్తోంది. వెలుగునీడల సమ్మేళనంవల్ల చిత్రానికి ఎంతో గాంభీర్యం, శక్తీ, ఆకర్షణా వస్తున్నవి. అచిత్రాంగిబొమ్మలో ప్రాధత్యం వొలికిపోతోంది. మిసమిసలాడే యౌవనం, అపరాని కామోద్రేకం, అతిలోకసౌందర్యం, తప అన్నీ వున్నవి దానిలో. దూమాదూ, జీర్ణకుసుమం, విరహిణి వగైరా మధ్యరకంగా వున్నవి. ఇక ఉష, సత్యామానిని వంటివి అధమంగా ఉన్నవి. ఈసంపుటానికి అవి కళంకంగా వుండి తెలుగు కన్నెల కళాహృదయాలకూ, కళాదృష్టికీ పీడాకరంగా వున్నవి. వీటినిబట్టి చూస్తే ఈసంపుటి తయారుచెయ్యడంలో కళాదృష్టి తక్కువని, నీతిబోధ ప్రధానమని తోస్తుంది. లేకపోతే ఆ బొమ్మలను ఆధారం చేసుకుని అంతనీతిబోధ సాయించిన సంపాదకులు వాటిలోని శిల్పకళారహస్యాలను గురించి ఒక్కముక్కయినా చెప్పకపోవడ మేమి ? ప్రకాశకులను అంత పొగడిగూడా చిత్రకారుల పేర్లయినా ప్రకటించకపోవడ మేమి ?

'విరహిణి' అనేపేరు ఏమో కృత్రిమంగా వుంది. విరహిణి అనగానే మనకు ప్రబంధాలూ, అలంకారశాస్త్రాలూ, గుర్తు వస్తవి. ఈబొమ్మలోని విరహిణి అలాకాకుండా చాలాసంసారపక్షంగా సహజంగా వుంది. "అర్ధనారీశ్వరుడు" అనే బొమ్మ తమాషాగా వుంది. శివుడిశరీరంలో ఎడమ భాగం పార్వతి ఆక్రమిస్తే శివుడు అర్ధనారీశ్వరుడైనాడని సంప్రదాయం. ఈబొమ్మలో అలా కాకుండా ఊర్ధ్వకాయం పార్వతీ, అధఃకాయం శివలింగమూ - అనూచానభావాలకు విరుద్ధంగా ఉంది. ఈబొమ్మ ఇలా వున్నా, దీనికి వ్యాఖ్యానం వ్రాస్తూ సంపాదకులు "కుడియెడమలు పురుష స్త్రీభాగములు" అనే వ్రాశారు.

ఇందులో ప్రకటించిన కొందరు నవయువస్త్రీల చిత్రములను త్రివర్ణములలో చేయించే భారం గృహలక్ష్మి వహించాలి. ఈపుస్తకం అచ్చుకట్టు చాలా బాగున్నది. త్రివర్ణచిత్రాలలో కొన్నిటి ముద్రణ అసంతృప్తికరంగా వున్నది. ముద్రణకళను తెలుగువాళ్లు ఇంకా ఎంతో వృద్ధిచేసుకోవలసి వున్నది.

ఈ సంపుటి ప్రచురించి సంపాదకులూ, ప్రకాశకులూ, ఒక చక్కని త్రోవ తెరిచారు. ఆ త్రోవన ఇంకా ఎన్ని సంపుటాలు వస్తవో చూడాలి. ఈ సంపుటికి శ్రీ మహోపాధ్యాయ, వ్యాకరణాచార్య, రావుసాహెబు, గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు పీఠిక వ్రాశారు. శ్రీ కావ్య వ్యాకరణతీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు మదింపుమాటలు వ్రాశారు. రెండూ ఈ సంపుటి గౌరవానికి ఉత్కర్ష హేతువులే. ప్రతియింటా ఈ పుస్తకం ఉండదగినది. ప్రతిబాలికా దీన్ని చదివి విజ్ఞానం గడించవలసినది. సంపాదకులనూ, ప్రకాశకులనూ మనసా అభినందిస్తున్నాము.

‘పా’

## ఏకతార

కర్త: ఈ. భాష్యకాచార్యులు

ఏకతార అనే పుస్తకాన్ని ఓపికతో చదివాను. రివ్యూ వ్రాయవలసివచ్చింది గనక విమర్శక ధర్మానికి కట్టుబడి అనుపదద్విగుణీకృతమవుతున్న మానసిక యాతనను సహించి అన్ని పద్యాలూ చదివాను. కావ్యం - కవిత్వం నిజంగా హృదయానికి ఆహ్లాదం, ఆత్మకు ఆనందం కలిగించడానికే అయితే ఈ పుస్తకం కావ్యమూ కాదు - ఈ పద్యాలు కవిత్వమూ కావు ఏ పద్యమయినా బాగుంటుందేమో అని దీక్షగా వెతికాను. ఊహుఁ!

" రాత్రిర్గమిష్యతి భవిష్యతి చ ప్రభాతం
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః
ఇత్థం విచింతయతి కోశగతే ద్విరేఫే
హా హంత హంత నళినీం గజ ఉజ్జహార "

అనే సుభాషితానందంలోని ఒక్క శ్లోకాన్ని ఆధారంగా తీసుకుని గ్రంథకర్త తాను విద్వాన్ తరగతిలో సంపాదించిన అలంకారశాస్త్ర పరిచయలేశాన్ని పురస్కరించుకుని 161 పద్యాలు గల ఈ పుస్తకం వ్రాశాడు. మూలశ్లోకంలో ఒక్కొక్క మాటలో ప్రస్ఫుటమవుతున్న ఔత్సుక్యం ఆఖరు పాదంలో ‘హా హంత’ అని హఠాత్తుగా విచ్ఛిన్నమై తీక్ష్ణమైన శోకభావాన్ని ప్రతిపాదించి క్షణంలో కరుణం పుట్టిస్తోంది. అంత జిగి, పదను గల శ్లోకంలోని చిక్కని రసాన్ని ఈ గ్రంథకర్త పీపానీళ్ళల్లో కలిపి 161 గ్లాసుల్లో పోసి మన కందిస్తున్నాడు. రసస్పర్శ ఏమూల అణిగిపోయిందో అంతే లేదు.

మూలశ్లోకంలో కరుణ రసపర్యవసాయి అయిన కథను కొంత అధికప్రసక్తి కలిపి కరుణవిప్రలంభం సాధించావంటూ ఈ గ్రంథకర్త అసలు గ్రంథంలో లేని రసాన్ని గురించి బోలెడు చర్చ చేశాడు. పుస్తకం చదువుతున్నంతసేపూ అనుపదమూ ఆంధ్రవాఙ్మయానికీ - కవితాకళకూ ఈ కవి చేసిన దౌర్జన్యానికి రౌద్రరసంలో తేలుతున్న నేను పీఠికలో చేసిన రసచర్చ చదివి ఇందులో కరుణవిప్రలంభంగాని, మరేరసంగాని ఎక్కడ వున్నదబ్బా అని ఆశ్చర్యపడ్డాను. పోనీ అని మళ్ళీ చదివాను - మళ్ళీ చదివాను - మళ్ళీ - ఊహుఁ! రసం లేదు దబ్బా లేదు. పట్టి పేలవంది! పద్యాలన్నీ కొరుకొన్న కర్రలకల్లె చప్పగా నీరసంగా వున్నవి.

పీఠిక చదవడం ప్రారంభిస్తే అంతా నకటే పొగడ్త. ఎవరబ్బా యీ పీఠికకర్త! ఇతని కేమి మతిపోలేదు గదా! అనుకుంటూవుండగా చివర 'గ్రంథకర్త' అని కనబడ్డది. 26 పుటలు స్వ... మర్దనరతిలో ఒడలు మరచిపోయిన గ్రంథకర్తలలో ఈయనే మొదటివాడేమో!

వేదాంత దేశికుల హంససందేశం - కాళిదాసు మేఘ సందేశం ఖండకావ్యాలట. ఈకృతికూడా అలాంటిదేనట! మేఘసందేశంలోగాని హంససందేశంలోగాని కథ ఏమీలేదు. ఉన్నదే ఒకఘట్టం. ఈ పుస్తకంలో మధుకరీమధుకరముల కథ చాలా నడిచింది. ఏమధుకరవిలాపమోమాత్రమే వ్రాసి వుంటే ఇది ఖండకావ్యం అవును. అయితే గియితే యిది కావ్యమే అవుతుంది. కావ్య ఖండకావ్యాలను గురించి ఈయన ప్రసంగం అసంతృప్తికరంగా - అసమంజసంగా వుంది. ఈ ఖండకావ్యాలు "భావకవితాసరస్వతి కాటుపట్టు" లట. అంటే "వివిధభావములతోనలరారు కవిత్వమని" యర్థమట. తిక్కనకవిత్వం, పెద్దనకవిత్వం ఇలాంటివేనట. "ధూమజ్యోతిస్సలిలమరుతాం" అని కాళిదాసు "ఆకాలమునాటి ప్రకృతిశాస్త్రజ్ఞానమునందలి భావములను" మేఘసందేశంలో చెప్పాడట. భావకవిత్వం అంటే ఇదిట. ఈగ్రంథములో అలాంటి భావకవిత్వం వుండిట. ఏమిటో అయోమయపు వ్రాతలు - అర్థంలేని నిర్వచనాలున్నూ.

తర్వాత కథాసారం పేజీన్నరలో నివేదించారు. నామకరణౌచిత్యం వివరించారు. శ్లోకంలోని తుమ్మెద వచ్చి స్వర్గంలో తనభార్యతో కలుసుకుంటుంది. వాటిదేహాల్లోనించి తేజస్సులు బయలుదేరి రెండూకలిసి ఒకనక్షత్రం అవుతవి. ఇది ఏకతార కావున నీనామకరణ మెంతయు సుచితమగుచున్నది అంటారు.

గ్రంథాలు మంగళాదీని - మంగళమధ్యాని మంగళాంతాని - ట. ఈగ్రంథకర్త శ్రమపడి ఈ గ్రంథాన్ని సర్వమంగళం చేశాట్ట. ఇందులో ఏవో ధ్వని విశేషా లున్నవంటూ కొన్నిపద్యాలుదాహరించి "కాబట్టి యిది ధ్వనిప్రధానంబగు నుత్తమ కావ్యమగుచున్నది" అని తీర్పు చేశాడు. ఈయన ధ్వని అనుకున్నవన్నీ నిజంగా కావ్యార్థ సూచనలేకాని ధ్వని కాదు. ఇందులో ప్రతిపద్యంలోనూ ఏదో అలంకారము వున్నదంటూ పద్యాలు ఉదాహరించారు. ఎన్ని అలంకారాలుంటేనేం? పద్యాలన్నీ శవప్రాయంగా కొయ్యబారి వున్నవే తప్ప ఒకదానిలోనూ చైతన్యమూ, కళా, కనబడవు.

"దధతో బహుశైవలక్ష్మతాం" అన్న నైషధశ్లోకాన్ని "బహుశైవలక్ష్మతంగలుగు కతన" అని ఆంధ్రీకరించారట. ఈపీఠికలోని ఆంధ్రీకరణ, భాషాంతరీకరణ, అనువాదశబ్దాలకు అర్థం ఏమిటో! 'లక్ష్మతంగలుగు' అనేప్రయోగం పొసగుతుందా? 'కలుగు' సకర్మకమా? అకర్మకమా? ఇలాంటి విరుద్ధప్రయోగాలూ, అన్వయరహితవాక్యాలూ, ఈగ్రంథంనిండా వున్నవి. "హరిణాంకాకృతి బాల్చె రేకయి ఘనంబై బింబమై "అన్నవసుచరిత్ర పద్యపాదాన్ని "మొక్కయుం గొమ్మునై యట్టి యొక్కసగము నగుచు బింబంబునై" అని "మనోహరముగ" ననువదించారట. భట్టుమూర్తికవితతో తన కవితను పోటీపెట్టి తనదే బాగున్నదని నిశ్చయముగా చాటుకొనగల ఈగ్రంథకర్త సాహసం జుగుప్స కలిగిస్తోంది.

"సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అన్న కాళిదాసోక్తిని "గట్టిగ సంశయంబు పొడకట్టిన సజ్జనకోటి యప్పుడుం దిట్టమగుం బ్రమాణమగు ధీరతరంబగు చిత్తవృత్తియే" అని అనువదించారు. కాళిదాసుని మితభాషిత్వం - ఈయన వాచాలత్వం తెలుస్తూనే వున్నవి.

"వ్యక్తులవి భిన్నకేళ సంబాహులయ్యు" అనేపద్యంలో ఏదో ధ్వని వున్నదట. ధ్వనిమాటచెప్పలేము గాని భిన్నలింగసాంకర్యం అనే కావ్యదోషం మాత్రం ప్రత్యక్షంగా వుంది.

"ఇందలి శైలి మృదుమధురము" అని కొన్ని పద్యా లుదాహరించారు.

"పతిరక్తి సంపత్తి పతిభక్తి సంయుక్తి
కలుగుట ఫలమైన గణ్యశార."

ఇదే సరళమైన శైలి అంటే ఈ గ్రంధకర్త మానసికస్థితి నార్మల్ స్టేటులో లేదనే చెప్పాలి.

ఇందలి ఛందస్సు రసానుగుణంగా మార్చబడ్డదట. మత్తగజవర్ణనయందు "కరిబృంహితవృత్తం" వాడారట. కరిబృంహితం ఏనుగు అరచే సందర్భంలో వ్రాయవచ్చు. దాని గమనాది వైచిత్రి వర్ణించేటప్పుడు వ్రాస్తే మత్తేభం వ్రాయాలి. ఇల్లా పద్యాలన్నింటికీ ప్రయోజనం ఉన్నదంటే కంద పద్యాలు ఎప్పుడు వ్రాసివుంటారు? చెయ్యి దురదపుడితేనా? సీసాలు దేనికి వ్రాసివుంటారు? ...

ఇకచాలు... ఇందులో ఒక్క పద్యమయినా చదవదగ్గది లేదు. ఛందస్సు నేర్చుకున్న కొత్తలో వ్రాసినట్లున్నని. అన్వయం అపరిణతంగా వుంది. అర్థస్ఫూర్తి లేదు.

జంకు, గొంకు లేకుండా - లోకం అపహసిస్తుందనే భీతిలేకుండా - ఈనీరసపద్యకంకాళాలను ప్రకటించడమే కాకుండా, 26 పుటలపీఠికలో అనుపదమూ ఆత్మశ్లాఘ చేసుకుంటూ పరవశుడౌతున్న ఈ గ్రంథకర్త మనస్సు లోకసామాన్యమైన స్థితిలో లేదు. దీనికి చికిత్స అవసరం - అంటే సంస్కారం అనుకోండి.

ఈయన మద్రాసు విశ్వవిద్యాలయంలో Board of studies లో సభ్యుడు. ఈయన ఉత్సాహం చూస్తే తప్పక ఇది పఠనీయ గ్రంధంగా బోర్డులోందని తోస్తుంది. ఈయన సభ్యుడైన మద్రాసు యునివర్శిటీలో దీన్ని పెట్టడానికి చట్టంవప్పుకోదు. గనక ఈ దుర్విధి - ఆంధ్రయునివర్శిటీకి తప్పదు. ఆంధ్రవిద్యార్థులు ఈ పుస్తకాన్ని చదవక తప్పదేమో.

ఆంధ్రులబహుజన్మకృతపాపఫలమైన ఈపుస్తకాన్ని సమీక్ష చేయవలసినవిధి నా పాలబడ్డాది - శివ ! శివ !! శివ !!!

'పా'

*

## సమీపార్థం చేరిన గ్రంధము

కాశీ హిందూవిశ్వవిద్యాలయములో రసాయనశాస్త్రోపన్యాసకులు
కాళీపట్నపు కొండయ్యగారు, ఎం. ఎస్. సి. (నవ్యసాహిత్యపరిషత్) రచించిన

## విశ్వరూపం

పుటలు 12 + 278. వెల రూ 2
ప్రకాశకులు : ఆంధ్రవిశ్వకళాపరిషత్తు : వాల్తేరు
వచ్చేసంచికలో ఈగ్రంధం విపులంగా విమర్శిస్తాము.

సం.

# సంపాదకీయ వ్యాసములు

## మాతృభాషలో విద్యాబోధనము

పాతికసంవత్సరములకు పైగా ఈవిషయమునుగురించి మనదేశములోని వివిధ విద్యాసంస్థలలో తీవ్రరూపమైన చర్చ సాగుతున్నది. మాతృభాషలోనే సమస్త విద్యలూ నేర్పడము వెంటనే అమలులో పెట్టవలెనని ఎందరెందరో ఎన్నికగన్న విద్వాంసులు చెప్పి ఉన్నారు. ఈవిషయము పరిశోధనపూర్వకముగా నిర్ధారించుటకు వివిధప్రాంతాలలోని పాఠశాలలలో కొంతమంది విద్యార్థులకు ఆంగ్ల భాషద్వారానూ, కొందరికి మాతృభాషలోనూ, విద్య కరపి చూచి మాతృభాషలో బోధించడమువల్ల విద్యార్థు లెంతో సులభముగా ఆయా విషయములు అవగాహన చేసుకొంటున్నారనీ, గణితమూ, ప్రకృతిశాస్త్రములూ, దేశచరిత్ర మొదలైన వన్నీ ఆంగ్లములోగాక మాతృభాషలోనే బోధిస్తూవచ్చినా ఆవిధముగా తరబీతైన విద్యార్థులు తదితరులకంటె ఆంగ్లభాషాజ్ఞానములో వెనకబడి ఉండలేదు సరేగదా ఆభాషలో వారికంటె దిట్టమైన జ్ఞానము అలవరచుకొన్నారనీ నిరూపించినారు. ఈవిషయము బాగా పర్యాలోచించేగదా ఆంధ్రవిశ్వవిద్యాలయచట్టములో మాతృభాషద్వారా బోధించడము ఈకళాపరిషత్తుప్రధానాశయములలో ఒకటిగా పేర్కొన్నారు. ఈవిశ్వవిద్యాలయము ప్రజలలోని విద్యాదారిద్ర్యమును కొంతవరకైనా తొలగిస్తుందని ఆశపెట్టుకొన్నది ఇందువల్లనే గదా!

ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రారంభోత్సవము జరిగిననాడు ఈవిషయమే అందరి నోటా వచ్చి దేశమంతటా మారుమోగింది. ఒక చక్కని ప్రణాళిక వెంటనే తయారు చేసుకోవలెనని విశ్వవిద్యాలయాధికారులు నిశ్చయించుకొని 1926 అక్టోబరు 2 వ తేదీని 'వర్నాక్యులరైజేషనుకమిటీ' ఏర్పాటు చేసినారు. ఆకమిటీవారు చేసిన నివేదిక, ఇద్దరు ముగ్గురు సభ్యులు స్వల్పవిషయములలో భిన్నాభిప్రాయులుగా ఉన్నా, సంతృప్తికరముగా ఉన్నదనీ, తెలుగువారీవిషయములో ముందంజవేసి ఇతరవిశ్వవిద్యాలయాలకు మార్గదర్శకు లవుతారనీ దేశము ఆశించింది. కాని ఈనాడు ఈసమస్య ఏస్థితిలో ఉన్నదీ అని చూచుకొంటే వెనకటికంటె మనము రెండడుగులు వెనకకు వేసినామని తేలుతున్నది. ఇంటర్, బి. ఏ. తరగతులలో తెలుగుమీడియము పెట్టలేదు సరేగదా మెట్రిక్యులేషను పరీక్షలో ప్రశ్నపత్రముల కన్నిటికీ విద్యార్థులు తెలుగులోనే విధిగా జవాబులు వ్రాయవలెనని పెట్టిన నియమముకూడా నిరర్థకము చేసినారు.

ఈ పరిస్థితులకు కారణమేమో, ఎవరు ఎందువల్ల అడ్డు తగులుతున్నారో, పరీక్షించవలసి ఉన్నది. 'వర్నాక్యులరైజేషనుకమిటీ'వారి నివేదికలోని సూచనలు

సిండికేటువారు ఆచరణలో పెట్టకుండా ఎప్పటికప్పుడు తప్పించుకొంటూ ఏడేని మిది సంవత్సరాలనుంచి గడుపుకొంటూ వచ్చినారు. సెనెటుసభలో గట్టిగా ఎవరైనా ప్రశ్నిస్తే వచ్చేసమావేశములో సమాధానము చెప్పతామని అధి కారులు సెలవిచ్చేవారు.

1936 ఆగస్టు నెలలో జరిగిన 'సెనెటు, ఎకడమిక్ కౌన్సిలు' సమావేశాలలో ఈవిషయము చర్చకు వచ్చినది. సెనెటుసమావేశారంభములోనే ఉపాధ్యాయుల వారు అప్రసక్తముగా తమ అభిప్రాయాలను వ్యక్తము చేసినారు. తెలుగులో విద్యాబోధనము చేస్తే, ఇతర హైందనవిశ్వవిద్యాలయములలో మాతృభాష ద్వారా విద్య గరపడము లేదు గనుక, ఇంగ్లీషుమహాసముద్రములో తెలుగు ద్వీపమును ఏర్పరచుకొన్నట్లు ఉంటుందని చెప్పినారు. ఐ. సి. యస్. పరీక్షలకూ, పాశ్చాత్యదేశాలలో ఉన్నత విద్యాభ్యాసము కొరకూ, వెళ్ళదలచుకొన్న వారికి ఈ విధానమువల్ల కష్టము కలుగుతుందని ఇంకొక కారణముకూడా చెప్పినారు. అధికారములో ఉన్నవారినోట ఈపలుకులు రావడము చూచి ఆంధ్రేతరులూ, ఆంగ్లభాషావ్యామోహపూరితులైన మనవారు కొందరూ చేరి, ఎకడమిక్ కౌన్సిలులో డాక్టరు కృష్ణారావుగారు తెలుగు మీడియము వచ్చే సంవత్సరమునుంచి అమలులో పెట్టవలసినదని ఉపపాదించిన తీర్మానానికి వ్యతి రేకముగా ఉండి చివరకు ఈసమస్యకు యథాస్థానోద్వాసనము కల్పించినారు.

ఈసమావేశము జరిగిన సాయంత్రమే పట్టప్రదానోత్సవసమయములో వి ద్యాంగమంత్రిగారు తమ ఉద్బోధనవాక్యాలలో మన విశ్వవిద్యాలయవిశిష్ట త్వము ఉగ్గడిస్తూ, మాతృభాషలో విద్య కరపే విషయములో మనము ముందంజ వేసినామని, పాపము! వాస్తవము తెలియకపోవడమువల్ల, సగర్వముగా పలికినారు. ఈ సమస్యనుగురించి ఎంతో ఉత్సాహముతో చెప్పిన వారిమాటలు వింటూ ఉన్నంతసేపూ ఎకడమిక్ కౌన్సిలులో వ్యతిరేకముగా మాట్లాడినవా రందరూ పశ్చాత్తాపపడి 'ఈ ఉపన్యాసమే ఎకడమిక్ కౌన్సిలు సమావేశానికి ముందు చెప్పి ఉంటే కృష్ణారావుగారి తీర్మానమునకు ఈపాట్లు వచ్చేవి కా'వని గుసగుస లాడు కొన్నారు.

ఈవిషయమునుగురించి తాతలనాటి ఆ అపోహలే పెట్టుకొని ఉండడమూ, పాడి నదేపాటగా లేనిపోనిపాతకారణాలే ఏకరువుపెట్టి వ్యతిరేకముగా ప్రచారము చెయ్యడమూ ఒకవంకనూ, తమ ఉపాధ్యాయపదవులకు ఎక్కడ భంగము కలుగుతుందో అనే ఆంధ్రేతరులభయము ఇంకొకవంకనూ, ఈవిషయపరిష్కా రానికి ఆటంకము కలిగిస్తున్నవి. వీరు చెప్పేకారణము లేవీ అంతగా గమనింప దగ్గవి కావు గనుక, విశ్వవిద్యాలయాధికారులు అనవసరముగా కాలవిలంబము

చేస్తున్నారు గనుక, ఈకార్యము కేవలము వారికే విడిచిపెట్టకుండా దేశములోని విద్యావంతులూ మాతృభాషాభిమానులూ, ప్రజలలో విజ్ఞానదారిద్ర్యము తొలగించవలెనని పూనుకొన్నవారూ ఒకసంఘముగా ఏర్పడి ఒక ప్రణాళిక వేసి కళాపరిషత్తువారి కిచ్చి ఈసమస్యను శీఘ్రముగా పరిష్కరించ వలసినదని హెచ్చరిస్తున్నాము.

## ప్రజా సారస్వతము

విద్యాబోధనము మాతృభాషలో జరగకపోతే విద్వాంసులు తమకు తెలిసిన ఆయా శాస్త్రవిషయములను ప్రజలలో వ్యాపింపజేయడము ఎప్పటికైనా సాధ్యమవుతుందా ? అవి వ్యక్తముచేయడమునకు అనువైనపదజాలమూ, భాషాసామగ్రి ఏనాటికైనా ఏర్పడుతవా ?

అక్షరజ్ఞానమున్నవారందరూ దేశపాలకులు కాబోతున్నారు. వారిలో విజ్ఞానము వ్యాపించకుంటే, జనసంఖ్యలో నూటికి తొంభైమంది జనపదవాసులై, వారు నిరక్షరకుక్షులూ, విద్యాగంధశూన్యులూ అయిఉంటే, స్వరాజ్య మెట్లు సిద్ధిస్తుంది ? సిద్ధించినా క్రమనిర్వహణ మెట్లుసాధ్యమవుతుంది ? గ్రామపునర్నిర్మాణానికి బద్ధకంకణులైన గాంధీగారు సామాన్యప్రజలకోసము వ్యావహారిక భాషలో సర్వవిషయములను గురించిన్ని సుబోధమయేరీతిని గ్రంథజాలము నిర్మించవలసినదని బహుదూరదృష్టితోనూ,ఉదారాశయముతోనూ హెచ్చరించినారు. వారి ఆజ్ఞ అవశ్యాచరణీయము.

పత్రికాప్రపంచము వారి ఉద్బోధనగురించి చాలా అనుకూలముగా ప్రచారము చేసినది. జనవాణి పత్రికకూడా ప్రజావాఙ్మయసృష్టినిగురించి తీవ్రముగా వాదించి తనపేరు ఇంతవరకైనా సార్థకము చేసుకొన్నది.

పాశ్చాత్యదేశాలలో చదవనూ వ్రాయనూ తెలియనివారు సామాన్యముగా ఉండరు. అక్షరజ్ఞానము కలవా రందరూ తమతమవృత్తులకు సంబంధించిన గ్రంథములూ పత్రికలూ చదువుకొంటూ నూతనవిషయము లెప్పటికప్పుడు నేర్చుకొంటూ ఉంటారు. సుప్రసిద్ధశాస్త్రజ్ఞులు జనసామాన్యానికి బోధపడే విధముగా తాము పరిశోధించి కనుగొన్న నూతనవిషయములను గురించి ఉపన్యసిస్తూ గ్రంథరచన చేస్తూ ఉంటారు. అందువల్ల ఆదేశాలలో సర్వతోముఖమైన విజ్ఞానము ప్రజలకు అలవడుతుంది. మనదేశములో ఆ పరిస్థితు లేర్పడవలెనంటే శాస్త్రవిషయములు తేలికగా బోధించడమునకు వీలు కలిగేటట్లు దేశభాషలను సరిదిద్దుకోవలెను. అక్షరాలు కూడబలుకుకొని చదువుకొనేవారికైనా విషయము తెలిసేటట్లు గ్రంథరచన చేయవలెను. ఇట్టి ప్రయత్నము ప్రజలవిద్యాదారిద్ర్య మెట్టిదో బాగా తెలిసిఉన్నవారూ,ఏవిధముగా వారికి వివిధశాస్త్రవిషయములలో

...రుచి కలిగించడానికి వీలుపడుతుందో అనుభవపూర్వకముగా ఎరిగినవారూ ...యదగ్గదే కాని సామాన్యులు చేపట్టవలసినది కాదు. ఈప్రయత్నము ఆరంభ దశలో సరళమార్గములో పడకపోతే ఉద్యమానికే భంగము కలుగుతుంది. దేశనాయకులు శ్రద్ధతో ప్రజావాఙ్మయసృష్టికి తగినమార్గము ఏర్పరచవలెను.

## ఇప్పటి ప్రజావాఙ్మయము

వినోదముకోసము ఏదైనా చదవవలె ననే అభిలాష ప్రజలలో అమితముగా ఉన్నది. రైళ్ళలోనూ, కోర్టులవద్దనూ, ఉండే జనులు ఏదో ఒకపత్రిక పట్టుకొని చదువుతూ ఉండడమూ, స్టేషనులవద్దనూ కచేరీలప్రాంతములలోనూ కాఫీదుకాణాల ఎదుటనూ, పత్రికలు విరివిగా అమ్మకము అవుతూ ఉండడమూ అందరూ ఎరిగినవిషయమే. అయితే ప్రజలలో ఈఅభిలాష ఇంత అధికముగా ఉన్నందుకు పత్రికాప్రకటనము చేసేవారు సదభిప్రాయముతో — ప్రజలలో విజ్ఞాన వ్యాప్తి చేయడముకోసము ఉదాత్తవిషయములూ, కొత్తసంగతులూ ప్రకటించిన్నీ, సరసముగానూ ఆహ్లాదకరముగానూ ఉండే పాటలూ పదములూ మొదలైనవి ప్రకటించిన్నీ, ప్రజాసేవచేయవలసిఉన్నది. మనదేశములో ఇప్పుడు పత్రికల సంఖ్యా విషయములో ఏమీ కొదువలేదుగాని అవి నిర్వహిస్తున్న పని మాత్రము ఏమీ తృప్తికరముగాలేదు. కథలకు వస్తువు శృంగారవిషయము మొక్కటే అనీ, హాస్యానికల్లా మూలము స్త్రీలజీవితము అవినీతికరముగా ఉన్నట్లు నిరూపించి అతివిస్తారముగా అసభ్యవర్ణనముచేయడమనీ, ఈమొదలైన అభిప్రాయాలు ఇప్పటి చిల్లరరచయితలలో వ్యాపించి ఉన్నవి. 'జుగుప్సాకరమైన వ్రాతలూ, వాటికనుగుణముగా ఉండే చిత్రపటములూ ప్రకటిస్తూఉన్న పత్రికలు దేశములోని అన్ని భాషలలోను అన్నిప్రాంతములలోను చెలామణీ అవుతూ ఉండడము విషాదకరముగా ఉన్నదనీ, ఇట్టి వాఙ్మయమూ, చిత్రలేఖనమూ అరిష్టదాయకములనీ, స్త్రీలవిషయమై వ్రాసేటప్పుడు మాతృభావమూ, ఉత్కృష్టప్రేమభావమూ మనసులో పెట్టుకొని వ్రాయవలె' ననీ, గాంధీజీ సెలవిచ్చినారు. ఏదేశములో ప్రజలకు స్త్రీలయెడల గౌరవభావము ఉంటుందో అదే నాగరకమైన దేశము. ఇతర దేశము లేవీ కళ్లు తెరవని స్థితిలో ఉన్న అతిప్రాచీనకాలములోనే భారతభూమి అట్టి నాగరకతకు ప్రసిద్ధిపొందినది. మన పురాతనపు పేరు ప్రతిష్ఠలకుగానీ, భావికాలములో దేశములో మనము కల్పించుకోవలసిన పరిస్థితులకుగానీ ఇప్పటి ఈవాఙ్మయము సరిపడదు. దేశనాయకులూ భాషాసారస్వతనియంతలూ ఈవిషయములో మూకీభావము వహించి ఉండడము దేశమునకు క్షేమము కాదు.

*

# వీ ణ

సంపాదకుడు : పాటిబండ మాధవ శర్మ, ఎం. ఏ., (ఆనర్సు)

మాసపత్రిక. చక్కనిగేయములు, పద్యములు, వ్యాసములు, కథలు ఉంటవి. చందా రూ ౧.

"వీ ణ" ఆఫీసు, తేలప్రోలు, కృష్ణాజిల్లా.

---

# ఉ ద యి ని

సంపాదకుడు : కొంపెల్ల జనార్ధన రావు

నవీనులరచనలు ప్రధానముగా ఉండే సాహిత్యవిషయక మాసపత్రిక

ఇందులో కిరణాలు, శృంగాటకము, వాఙ్మయ వీధి - సరసములు, భావోత్తేజకములు

సంవత్సరపు చందా రు ౪

15 ఆదెప్ప ముదలివీధి - వేపేరి - మద్రాసు

---

# ప్ర తి భ

త్రైమాసిక పత్రిక — సంవత్సరపు చందా రూ ౨

# క దం బ ము

పద్యకావ్యసంపుటి : కవిమిత్రులు రచించినది

ఇందులో నలుగురు ఆధునిక కవులు రచించిన ఖండికలు, గేయములు ఉన్నవి. ౦-౪-౦

# భాగవతావతరణము

నోరి నరసింహ శాస్త్రి ప్రణీతము

చిన్నపద్యనాటిక. కృష్ణద్వైపాయనునకు భాగవతరచనకు ప్రరోచనము

మొదలైన విషయాలు వర్ణితములు. వెల ౦-౪-౦

# పద్మావతీ చరణ చారణ చక్రవర్తి

తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి విరచితము

ఇది మూడురంగముల పద్యనాటిక. గీతగోవింద కావ్యప్రశస్తి ఇందులో కలదు.

వెల ౦-౬-౦. పరిషత్సభ్యులకు ౦-౩-౦

# నవ్యసాహిత్యపరిషత్తు : గుంటూరు

# శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములు

## ౧ : వ్యాససంగ్రహము A MISCELLANY OF PAPERS

పంతులుగారి వ్యావహారిక భాషాభిమానమును గురించి వారి ౭౦ వ జన్మదినమున విద్వాంసులు సమర్పించిన వివిధ విషయిక వ్యాసముల సంపుటము రూ. ౨-౮-౦

## ౨ : వ్యాసావళి

భాషాతత్త్వప్రదర్శనపూర్వకముగాను, ఆంగ్లసంస్కృతాది భాషావాఙ్మయచరిత్రములతో పోల్చిచెప్పి ఆంధ్రభాషాపరిణామమును నిరూపించే వ్యాససంపుటము రూ. ౧

## ౩ : బాలకవిశరణ్యము

పండితులు లక్షణవిరుద్ధములనీ, గ్రామ్యములనీ నిందించిన రూపములు నిర్దుష్టములని కవుల ప్రయోగములు ఉదాహరించి నిరూపించిన లక్షణగ్రంథము. రూ. ౧-౮-౦

## ౪ : ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము

శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రులుగారి విమర్శలలోని ఆంధ్రభాషా పాండిత్య పరిశీలనము. రూ. ౧

## ౫ : గద్యచింతామణి

వచన రచనా సంప్రదాయమును నిరూపించుటకుగాను ప్రాచ్య లిఖిత పుస్తక భాండారము మొదలైన తావులలోని ముద్రితాముద్రిత గ్రంథములనుండి సంతరించిన గద్యభాగముల సంపుటము. రూ. ౧-౮-౦.

## నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు

Edited, Printed and Published by T. Venkataratnam, *M.A., L.T.*,
Chandrika Press : Guntur